జ్ఞాని పురుష్ దాదా భగవాన్ నిర్వచించిన

# తల్లి-తండ్రి, పిల్లల వ్యవహారం



Telugu

జ్ఞాని పురుష్ దాదా భగవాన్ నిర్వచించిన

# తల్లి-తండ్రి, పిల్లల వ్యవహారం

మూల గుజరాతి సంకలనం - డా.నీరు బెహన్ అమీన్

తెలుగు అనువాదం - మహాత్మగణం

# త్రిమంత్రం

(నర్వ విఘ్న నివారణ చేసే మంత్రం)



నమో అరిహంతాణం

నమో సిద్ధాణం



నమో ఆయరియాణం

నమో ఉవజ్ఝాయాణం

నమో లోయే సవ్వ సాహూణం

ఏసోపంచణమోక్కారో,

సవ్వాపావప్పణాసణో

మంగళా ణం చ సవ్వేసిం,

వదమం హవయీ మంగళం

ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో శివాయ

జై సచ్చిదానంద





# జ్ఞాని పురుషుని పరిచయం

అది 1958వ సంవత్సరం జూన్ నెలలో ఒకనాటి సాయంత్రం సుమారు ఆరు గంటల సమయం, పశ్చిమ భారత దేశంలోని దక్షిణ గుజరాత్‌లోని ఒక పట్టణమైన సూరత్ రైల్వే స్టేషను. అంబాలాల్ మూల్‌జీ భాయ్ పటేల్ నామధేయుడు, వృత్తిరీత్యా కాంట్రాక్టరూ అయిన ఒక గృహస్థుడు జనసమూహంతో రద్దీగా వున్న సూరత్ స్టేషన్‌లోని మూడవ నెంబరు ప్లాట్‌ఫాం బెంచిపైన కూర్చుని ఉన్నారు. ఆ సమయంలో నలభైఎనిమిది నిమిషలపాటు ఒక అద్భుతం జరిగింది. అకస్మాత్తుగా అంబాలాల్ మూల్‌జీభాయ్ పటేల్‌లోని ఆత్మ సాక్షాత్కారమైంది. ఆ సమయంలో అతని అహంకారం సమూలంగా దగ్ధమైపోయింది. ఆ క్షణం నుంచి అతను అంబాలాల్ యొక్క ఆలోచనలు, వాక్కు మరియు క్రియలన్నింటి నుంచి పూర్తిగా వేరుచేయబడి, జ్ఞానమార్గం ద్వారా మానవాళికి ముక్తిని ప్రసాదించే నిమిత్తం భగవంతుని చేతిలో సజీవ పరికరంగా మారారు. ఆయన తనకు ప్రకటితమైన పరమాత్మని దాదాభగవాన్ అని పిలిచారు. "ఈ పరమాత్మ, దాదాభగవాన్ నాలో పూర్ణరూపంలో వ్యక్తమైనాడు; మీలో అవ్యక్తంగా ఉన్నాడు. భేదం ఇంతమాత్రమే. ఆయన జీవులందరిలోను విరాజమానుడై ఉన్నాడు" అని తనను కల్సిన ప్రతి ఒక్కరితోనూ చెప్పేవారు.

మనం ఎవరము? భగవంతుడంటే ఏమిటి? జగత్తును ఎవరు నడిపిస్తున్నారు? కర్మ ఏమిటి? మోక్షం ఏమిటి? ఇత్యాది సమస్త ఆధ్యాత్మిక ప్రశ్నలకు ఆ సందర్భంలో సమాధానం లభించింది. ప్రకృతి శ్రీ అంబాలాల్ మూల్‌జీ భాయ్ పటేల్ ద్వారా ప్రపంచానికి సంపూర్ణ తత్త్వరహస్యాన్ని వెల్లడిచేసింది.

శ్రీ అంబాలాల్ జన్మస్థలం బరోడా పట్టణ సమీపంలోని తారాసలి; పెరిగింది గుజరాత్‌లోని బాదరణ్ గ్రామం. ఆయన ధర్మపత్ని హీరాబా. వృత్తిరీత్యా కాంట్రాక్టరు అయినప్పటికీ ఆత్మసాక్షాత్కారం పొందటానికి ముందు కూడా అతని వ్యావహారిక జీవనం ఇంట్లోను, చుట్టు ప్రక్కలవారితోను కూడా ఎంతో ఆదర్శప్రాయంగా ఉండేది. ఆత్మ సాక్షాత్కారం పొందిన తరువాత జ్ఞానిగా ఆయన జీవితం ప్రజలకే అంకితమైంది.

వ్యాపారంలో ధర్మం ఉండాలి, ధర్మంలో వ్యాపారం ఉండకూడదు అనే నియమాన్ని ఆయన జీవితమంతా అమలుపరచారు. భక్తులచే దాదాశ్రీగా పిలువబడే ఆయన ఎన్నడూ ఎవరినుంచీ స్వంత ఖర్చుల నిమిత్తం ధనాన్ని స్వీకరించలేదు. పైగా తనకు వ్యాపారంలో లభించిన లాభాలను, భక్తులను భారతదేశంలోని వివిధ యాత్రా స్థలాలకు తీసికొనివెళ్లటానికి వినియోగించేవారు.

దాదాజీ మాటలు అక్రమవిజ్ఞాన్‌గా పిలువబడే కొత్త, డైరెక్ట్ మరియు మెట్లదారికాని లిఫ్ట్ మార్గమైన ఆత్మానుభూతి మార్గానికి పునాది అయ్యాయి. అతడు తన దివ్య ప్రాచీన ప్రయోగం (జ్ఞాన విధి) ద్వారా కేవలం రెండు గంటలలో ఈ జ్ఞానాన్ని ఇతరులకు అందచేశారు. ఇప్పటికీ వేలకొలది ముముక్షువులు పొందుతూనే ఉన్నారు. అక్రమమార్గం అంటే మెట్లు లేనిది, లిఫ్ట్‌మార్గం లేక షార్ట్‌కట్ మార్గం. క్రమ మార్గం అనగా మెట్టుతర్వాత మెట్టుక్రమంగా ఎక్కే ఆధ్యాత్మిక మార్గం. ఇపుడు అక్రమమార్గం ఆత్మానుభూతి నిమిత్తం డైరెక్ట్, షార్ట్‌కట్ మార్గంగా గుర్తింపబడింది.

## దాదా భగవాన్ ఎవరు?

దాదా భగవాన్ ఎవరు? అనే విషయాన్ని వివరిస్తూ ఆయన ఇలా అన్నారు :

"మీకు కన్పించేది 'దాదాభగవాన్' కాదు. మీరు చూస్తున్నది ఎ.ఎమ్. పటేల్‌ని. జ్ఞానిపురుషుడనైనా నాలోపల పూర్ణరూపంలో వ్యక్తమైన భగవంతుడు 'దాదాభగవాన్'. ఆయన చతుర్దశ భువనాలకు ప్రభువు. ఆ దాదాభగవాన్ మీలోను, ప్రతి ఒక్కరిలోను కూడా ఉన్నారు. మీలో అవ్యక్తరూపంలో ఉంటే, ఇక్కడ (ఎ.ఎమ్. పటేల్ దేహంలో) సంపూర్ణంగా అభివ్యక్తమైనాడు. నేను దాదా భగవాన్ కాదు. నాలోపలి దాదాభగవాన్‌కి నేను కూడా నమస్కరిస్తాను.

## జ్ఞాన (ఆత్మజ్ఞాన) ప్రాప్తికై వర్తమానలింక్

"నేను స్వయంగా సిద్ధులను (ప్రత్యేక ఆధ్యాత్మిక శక్తులను) కొద్దిమందికి ప్రసాదించబోతున్నాను. నేను వెళ్లిపోయిన తర్వాత వాటి అవసరం ఉండదా? భవిష్యతరాల ప్రజలకు ఈ మార్గం యొక్క అవసరం ఉంటుంది, అవునా?"

**-దాదా శ్రీ**

పరమపూజ్య దాదాశ్రీ గ్రామ గ్రామమూ, దేశవిదేశాలు పర్యటించి ముముక్షువులకు సత్సంగంతోపాటు ఆత్మజ్ఞాన ప్రాప్తిని కలిగించారు. దానితోపాటు సంఘీభావంతో కూడిన ప్రాపంచిక వ్యవహార జ్ఞానాన్ని కూడా తనను కల్సిన వారందరికీ అందించారు. ఆయన తన అవసానదశలో, 1987 చివర్లో తన కార్యాన్ని కొనసాగించే నిమిత్తం డాక్టరు నీరుబెన్ అమీన్‌కి సిద్దులను అనుగ్రహించారు.

పరమపూజ్య దాదాశ్రీ జనవరి 2, 1988న దేహత్యాగం చేసిన తర్వాత డా॥ నీరుబేన్ భారతదేశ గ్రామాలలోనూ, పట్టణాలలోనూ, ప్రపంచంలోని అన్ని ఇతర దేశాలలోనూ పర్యటిస్తూ దాదాశ్రీ కార్యాన్ని కొనసాగించారు. మార్చి 19, 2006న దేహత్యాగం చేసేవరకు ఆమె అక్రమవిజ్ఞాన్‌కి దాదాశ్రీ ప్రతినిధిగా వున్నారు. దేహ త్యాగానికిముందు ఆమె కార్యభారాన్ని శ్రీ దీపక్ భాయ్ దేశాయ్‌కి అప్పగించారు. ఆధునిక కాలంలో ఆత్మానుభూతికి సరళమూ మరియు డైరెక్ట్ మార్గంద్వారా అక్రమ విజ్ఞానాన్ని వ్యాపింపచేయటంలో డా. నీరుబెన్ సాధనం ఆయి ప్రముఖ పాత్రను పోషించారు. లక్షల కొలది ముముక్షువులు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొన్నారు. వారు తమ సంసార బాధ్యతలు నిర్వర్తిస్తూ కూడా స్వేచ్ఛను, శాంతిని, ఆత్మరమణత యొక్క అనుభూతిని పొందుతున్నారు.

అక్రమ విజ్ఞాన సత్సంగం నిర్వహించే నిమిత్తం జ్ఞాని పురుష్ దాదాశ్రీ పూజ్య నీరుబెన్ అమీన్ సమక్షంలో శ్రీ దీపక్‌భాయ్ దేశాయ్‌కి సిద్ధిని ప్రదానం చేశారు. 1988-2006 మధ్యకాలంలో దాదాశ్రీ దిశానిర్దేశానుసారం, డా. నీరుబెన్

అమీన్ నాయకత్వంలో దేశవిదేశాలలో శ్రీ దీపక్ భాయ్ సత్సంగ్ ఇపుడు పూర్తిస్థాయిలో ఆత్మజ్ఞాని శ్రీ దీపక్ భాయ్ దేశాయ్ మాధ్యమం ద్వారా కొనసాగుతున్నాయి.

శాస్త్రాలలోని శక్తివంతమైన మోక్షకాంక్షను వృద్ధి చేయటంలో సహకరిస్తూ ఆ మార్గానికి ప్రాతినిధ్యం వహిస్తాయి. ముముక్షువులందరికీ ఆత్మజ్ఞానమే అంతిమ లక్ష్యం. స్వరూప జ్ఞానం లేకుంటే మోక్షం లేదు. ఈ జ్ఞానం పుస్తకాలలో లభించదు. అది జ్ఞాని హృదయంలో వుంటుంది. కనుక ఆత్తజ్ఞానాన్ని ప్రత్యక్షజ్ఞాని నుంచి మాత్రమే పొందగలం. అక్రమ విజ్ఞాన్ యొక్క విజ్ఞాన ప్రయోగం ద్వారా ప్రత్యక్ష జ్ఞానినుంచి నేడుకూడ ప్రతి ఒక్కరూ ఆత్మజ్ఞానాన్ని పొందవచ్చు. ఒక జ్యోతి మాత్రమే మరొక దీపాన్ని వెలిగించగలదు.

## అనువాదకుని విజ్ఞప్తి

అంబాలాల్ ఎమ్. పటేల్ నామధేయులైన జ్ఞానిపురుషుని దాదాశ్రీ లేక దాదాశ్రీ గా భక్తులందరూ పిలుస్తారు. ఆత్మ విజ్ఞాన సంబంధమైన, ప్రపంచ వ్యవహార జ్ఞాన సంబంధమైన తన సత్సంగాన్ని యధాతథంగా అనువదించటం సాధ్యం కాదని ఆయన తరచూ చెప్పేవారు. అనువాద క్రమంలో లోతైన, సహేతుకమైన అర్థం ముముక్షువులకు అందకపోవచ్చు అనికూడా దాదాశ్రీ చెప్పేవారు. గుజరాతీ భాషని నేర్చుకోవటంలోని ప్రాముఖ్యతను ఆయన నొక్కి వక్కాణించేవారు. తద్వారానే దాదాశ్రీ అమూల్యమైన బోధల సంపూర్ణసారాన్ని యధాతథంగా గ్రహించే అవకాశం ఉంటుందని దాదా మాటల సారాంశం.

అయినప్పటికీ దాదాశ్రీ తన బోధలను ఇంగ్లీషు మరియు ఇతర భాషలలోకి అరువదించటానికి, తద్వారా ప్రపంచంలోని మానవాళి పొంది తమ బాధలనుంచి విముక్తి పొందాలని, జీవన్ముక్తిని అనుభవించాలని దాదాజీ యొక్క ప్రగాఢమైన వాంఛ. ఈ విజ్ఞానం కూడా దాదాజీ చెప్పారు.

జ్ఞానిపురుషులైన దాదాజీ బోధలను తెలుగుభాష ద్వారా తెలుగు ప్రజలకు అందించటం కోసం చేసిన చిన్న ప్రయత్న ఫలమే ఈ పుస్తకం యొక్క అనువాదం. యధాతథంగా అందించలేకపోయినా సత్సంగ సందేశాన్ని, భావాన్ని ఎటువంటి చెఱుపు లేకుండా అందించడంకోసం ఎంతో శ్రద్ధ వహించటం జరిగింది.

అనంతమైన దాదాజీ జ్ఞాన ఖజానాకి ఇది ప్రాథమిక పరిచయం మాత్రమే. ఈ అనువాదంలో ఏమైన తప్పులు దొర్లివుంటే అవి పూర్తిగా అనువాదకులవే అని గమనించగలరు. వాటినిమిత్తమై మేము మీ క్షమను అర్థిస్తున్నాము.

# సమర్పణ

అనాది కాలం నుంచీ తల్లిదండ్రులు, పిల్లల వ్యవహారం
రాగద్వేషాలు, మమతల బంధం వలన చెడిపోతూవస్తోంది
చెప్పలేరు, సహించివుండలేరు, ఇక ఏం చేస్తారు?
ఎవరిని అడిగితే ఎవరు చెప్తారు అందుకు ఉపాయం?

రాముడు, దశరథుడు, శ్రేణికుడు కూడా చిక్కుకుపోయినవారే
శ్రవణుని మరణానికి తల్లిదండ్రులు ఆర్తనాదం చేసారు
పెళ్ళి తర్వాత 'గురువు' భార్యని మళ్ళీ మళ్ళీ అడుగుతాడు
ఈ త్రికోణంలో ఏం చెయ్యాలి, తరుణోపాయం చెప్పండని

ఈకాలం పిల్లలు తల్లిదండ్రులతోనే జగడమాడుతారు
'జనరేషన్ గ్యాప్' వలన పెద్ద అగాధం ఏర్పడింది
మోక్షమే ధ్యేయంగా పెట్టుకుని సంసారసాగరాన్ని ఈదు
నావనెవరు నడుపుతారు? నావేమో నడి సముద్రంలో ఉంది

ఇప్పటివరకు జ్ఞానులు వైరాగ్యం గురించి చెప్పారు
పిల్లలను కన్నవాళ్ళు ఆలోచనలో పడ్డారు వీతరాగులెలా అవాలని
సంసారం చేస్తూనే మోక్షమార్గంలో నడవచ్చని చెప్పలేదెవ్వరూ
కలికాలానికి తగ్గట్టుగా 'దాదాజీ' అక్రమమార్గాన్ని సూచించారు

సంసారంలో ఉంటూనే వీతరాగులు అవగలుగుతారు
ఈ విషయంలో దాదా ప్రజ్వలింపజేసారు ఒక జ్యోతిని
ఆ జ్యోతి వెలుగులో ముముక్షువులు మోక్షాన్ని పొందుతారు
ఇక్కడ సత్యాన్ని తెలుసుకుంటారు, దివ్యచక్షువులను పొందుతారు

ఆ వెలుగు కిరణాలు ఈ గ్రంథంలో ప్రకాశితమయ్యాయి
తల్లిదండ్రులు, పిల్లల మధ్య వ్యవహారం చక్కబడుతుంది
ఒక దీపంతో మరో దీపం ప్రతివారిలో క్రమంగా వెలుగుతుంది
ఈ గ్రంథం ఈ జగత్తుకి సమర్పితం, పొందండి ఆ లాభాన్ని వెంటనే

# ప్రస్తావన

తల్లిదండ్రులు పిల్లల మధ్య వ్యవహారం
అనంతకాలం నుంచి ఒక దరికి చేరలేదు.

'నేనే పెంచాను, చదివించాను' అని అనలేరు
'మిమ్మల్ని ఎవరు చదివించారు?' అంటే ఏమంటారు?

పిల్లలకు అంతా చెయ్యటం కర్తవ్య పాలన, అనివార్యం
నీకు కూడా నీ తండ్రి అంతా చేసాడు.

ఊరికే అరిచి, తిట్టి వాళ్ళకి బాధని కలిగించవద్దు
పిల్లలు పెద్దై దానికి రెట్టింపు బాధని కలిగిస్తారు.

నా పిల్లలు ఇలా ఉండాలి అని ఎప్పుడూ కోరుకుంటారు
ఇద్దరూ ఎలా దెబ్బలాడుకుంటూవుంటారు అన్నది చూడరు.

అమ్మ ముల్లంగి, నాన్న క్యారట్
ఇక పిల్లలు యాపిల్ ఎలా అవుతారు

ఒక పిల్లవాడిని పెంచే బాధ్యత
భారత ప్రధాని కంటే కూడా ఎక్కువే

నీకంటే దీపావళి ఎక్కువ చూసాను అంటే
'మీరు మట్టి దీపాలు, మేము విద్యుద్దీపాలం' అంటారు పిల్లలు.

తల్లి, తండ్రుల జగడాలతో పిల్లల మనసు బేజారు
మనసులో ముళ్ళు పడి, లోలోపలే వాళ్ళు బోగస్ అంటారు.

కోప్పడితే బాగుపడరు ఈ కాలపు పిల్లలు
ప్రేమతోనే ఈ ఇరవై ఒకటో శతాబ్దం ప్రకాశమానం

తిట్టినా కొట్టినా ఎక్కడైతే ప్రేమ తగ్గదో
అక్కడ ప్రేమ ప్రభావంతో పిల్లలు మహావీరులౌతారు.

కొత్తతరం హెల్దీ మైండ్‌వాళ్ళు
భోగులే కాని కషాయంకలవాళ్ళు కారు

కోపంతో కొట్టే దెబ్బలను పిల్లలు మర్చిపోరు
తండ్రికి సవారెట్లు కోపిష్టులౌతారు.

ప్రతి ఇంటా ప్రాకృతిక తోటలు సత్యయుగంలో
భిన్నమైన పూల తోటలు కలియుగంలో

తోటమాలివైతే తోట అందంగా తయారౌతుంది
లేకుంటే అంతా పాడై కషాయం కలవారిదౌతుంది

కూతురిని శంకించకెప్పుడూ
లేకపోతే వింటావు అపజయ మృదంగం

ఉత్తరాధికారంలో పిల్లలకు ఇవ్వాల్సింది ఎంత?
తన తండ్రి నుంచి తాను పొందినంత

ఎక్కువగా ఇస్తే అనవసరపు ఖర్చులు చేస్తారు
తాగుబోతులౌతారు మర్యాదను వీడుతారు

పిల్లల మీద రాగమెంత పెంచుకుంటే
దానికి బదులుగా ద్వేషమంత పెరుగుతుంది

రాగద్వేషాలు పోవాలంటే వీతరాగులవాలి
సంసారసాగరాన్ని దాటేందుకు అదే ఏకైక మార్గం

మోక్షంగామి సంతానం లేకుంటే పుణ్యవంతుడు
పెంచటానికి ఎవరూవుండరు, ఖాతా కూడా ఉండదు.

ఏ జన్మలో పిల్లలు పుట్టలేదు?
ఇక ప్రశాంతంగా ఉండు, నిజమైన ముముక్షవు కా

తల్లిదండ్రులు, సంతానం మధ్య సంబంధమే సంసారం
వీలునామాలో ఏమీ ఇవ్వకపోతే కోర్టుకి పోవలసిందే

రెండు గంటలు తిట్టినందుకే తెగిపోతుంది సంబంధం
ఈ సంబంధం స్మశానం వరకే.

తన దృష్టిలో సంతానమంతా సమానంగా ఉండరు
రాగద్వేషాల ఈ బంధంలో కేవలం ఉండేది ఇచ్చిపుచ్చుకోవటాలే

ఆత్మ తప్ప నాదంటూ ఏదీ లేదు ఈ ప్రపంచంలో
ఒళ్ళు, పళ్ళు నొప్పులే, దేని లెక్క దానిదే

బాకీ తీర్చటంలో ఉత్సాహం తగ్గవద్దు
అర్థం చేసుకుని తీర్చేసుకే లేకపోతే ఉరికంబమే.

తల్లికి పిల్లలంతా సమానమేనంటారు
రాగద్వేషాలున్నా, ఇచ్చిపుచ్చుకునే ప్రమాణాలు

ఒకే తల్లిదండ్రులు కానీ, పిల్లలు వేరువేరు
వర్షం సమానమే కానీ విత్తనాన్నిబట్టి పంట

ప్రకృతి నియమం ప్రకారం ఒక కుటుంబంలో కలవటం
పరమాణువుల ప్రకారమే ఒక దగ్గర కూడటం

ద్రవ్యం, క్షేత్రం, కాలం, భావం కలిసి,
ఘటన చోటుచేసుకోవటమే 'వ్యవస్థిత' స్వభావం

శ్రేణిక రాజుని అతని పుత్రుడే వేసాడు ఖైదులో
కొడుకు భయానికే అతను వజ్రం మింగి చనిపోయాడు

ఆత్మకి కొడుకు ఉండడు ఎవరూ
మాయను వీడి పరలోకాన్ని ఇక్కడే సరిచేసుకో

# సంపాదకీయం

ఏ జన్మలో పిల్లలు లేరు? తల్లిదండ్రులు లేకుండా అస్తిత్వం ఎవరికైనా సంభవమా? భగవాన్లంతా తల్లి గర్భం నుంచే జన్మించారు. అలా తల్లిదండ్రులు, పిల్లల సంబంధం అనాదిది, అనంతమైనది. ఈ వ్యవహారం ఆదర్శవంతంగా చేసుకోవాలి అన్న ప్రయత్నం రాత్రింబవళ్ళు జరగుతుండటం చూడవచ్చు. కలికాలంలోనైతే తల్లిదండ్రులు, పిల్లల మధ్య ప్రతి విషయంలోను భేదాభిప్రాయాలు వుంటునేవుంటాయి, అది అందరినీ గాభరాపెడుతోంది. సత్యయుగంలో భగవాన్ రాముడు, లవకుశల మధ్య వ్యవహారం ఎలా ఉంది? ఋషభదేవుడికి భిన్నంగా సంప్రదాయాన్ని మొదలుబెట్టిన మరీచి కూడా ఉన్నాడు. ధృతరాష్ట్రుని మమత, దుర్యోధనుని స్వేచ్ఛా భావాల గురించి తెలియనిదా? భగవాన్ మహవీర్ కాలంలో మహారాజు శ్రేణికుడు, అతని కుమారుడు కోణికుడు మొగలులను గుర్తుచేయరా? మొగల్ బాద్‌షా జగత్ప్రసిద్ధుడయ్యాడు. అందులో ఒకడు బాబరు. అతను హుమాయూన్ ప్రాణాల కోసం తన ప్రాణాలను తీసుకోమని అల్లాని అర్థించాడు. మరోవైపు షాజహాన్‌ని ఖైదుచేసి ఔరంగజేబు సింహాసనాన్ని ఎక్కాడు. భగవాన్ రాముడు తన తండ్రి వలనే వనవాసం చేసాడు. శ్రవణుడు తన తల్లిదండ్రులను కావిడిలో పెట్టుకుని యాత్ర చేయించాడు (ముఖచిత్రం). అలా రాగద్వేషాల మధ్య ఊగిసలాడుతూ ఉండే తల్లిదండ్రులు, పిల్లల వ్యవహారం ప్రతి కాలంలోను ఉంటుంది. వర్తమాన కాలంలో ద్వేషంతో కూడిన వ్యవహారమే విశేషంగా కనపడుతుంది.

అటువంటి సమయంలో సమభావంతో ఉంటూ ఆదర్శ వ్యవహారం ద్వారా ముక్తి చెందే మార్గాన్ని అక్రమ విజ్ఞాని పరమ పూజ్య దాదా భగవాన్ (దాదాశ్రీ) వాణి ద్వారా ఇక్కడ ప్రచురితమైంది. ఈ కాలంలోని యువత మనోభావాలను పూర్తిగా తెలుసుకుని, వాళ్ళని గెలిచే మార్గాన్ని చూపించటం జరిగింది. విదేశాలలో నివసించే తల్లిదండ్రులు, వాళ్ళ పిల్లలు, రెండు విభిన్న దేశాల సంస్కృతుల మధ్య జీవించటంలో ఎదురయ్యే కఠిన సమస్యలకు చక్కని సమాధానాన్ని ప్రసంగానుసారం ముఖాముఖి మాట్లాడిన మాటల్లో ఇవ్వటం

జరిగింది. ఈ సూచనలు పెద్దవారైన పాఠకులకు, యువతకు కూడా, ఒక ఆదర్శవంతమైన జీవితాన్ని గడపటానికి ఎంతగానో ఉపయోగపడుతుంది,

ఈ పుస్తకం రెండు భాగాలలో ప్రచురించబడింది–

పూర్వ భాగం – పిల్లల పట్ల తల్లిదండ్రుల వ్యవహారం

ఉత్తర భాగం – తల్లిదండ్రుల పట్ల పిల్లల వ్యవహారం

పూర్వ భాగంలో ఉన్నది, దాదాశ్రీ ఎందరో తల్లిదండ్రులతో చేసిన సత్సంగం నుంచి చేసిన సంకలనం. తల్లిదండ్రులు తమ మనోవ్యథలు పరమ పూజ్య దాదాశ్రీ సమక్షంలో అనేకసార్లు వ్యక్తమయ్యాయి. వాటికి దాదాశ్రీ సరైన పరిష్కారాన్ని అందించారు. అందులో తల్లిదండ్రులకు వ్యావహారిక సమస్యలకు సమాధానాలు లభిస్తాయి. వాళ్ళు తమతమ వ్యక్తిగత జీవితాలను సరిదిద్దుకునేందుకు తాళం చెవి దొరుకుతుంది. దానితోపాటు పిల్లలతో రోజూ ఎదురయ్యే అనేక ఇబ్బందులకు సమాధానం లభిస్తుంది. దానివలన వాళ్ళకి సంసార వ్యవహారం సుఖమయం, పరిపూర్ణమౌతుంది. తల్లిదండ్రులు, పిల్లల మధ్య ఉండే పరస్పర సంబంధం తాత్విక దృష్టిలో ఉండే వాస్తవికతలను కూడా జ్ఞానిపురుష్ వివరిస్తారు. దానివలన మోక్షమార్గంలో ముందుకు వెళ్ళటంలో తల్లిదండ్రులకు ఉన్న అడ్డంకులు తొలగిపోయి వారిలో జాగృతి వస్తుంది.

ఉత్తర భాగంలో ఉన్నది, పరమ పూజ్య దాదాశ్రీ పిల్లలతోను, యువతీ యువకులతోను చేసిన సత్సంగం నుంచి చేసిన సంకలనం. ఇందులో పిల్లలు తమతమ వ్యక్తిగత జీవితాలలోని మనోవ్యథలకు సమాధానాలు లభించాయి. తల్లిదండ్రులతో ఎలా వ్యవహరించాలి అన్న అవగాహన వస్తుంది. పెళ్ళి చేసుకునే విషయంలో చక్కని అవగాహన వస్తుంది కనుక యువత తమ జీవితంలో సత్యాన్ని తెలుసుకుని, వ్యవహారంలో సంపూర్ణ పరిష్కారాన్ని తెచ్చుకుంటారు. పిల్లలకు తమ తల్లిదండ్రులకు సేవచేయటంలోని విలువ, దాని ఫలితం గురించి అర్థం చేసుకుంటారు.

తల్లిదండ్రుల సమస్యలు ఎలా ఉంటాయంటే, మేము పిల్లలకు ఇంత చేసాము, అయినా పిల్లలు మాట వినరు ఎందుకని అనుకుంటారు. పిల్లలు

సంస్కారవంతు లౌతారు, పెద్దై ఇంతటివాళ్ళవుతారు, అంతటివాళ్ళవుతారు అని కన్న కలలన్నీ కూలిపోతుంటే ఎంత గాయపడతారు? దానికి పరిష్కారమేమిటి? కొందరు పిల్లలు తమ తల్లిదండ్రుల వైవాహిక జీవితంలో పొందుతున్న సుఖాన్ని (!) చూసి పెళ్ళి చేసుకోవటానికే నిరాకరిస్తే ఏం చేస్తారు? తల్లిదండ్రులు వారిలో సంస్కారం అంకురించేటట్టుగా ఎలా చేయగలుగుతారు? దానికి సంబంధించిన అవగాహన ఎక్కడి నుంచి వస్తుంది? ఎలా వస్తుంది? దారితప్పిన పిల్లలను దారిలోకి ఎలా తీసుకునిరావాలి? పరస్పరం మాటలలో తల్లిదండ్రులు, పిల్లల మధ్య జరిగే ఘర్షణను ఎలా నివారించాలి? పిల్లలకు తల్లిదండ్రులు నిరంకుశంగా వ్యవహరిస్తున్నట్లు అనిపిస్తుంది, తల్లిదండ్రులకేమో పిల్లలు భ్రష్టులైనట్లు కనిపిస్తారు. అప్పుడు దానికి మార్గమేమిటి? పిల్లలకు ఏది మంచి అన్నది తెలియజేసేందుకు ఏమైనా చెప్తే పిల్లలు దాన్ని చికాకు పెడుతున్నట్లుగా భావించి వాళ్ళతో తర్కానికి దిగితే ఏం చెయ్యాలి? చిన్న పిల్లలు, పెద్ద పిల్లలతో ఏవిధంగా వేరువేరుగా వ్యవహరించాలి?

ఇంట్లో నివసించే భిన్న ప్రకృతులకు నిజమైన యజమానిగా ఎలా అవాలి? దాని ప్రయోజనాన్ని ఎలా పొందాలి? ఒకరు లోభి అయితే ఒకరు విచ్చలవిడిగా ఖర్చుపెట్టేవారు, ఒకరు దొంగ అయితే మరొకరు అతి మంచివారు, అలా ఇంట్లో పిల్లల మనస్తత్వాలు ఇంటి పెద్దలు ఎలా అర్థం చేసుకోవాలి, ఏం చెయ్యాలి?

తండ్రికి మద్యం, పొగతాగే అలవాటుంటే దాన్నుంచి ఎలా విముక్తులవాలి, దాని దుష్ప్రభావం పిల్లల మీద పడకుండా ఎలా చూడాలి?

పిల్లలు చాల రాత్రి వరకు టి.వి., సినిమాలు చూస్తుంటే, వాటి నుంచి వాళ్ళనెలా తప్పించాలి? నవ తరం (జనరేషన్) ఎలాంటి మంచి విషయాలను మనసులో పెట్టుకుని ప్రయోజనం పొందవచ్చు? నిన్నటి కషాయాలతో కూడిన, నేటి భోగలాలసుల మధ్య ఉన్న అంతరాన్ని ఎలా అంతం చేయాలి? ఒకపక్క నేటి తరం పిల్లల హెల్దీ మైండ్ (ఆరోగ్యవంతమైన మెదడు) ని చూసి తల దించుకున్నట్లుగా అవుతుంది, మరోపక్క విషయాంధులుగా కనిపిస్తారు. దానికేం చెయ్యగలుగుతారు?

పక్క మీది నుంచి ఆలస్యంగా లేచే పిల్లలను ఎలా సరిచేయాలి? చదువులో వెనకపడివున్నవాళ్ళ విషయంలో ఏం చెయ్యాలి? చదువుకునేందుకు వాళ్ళని ఏ విధంగా ప్రోత్సాహం కలిగించాలి? పిల్లలతో వ్యవహరించటంలో సంబంధాలు తెగిపోతే అందుకు కౌంటర్ పులీ వేసి ఎలా తిరిగి జోడించాలి?

పిల్లలు వాళ్ళలో వాళ్ళే దెబ్బలాడుకుంటూవుంటే తటస్థంగా ఉంటూ వాళ్ళకి న్యాయం ఎలా చెయ్యాలి? పిల్లలో కలిగిన క్రోధాన్ని శాంతపరచేందుకు ఏం చెయ్యాలి? పిల్లలకు వాళ్ళ తప్పులు వాళ్ళు తెలుసుకునేటట్టుగా చేయగలమా? పిల్లలను కోప్పడటం అవసరమేనా? కోప్పడటం లేక తెలుసుకునేటట్టుగా చేయటం ఏ విధంగా ఉండాలి? పిల్లలను కోప్పడినట్లయితే ఎలా కర్మబంధం కలుగుతుంది? వాళ్ళకి బాధ కలిగితే అందుకు ఏమిటి ఉపాయం? పిల్లలను కొట్టాలా? కొట్టినట్లయితే ఏమిటి ఉపాయం? గాజులాంటి పిల్లల మనసులను ఎలా హ్యాండిల్ చేయాలి? తల్లిదండ్రులు బాగా శ్రమించి సంపాదిస్తే పిల్లలు అనవసరంగా ఖర్చులు పెడుతుంటే ఎలాంటి అడ్జస్ట్‌మెంటు (సమాధానం) తీసుకోవాలి? పిల్లలకు స్వేచ్ఛనివ్వాలా? ఒకవేళ ఇస్తే ఏ హద్దు వరకు? పిల్లవాడు తాగుడుకి అలవాటు పడితే ఏ చర్య తీసుకోవాలి? బాగా తిట్టిపోస్తుంటే ఏం చెయ్యాలి? మోక్షాన్ని లక్ష్యంగా పెట్టుకుని, అధ్యాత్మ, తల్లిదండ్రులు, పిల్లల వ్యవహారాలను ఏవిధంగా సమన్వయం చేసుకోవాలి? తల్లిదండ్రులు పిల్లలకు దూరంగా విడిగా ఉంటే ఏం చెయ్యాలి?

ఆడపిల్లలు రాత్రిపూట ఆలస్యంగా ఇంటికి వస్తే? చెడు సహవాసాలు అయినట్లయితే ఏం చెయ్యాలి? ఆడపిల్ల వేరే కులం అబ్బాయిని పెళ్ళి చేసుకుంటే ఏం చెయ్యాలి? ఆడపిల్ల మీద శంక మొదలైతే ఏం చెయ్యాలియ

వీలునామా చెయ్యాలా? ఏ విధంగా చెయ్యాలి? ఎవరికి ఎంత ఇవ్వాలి? మరణానికి ముందా లేక మరణం తర్వాత చెందేటట్టుగా రాయాలా? పిల్లవాడు డబ్బులు అడిగితే ఏం చెయ్యాలి? ఇల్లరికం పెట్టుకోవాలా వద్దా?

పిల్లల మీద మోహం ఎంతవరకు పెట్టుకోవచ్చు? మమతానురాగాల రహస్యం ఏమిటి? అది ఎంత ప్రయోజనకరం ఔతుంది? గురు (భార్య) రాగానే కొడుకు మారిపోతే ఏం చెయ్యాలి?

సంతానం లేనివాళ్ళ కర్మ ఎలా ఉంటుంది? సంతానం లేకపోతే శ్రాద్ధ కర్మలు ఎవరు నిర్వహించి ముక్తిని కలిగిస్తారు? చిన్న ప్రాయంలోనే పిల్లల మరణం సంభవిస్తే తల్లిదండ్రులు ఎలా తట్టుకుంటారు? వాళ్ళకోసం ఏం చెయ్యాలి? దాదాజీ పిల్లలు చనిపోతే ఆయన ఏం చేసారు? రిలేషన్ (సంబంధం) తెగిపోతున్నట్లయితే దాన్ని ఎలా జోడించాలి? జ్ఞాని ఏ విధంగా భవసాగరాన్ని దాటే మార్గాన్ని చూపిస్తారు?

మొగ్గను వికసింపజేసే కళ జ్ఞానికి ఎలా వస్తుంది అన్నది ఇక్కడ చూడవచ్చు. ఇక్కడ రెండు సంవత్సరాల నుంచి పన్నెండు సంవత్సరాల ప్రాయం వరకు ఉన్న పిల్లల వికాసం చెందటం చూస్తే, నేర్చుకోవటానికి అందులో ఎంతో ఉంటుంది– ప్రేమ, సమత, ఆత్మీయత అనే వేదిక నుంచి.

పిల్లలకు ఏవిధంగా చదువు నేర్పాలి, ఎలా వారిని తీర్చిదిద్దాలి?

పిల్లలు పెళ్ళి వయసుకి వచ్చినపుడు పెద్ద ప్రశ్న ఎదురౌతుంది. అందుకు తగినవారెవరు, వారినెలా ఎంపికచేసుకోవాలి? దాదాజీ ఆడపిల్లలు, మగపిల్లలకు చాల చక్కని మార్గదర్శనం చేస్తారు. దానివలన తల్లిదండ్రులు, పిల్లల సమ్మతితోనే సంబంధాలను ఎంపిక చేసుకోవటం కుదురుతుంది.

అత్తవారింట్లో అందరినీ వశపరచుకునేందుకు దాదాశ్రీ చక్కని తాళం చెవిని ప్రదానం చేసారు. తల్లిదండ్రులకు సేవచేసి, వినయంగా వారి ఆశీస్సులను పొందటం వలన కలిగే ప్రయోజనం ఏమిటి, అది ఎలా పొందాలి?

చిట్టచివరిగా, వృద్ధుల వ్యధను తీర్చేందుకు వృద్ధాశ్రమాల అవసరం, ఆధ్యాత్మిక జీవనాన్ని ఎలా సాగించాలి అన్న దానికి చక్కటి మార్గదర్శనం సంకలనం ఇక్కడ జరిగింది. దీని చదివి అర్థం చేసుకుంటే, తల్లిదండ్రులు, పిల్లలు ఇద్దరి వ్యవహార శైలి ఆదర్శప్రాయమౌతుంది.

జై సచ్చిదానంద

**–డా.నీరు బెహన్ అమీన్**

# విషయానుక్రమణిక

## పిల్లల పట్ల తల్లిదండ్రుల వ్యవహారం

## (పూర్వ భాగం)



## తల్లిదండ్రుల పట్ల పిల్లల వ్యవహారం

## (ఉత్తర భాగం)

# పిల్లల పట్ల తల్లిదండ్రుల వ్యవహారం

## (పూర్వ భాగం)

## 1. సంస్కారాన్ని నీరు పోసి పెంచటం

**ప్రశ్నకర్త :** ఇక్కడ అమెరికాలో డబ్బు ఉంది కానీ, సంస్కారం లేదు. ఇక్కడ చుట్టూ ఉన్న వాతావరణం కూడా అలాంటిదే. మరి దీనికి ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** ముందుగా తల్లిదండ్రులు సంస్కారవంతులవాలి. అప్పుడిక పిల్లలు బయటకే వెళ్ళరు. తల్లిదండ్రుల ప్రేమను చూసినట్లయితే పిల్లలు అక్కడి నుంచి దూరంగా వెళ్ళనే వెళ్ళరు. తల్లిదండ్రులు అలా ప్రేమమయులవాలి. పిల్లలను బాగు చెయ్యాలంటే ఆ బాధ్యత మీదే. పిల్లల ఎడల మీకు బాధ్యతాబంధం ఉంది. అర్థమైందా మీకు?

మన పిల్లలకు మంచి సంస్కారం ఇవ్వాలి. అమెరికాలో ఎందరో, 'మా పిల్లలు మాంసాహారం తింటారు, ఇంకా ఎన్నో చేస్తుంటారు' అని అంటూవుంటారు. అప్పుడు నేను వారిని, 'మీరు మాంసాహారం తింటారా' అని అడిగాను. అందుకు వాళ్ళు 'ఔను తింటాం' అన్నారు. అప్పుడు నేను, 'అయితే పిల్లలు కూడా తింటారు మరి' అన్నాను. మీరిచ్చిన సంస్కారమే అది! మీరా పని చెయ్యకపోయినా వాళ్ళు అది చెయ్యవచ్చు కానీ, వేరే చోట. కానీ మీరు చెయ్యవలసిందల్లా, వాళ్ళని సంస్కారవంతులుగా తీర్చిదిద్దాలంటే మీరు మీ బాధ్యతను విస్మరించగూడదు.

ఇక మీరు మీ పిల్లల విషయంలో వాళ్ళు ఏదిబడితే అది, ఎక్కడబడితే అక్కడ తినకుండా చూసుకోవాలి. మీరు ఒకవేళ తింటున్నట్లయితే ఈ జ్ఞానం తీసుకున్న తర్వాత మీరు అదంతా మానేయాల్సివుంటుంది. అంటే, వాళ్ళు మీలో చూసే సంస్కారమే అనుసరిస్తారు. ఇంతకు ముందు మన తల్లిదండ్రులు సంస్కారవంతులని ఎందుకు అనిపించుకునేవారు? వాళ్ళు నియమాలను బాగా పాటించేవారు. వాళ్ళలో సంయమనం ఉండేది. ఇప్పుడు వీళ్ళు సంయమనం లేనివాళ్ళు.

**ప్రశ్నకర్త :** పిల్లలు పెద్దయితే వాళ్ళకి ధర్మ జ్ఞానం ఎలా ఇవ్వాలి?

**దాదాశ్రీ :** మీరు ధర్మస్వరూపులవండి. అప్పుడు వాళ్ళు కూడా అవుతారు. మీలోని గుణాలను చూసే పిల్లలు నేర్చుకుంటారు. అందువలన మీరు ధర్మ నిష్ఠులవండి. మిమ్మల్ని చూసి చూసి వాళ్ళు నేర్చుకుంటారు. మీరు సిగరెట్ తాగుతుంటే, వాళ్ళు కూడా సిగరెట్ తాగటం నేర్చుకుంటారు. మీరు మద్యం సేవిస్తుంటే, వాళ్ళు కూడా మద్యం సేవించటం నేర్చుకుంటారు. మాంసం తింటున్నట్లయితే, మాంసం తినటం నేర్చుకుంటారు. మీరు ఏం చేస్తారో వాళ్ళు అవే నేర్చుకుంటారు. వీళ్ళని కూడా మించి చేద్దామని అనుకుంటారు.

**ప్రశ్నకర్త :** మంచి స్కూల్లో చదివిస్తే మంచి సంస్కారం అబ్బదా?

**దాదాశ్రీ :** కానీ, అదంతా సంస్కారం కాదు. తల్లిదండ్రుల దగ్గరి నుంచి కాక పిల్లలు వేరే ఎవరి దగ్గరి నుంచీ సంస్కారం పొందరు. తల్లిదండ్రులు, గురువుల నుండి, కొద్దో గొప్పో వాళ్ళ సర్కిల్ ఉంటుంది కదా ఫ్రెండ్ సర్కిల్, వాళ్ళ సంయోగంలో. మిత్రుల నుండి, చుట్టుపక్కలవారి నుండి సంస్కారం లభిస్తుంది. అన్నిటికన్నా ఎక్కువ తల్లిదండ్రుల దగ్గరి నుంచి సంస్కారం వస్తుంది. తల్లిదండ్రులు సంస్కారవంతులైతే పిల్లలు కూడా సంస్కారవంతులౌతారు లేకపోతే సంస్కారహీనులౌతారు.

**ప్రశ్నకర్త :** చదువు కోసం పిల్లలను 'ఇండియా' పంపించినట్లయితే వాళ్ళ పట్ల మన బాధ్యతను విస్మరించినట్లవదా?

**దాదాశ్రీ :** లేదు. అలా అవదు. మీరు వాళ్ళకయే ఖర్చుని భరించండి. అక్కడ ఎలాంటి స్కూళ్ళు ఉన్నాయంటే, భారతీయులు కూడా తమ పిల్లలను అక్కడికి

చదువుకి పంపిస్తుంటారు. తినటం, ఉండటం కూడా అక్కడే. అలాంటి మంచి మంచి స్కూళ్ళు ఉన్నాయి.

**ప్రశ్నకర్త :** దాదా, ఇల్లు, సంసారం శాంతిపూర్వకంగా నడవాలి, అంతరాత్మ పరంగా కూడా ఎదగాలి. అలాంటిదేమైనా చెయ్యండి.

**దాదాశ్రీ :** ఇల్లు, సంసారంలో శాంతి ఉండటమే కాదు, పిల్లలు కూడా మిమ్మల్ని చూసి సంస్కారవంతులవాలి. తల్లిదండ్రుల పిచ్చితనం చూసి పిల్లలు కూడా పిచ్చివాళ్ళయారు. ఎందుకంటే తల్లిదండ్రుల ఆచారవ్యవహారాలు సరైనవిగా ఉండటం లేదు. భార్యాభర్తలు కూడా అక్కడ పిల్లలు ఉన్నప్పటికీ, అనుచితంగా వ్యవహరిస్తారు. మరి ఇక పిల్లలు చెడిపోక ఏమౌతుంది. పిల్లలలో సంస్కారం ఎక్కడి నుండి వస్తుంది? గౌరవాన్ని పాటించాలి కదా! నిప్పులు కురుస్తుంటే ఎలాంటి ప్రభావం పడుతుంది? చిన్న పిల్లలు కూడా నిప్పురవ్వలను చూసి భయపడతారు కదా! తల్లిదండ్రులు మనసులు ఫ్రాక్చర్ అయిపోయాయి. మనసు విహ్వాలమైపోయింది. ఏదిబడితే అది అనేస్తారు. ఎదుటివారికి బాధ కలిగించే విధంగా మాట్లాడుతారు. దానివలన పిల్లలు చెడిపోతారు. భర్త నొచ్చుకునేటట్టుగా భార్య మాట్లాడుతుంది, భార్య నొచ్చుకునేటట్టుగా భర్త మాట్లాడుతాడు. భారతీయ తల్లిదండ్రులు ఎలా ఉండాలి? వాళ్ళు పిల్లలకు పదిహేను సంవత్సరాలు వచ్చేసరికే వాళ్ళకి సంస్కారమంతా నేర్పాలి.

**ప్రశ్నకర్త :** ఇప్పుడిక వాళ్ళ సంస్కార స్థాయి కూడా తగ్గిపోతూ వస్తోంది. అదే అందరికీ పట్టుకున్న బాధ.

**దాదాశ్రీ :** లేదు లేదు సంస్కారం మాత్రమే పోతోంది. ఇందులో దాదా వచ్చేసారు కదా. ఇక మూల సంస్కారంలోకి తీసుకునివస్తారు. సత్యయుగంలో ఎలా ఉండేదో, అలాంటి సంస్కారం వస్తుంది. భారతదేశంలోని ఒక పిల్లవాడు విశ్వంలోని భారాన్నంతా మోస్తాడు. అందటి శక్తి సంపద కలిగినవాడు. వాళ్ళను పరిపుష్టులను చేయాలంతే. వీళ్ళయితే భక్షకులయ్యారు. భక్షకులంటే, తమ సుఖం కోసం ఇతరులను అన్ని విధాలా లూటీ చేస్తారు. ఇతరుల సుఖం కోసం త్యాగం చేసేవారు మాత్రమే ఇతరులకు సర్వ సుఖాలను సమకూర్చగలుగుతారు.

కానీ ఇక్కడ సేఠుగారు రోజంతా ఆలోచనలు డబ్బు మీదనే పెట్టుకుని వుంటారు. అలాంటప్పుడు సేఠ్‌గారితో నేను, 'సేఠ్, మీరు డబ్బు వెనక పడ్డారు కానీ ఇల్లు కకావికలమైవుంది' అనవలసివస్తుంది. కూతుళ్ళు కారు తీసుకుని ఒకవైపు వెళ్తారు, కొడుకు మరో వైపు, సేఠాని మరెక్కడికో పోతుంది. సేఠూ, నువ్వు అన్ని రకాలుగా లూటీకి గురౌతున్నావు! అప్పుడు సేఠ్ అడిగాడు, 'ఏం చెయ్యమంటారు నన్ను?'అని. నేను, 'విషయం అర్థం చేసుకో. జీవితాన్ని ఎలా జీవించాలి అన్నది తెలుసుకో. కేవలం డబ్బు వెనకే పోవద్దు. శరీరం మీద ధ్యాస పెట్టు. లేకపోతే హార్ట్ ఫెయిల్ అవుతుంది. శరీరం మీద దృష్టి, డబ్బు మీద దృష్టి, కూతుళ్ళకు సంస్కారం ఇవ్వటం మీద దృష్టి, ఇలా అన్ని మూలల నుంచి శుభ్రం చేసుకోవాలి. మీరు ఒకే మూల శుభ్రం చేస్తున్నారు. బంగ్లాలో ఒక మూల శుభ్రంగా ఉంటూ, మిగతా అంతటా చెత్త పడివుంటే ఎలా ఉంటుంది? అన్ని వైపులా శుభ్రం చేసుకోవాలి. ఇలా జీవితం ఎలా గడుపుతారు? అందువలన అతని పట్ల వ్యవహారం సరిగ్గా ఉండనీ, మంచి సంస్కారవంతునిగా చెయ్యి. ఈ పిల్లలను సంస్కారవంతులను చెయ్యి. స్వయంగా మీరు తపం చెయ్యండి కానీ, వాళ్ళని సంస్కారవంతులను చెయ్యండి.'

**ప్రశ్నకర్త :** వాళ్ళని బాగుచేసే ప్రయత్నం అందరూ చేస్తారు. అయినా వాళ్ళు బాగుపడకపోతే ఒక ఆదర్శ తండ్రిగా అంతా అతని ప్రారబ్ధం అనుకుని వదిలేయాలా?

**దాదాశ్రీ :** లేదు. మీ తరఫు నుంచి ప్రయత్నమైతే చేస్తుంటారు కదా. మీ దగ్గర సర్టిఫికేట్ ఉందా? చెప్పండి నాకు.

**ప్రశ్నకర్త :** నా బుద్ధికి అనుగుణంగా ప్రయత్నం చేస్తుంటాను.

**దాదాశ్రీ :** మీ బుద్ధి అంటే, నేను ఒక మాట చెప్తాను. ఒక వ్యక్తి తనే జడ్జ్, తనే నేరస్తుడు, తనే వకీలు అనుకుంటే, అతను ఎలాంటి న్యాయం చేస్తాడు?

పిల్లవాడు తన సంస్కారాన్ని వెంట తెచ్చుకునే వస్తాడు. కాకపోతే అందులో మీరు హెల్ప్ చేసి, ఆ సంస్కారాలకో రంగు ఇవ్వవలసిన అవసరం ఉంది.

అతన్ని వదిలెయ్యవద్దు ఎప్పుడూ. అతని మీద దృష్టిపెట్టాలి. వదిలేస్తే నాశనమౌతాడు.

**ప్రశ్నకర్త :** అలాగే చేస్తాను. కాని లాస్ట్ స్టేజ్‌లో అంతా ప్రారబ్ధానికి వదిలిపెట్టాలా?

**దాదాశ్రీ :** లేదు అలా వదిలిపెట్టవద్దు. అలా వదిలిపెట్టవలసిన అవసరం వస్తే నా దగ్గరకు తీసుకుని రా. నేను ఆపరేషన్ చేస్తాను. అలా వదిలిపెట్టవద్దు అపాయంలో.

కొడుకు ఒకడు తన తండ్రి మీసాలను పట్టి లాగుతున్నాడు. తండ్రి ఆనందిస్తూ, 'చూడు ఎలాంటి కొడుకో. నా మీసాలను ఎలా లాగుతున్నాడో' అంటాడు. మరి అతను చెప్పినట్లుగా చేస్తుంటే అతను మీసాలు పట్టుకుని మళ్ళీ మళ్ళీ లాగుతుంటాడు. ఏమౌతుంది అప్పుడు? మరేమీ చెయ్యకపోయినా కనీసం ఆ అబ్బాయిని కాస్త పిండు. అలా పిండితే అర్థం చేసుకుంటాడు ఏదో తప్పు జరిగిందని. నేను చేస్తున్నది తప్పు అని తెలుసుకుంటాడు. అతన్ని బాగా కొట్టవద్దు. నెమ్మదిగా పిండు అంతే.

తండ్రి ఆ పిల్లవాని తల్లిని పిలుస్తాడు. అప్పుడు ఆమె రొట్టెలు లాటిస్తుంటుంది. ఆమె, 'ఏమిటి పని? నేను రొట్టెలు చేస్తున్నా' అంటుంది. 'నువ్వు ఇక్కడికి రా. త్వరగా రా. త్వరగా రా త్వరగా రా' అనేసరికి ఆమె పరిగెత్తుకుంటూ వచ్చి, 'ఏమిటి సంగతి?' అని అడుగుతుంది. అప్పుడతను, 'చూడు పిల్లవాడు ఎంత తెలివిగా ఉన్నాడో. కాలి మడిమల మీద లేచి నిలబడి జేబులోంచి పాతిక రూపాయలు తీసాడు' అది చూసిన పిల్లవాడు, 'నేను ఈ రోజు చాల మంచి పని చేసాను. నేను ఈ పనిని నేర్చుకున్నాను' అనుకుంటాడు. అలా అతను దొంగ అయ్యాడు. అప్పుడేమౌతుంది? జేబులోంచి డబ్బులు తీసుకోవటం మంచి పనే' అన్న అభిప్రాయం ఏర్పడుతుంది. మీకేమనిపిస్తోంది? ఎందుకు చెప్పొద్దు? అలా చెయ్యాలా?

ఇలాంటి వెధవ ఎక్కడి నుండి పుట్టాడు? ఇతను తండ్రి అయికూర్చున్నాడు! సిగ్గులేదూ? దీనివలన పిల్లలకు ఎటువంటి ప్రోత్సాహం లభించింది? అర్థమౌతోందా

ఇది? పిల్లవాడు, 'నేను చాల పరాక్రమం చేసాను!' అని అనుకుంటున్నాడు. అలా లూటీ అవటం మీకు గొప్ప అనిపిస్తోందా? ఏం చెప్తే పిల్లలకు 'ఎంకరేజ్‌మెంట్' (ప్రోత్సాహం) లభిస్తుంది, ఏం చెప్తే నష్టం కలుగుతుంది అన్న ఇంగితం ఉండాలి కదా! ఇతను అన్‌టెస్టెడ్ ఫాదర్ (అయోగ్యుడైన తండ్రి), అన్‌టెస్టెడ్ మదర్ (అయోగ్యురాలైన తల్లి). తండ్రి ముల్లంగి, తల్లి కేరట్. ఇక పిల్లలు ఎలాంటివాళ్ళు అవుతారు? యాపిల్ అయితే కారు కదా?!

అందుకే కలియుగంలో తల్లిదండ్రులకు ఇవేమీ రావు, తప్పుగా ఎంకరేజ్‌మెంట్ ఇస్తారు, కొందరైతే వాళ్ళని వెంట తీసుకుని తిరుగుతారు. 'వీడిని ఎత్తుకో' అంటుంది భార్య. భర్త ఎత్తుకుంటాడు. ఏం చేస్తాడు? ఒకవేళ అతను మొండివాడైతే, 'ఏం వీడు నా ఒక్కడివాడేనా? కలిసి పెంచాలి' అని అంటే, భర్త ఎత్తుకోవలసివస్తుంది. తప్పించుకోగలడా? ఎక్కడికి పోతాడు అతను? సినిమాకి పిల్లలను ఎత్తుకునే పోతాడు, పరుగులెత్తుతుంటాడు. ఇక పిల్లలకు సంస్కారం ఎలా వస్తుంది?

ఒక బ్యాంక్ మేనేజర్ నన్ను అడిగాడు, 'దాదాజీ నేను ఎప్పుడూ నా భార్యా పిల్లలను పలెత్తు మాట అనలేదు. వాళ్ళు ఎంత తప్పు చేసినా సరే, ఏం చేసినా సరే, నేను వాళ్ళనేమీ అనను' అని.

'దాదాజీ నన్ను బాగా మెచ్చుకుంటారు' అని అతను అనుకునివుంటాడు. అతను ఏం ఆశిస్తున్నాడో అర్థమైందా? కాని నాకు అతని మీద చాల కోపం వచ్చింది నిన్ను ఎవరు బ్యాంక్ మేనేజర్ చేసినవాడు? నీకు పిల్లలను ఎలా చూసుకోవాలో తెలియదు, భార్యను ఎలా చూసుకోవాలో తెలియదు! దానితో అతను కంగారు పడిపోయాడు పాపం. కానీ నేనే అతన్ని, 'మీరు ఒక అత్యంత చేతగాని మనిషి. ఈ ప్రపంచంలో పనికిరాని వారు మీరు' అన్నాను. అతను మనసులో అనుకునివుంటాడు, అలా మాట్లాడితే 'దాదాజీ' నాకు బహుమతినిస్తారు అని. పిచ్చివాడు కాకపోతే దీనికి బహుమతి ఉంటుందా? పిల్లవాడు తప్పు చేస్తే, 'నువ్వు ఎందుకలా చేసావు? మళ్ళీ ఎప్పుడూ అలా చెయ్యొద్దు' అని నాటకీయంగా చెప్పాలి. లేకపోతే, అతను చేసేదంతా

'కరెక్ట్' అని అతను అనుకుంటాడు. ఎందుకంటే తండ్రి దాన్ని 'యాక్సెప్ట్' చేసాడు కనుక. అలా చెప్పకపోవటానికి కారణం, ఇంట్లోవాళ్ళు ముఖం మాడ్చుకుంటారని. అన్ని మాట్లాడండి కానీ, నాటకీయంగా! పిల్లలను రాత్రిపూట కూర్చోబెట్టుకుని వాళ్ళతో మాట్లాడండి, వాళ్ళకి నచ్చచెప్పండి. ఇంట్లో అన్ని మూలల నుండి శుభ్రం చేయాలి కదా! పిల్లలను కాస్త కుదపటం అవసరమే. సంస్కారాలు ఎలాగూ ఉన్నాయి కాని, కొద్దిగా కుదపవలసివుంటుంది. అలా వాళ్ళని కుదపటం తప్పా?

చిన్నపిల్లలకు, పొద్దున్నే లేచి కాలకృత్యాల తర్వాత పూజ చెయ్యమని చెప్పండి. ప్రతి రోజు, 'నాకు, ఈ జగత్తులోని వారందరికీ సద్బుద్ధినివ్వు. లోకకళ్యాణం కావించు' అని కోరుకోండి. వాళ్ళు ఈ మాత్రం అన్నా చాలు, వాళ్ళకి సంస్కారం వస్తుంది అని చెప్తారు, తల్లిదండ్రుల కర్మ బంధం విడిపోతుంది. రెండవది, మీరు పిల్లలచేత రోజూ, 'దాదా భగవాన్ కె అసీస్ జయ్‌జయ్‌కార్ హెూ' అనిపించండి. భారతదేశంలో పిల్లలు ఎంత మెరుగయ్యారంటే వాళ్ళు సినిమాకి కూడా పోరు. మొదట్లో రెండు మూడు రోజులు కాస్త చికాకుగా ఉండవచ్చు. కానీ రెండు మూడు రోజుల అభ్యాసం తర్వాత దాని రుచి లోపలికి ఇంకుతుంది, వాళ్ళంతట వాళ్ళే అనటం జరుగుతుంది.

## 2. బాధ్యతల గురించి కూడా చాటుకోవాలా?

స్వచ్ఛందా చేసే పనికి బహుమతి ఉంటుంది. ఒక వ్యక్తి బాధ్యతను నెరవేర్చినందుకు బహుమానం పుచ్చుకోదలచుకున్నాడు! ప్రపంచంలో అంతా బహుమానాన్ని ఆశిస్తున్నారు, 'నేను అంత చేసాను మీకు తెలియదా? మీకు నా విలువ తెలియటంలేదు' అంటూ. అరె భాయ్ ఎందుకలా బహుమానం కోసం వెతుకుతున్నారు? మీరు మీ బాధ్యతను నెరవేర్చటమే మీరు చేసిన పని! ఒక మనిషి తన కొడుకుతో వాదిస్తున్నాడు. ఆ తర్వాత నేను అతన్ని కోప్పడ్డాను. అతను, 'అప్పు చేసి మరీ నిన్ను చదివించాను. నేను అప్పు చెయ్యకపోతే నువ్వు చదువుకో గలిగివుండేవాడివా? బయట తిరుగుతుండేవాడివి' అన్నాడు. భయ్, అనవసరంగా ఎందుకలా వాదన పెట్టుకుంటున్నావు? అది నీ బాధ్యత. అలా మాట్లాడకూడదు! కొడుకు తెలివైనవాడు. ఒకవేళ అతను, 'నిన్ను ఎవరు చదివించారు?' అని అడిగితే

ఏం జవాబు చెప్పేవారు? అలా పిచ్చిగా మాట్లాడుతుంటారు కదా మనుషులు? మూర్ఖులు, తెలివితక్కువవాళ్ళు. ఏం తెలియదు.

పిల్లలకు అన్నీ చెయ్యాలి. పిల్లలు, 'ఇక వద్దు నాన్నా చాలా చేసారు' అని అన్నా కూడా తండ్రి వదిలిపెట్టడు. అప్పుడేం చెయ్యాలి? పిల్లలు ఎర్ర జెండా చూపించినా మనం అర్థం చేసుకోవాలి కదా! మీకు ఏమనిపిస్తోంది?

అతను ఒకవేళ నేను వ్యవసాయం చేస్తాను అంటే వ్యవసాయం చేసేందుకు ఏమైనా దారి చూపించాలి. అంతకంటే లోతుగా వెళ్తే ఆ తండ్రి మూర్ఖుడే. అతను ఒకవేళ ఉద్యోగంలో చేరినట్లయితే, తన దగ్గర ఉన్నదాన్ని మూటగట్టి పెట్టుకోవాలి. ఎప్పుడైనా కష్టంలో ఉంటే, వెయ్యో రెండు వేలో పంపించాలి. కానీ ఇతను ఎల్లప్పుడూ అడుగుతూనేవుంటాడు. అప్పుడు కొడుకు, 'వద్దని చెప్పానుగా మీకు, నా విషయంలో కలుగజేసుకోకండి' అంటాడు. అప్పుడు ఇతను, 'వాడికి బుద్ధి లేదు. అందుకే అలా మాట్లాడుతున్నాడు' అంటాడు. అరె, మీకు నివృత్తి కలిగింది. మంచిదే అయింది. జంఝాటం పోయింది. కొడుకే స్వయంగా వద్దంటున్నాడు కదా!

**ప్రశ్నకర్త :** సరైన దారి అంటే ఏది? అక్కడ పిల్లలను చూసుకోవాలా లేకపోతే నా ఎదుగుదల కోసం సత్సంగంలోకి రావాలా?

**దాదాశ్రీ :** పిల్లలు వాళ్ళంతట వాళ్ళే ఉండగలుగుతున్నారు. పిల్లలను మీరేం చూసుకుంటారు? ఎవరికి వారు ఎదగటం అనేది ముఖ్యమైన ధర్మం. ఇకపోతే ఈ పిల్లలు బాగానే ఉన్నారు కదా! పిల్లలను మీరు పెద్దవాళ్ళని చేస్తారా? తోటలో గులాబీ మొక్క వేసినట్లయితే, రాత్రిపూట పెరుగుతాయా పెరగవా? మనం ఏమనుకుంటామంటే నా గులాబి మొక్క అని. కానీ ఆ గులాబి మొక్క తన అస్తిత్వంలో ఉంది. వేరేవాళ్ళది కాదు. అందరూ తమ తమ స్వార్థంతో ప్రేరితులు. ఈ పిచ్చితనమంతా మన అహంకారం చేయిస్తుంది. పిచ్చి పనులు చేస్తుంటారు.

**ప్రశ్నకర్త :** గులాబీ మొక్కకి మనం నీరు పోయకపోతే గులాబీ ముడుచుకుపోతుంది.

**దాదాశ్రీ :** పొయ్యకపోవటం అనేది ఉండదు కదా. పిల్లవాడిని సరిగ్గా చూడకపోతే కరవటానికి వస్తాడు, లేకపోతే రాళ్ళతో కొడతాడు.

ప్రాపంచిక బాధ్యతలను నిర్వర్తించే సమయంలో ధర్మ కార్యాలతో సమన్వయం ఎలా జరుగుతుంది? కొడుకు వ్యతిరేకంగా మాట్లాడుతున్నా కూడా మనం మన ధర్మాన్ని వీడకుండా బాధ్యతలను పూర్తిచేయాలి. మీ ధర్మమేమిటి? కొడుకుని పెంచి పెద్ద చేయటం, అతన్ని సరైన దారిలో పెట్టటం. అతను వంకర మాట్లాడుతుంటే మీరూ వంకరగా మాట్లాడితే, దాని పరిణామం ఎలా ఉంటుంది? అతను చెడిపోతాడు. అందువలన మీరు అతనికి ప్రేమగా, 'ఇలా రా కూర్చో, ఇది ఇలా అది అలా' అంటూ నచ్చచెప్పాలి. అంటే అన్ని బాధ్యతలతోపాటు ధర్మం కూడా ఉండాలి. ధర్మం లేకపోతే అక్కడ అధర్మం ఏర్పడుతుంది. గది ఖాళీ అయిపోదు. ఇక్కడ మనం గదిని ఖాళీగా ఉంచినట్లయితే ఇతరులు తాళం పగలగొట్టి లోపలికి ప్రవేశిస్తారా ప్రవేశించరా?

నిజానికి ఇంట్లో ఆడవాళ్ళ ధర్మం ఏమిటి? చుట్టుపక్కల వాళ్ళు శభాష్! చాలా బావుంది! అనాలి. మీరు నిర్వర్తించే బాధ్యతలను చూసి చుట్టుపక్కలవాళ్ళు ఆనందపడాలి! అందువలన స్త్రీ ధర్మం ఏమిటంటే పిల్లలను పెంచటం, వాళ్ళకి మంచి సంస్కారం అందించటం, భర్తలో సంస్కారం లేకపోతే సంస్కారానికి నీరు పెట్టి పోషించటం. తనవైనవన్నిటినీ సరిచేసుకుంటూపోవటమే ధర్మం. సరిచేసుకోవద్దా?

కొందరు ఏం చేస్తారంటే, భగవద్భక్తిలో తన్మయులైవుంటారు కానీ పిల్లలను ఇష్టపడరు. భగవంతుడు ఉన్న పిల్లలను చూసి అయిష్టాన్ని చూపిస్తారు, మరో పక్క భగవంతుని పట్ల భక్తి చూపిస్తారు. అతను భక్తుడు! పిల్లలను దూరం చేస్తారా? అరె, వాళ్ళలో భగవంతుడున్నాడు.

## 3. పిల్లల సమక్షంలో జగడాలు పెట్టుకోగూడదు

మనం మాంసాహారం మద్యం తీసుకోకుండా ఉంటే, ఇంట్లో భార్యతో జగడం పెట్టుకోకుండా ఉంటే, పిల్లలు చూసి అనుకుంటారు, నాన్న ఎంత మంచివాడు అని. ఇతరుల తల్లిదండ్రులు జగడాలు పెట్టుకుంటూవుంటారు కానీ నా తల్లిదండ్రులు జగడమాడరు. ఇలా చేస్తే చాలు పిల్లలు కూడా నేర్చుకుంటారు.

ప్రతిరోజు భర్త భార్యతో దెబ్బలాడుతుంటే దాన్ని పిల్లలు చూస్తుంటారు. 'మా నాన్న కూడా అంతే' అంటారు. అంత చిన్న పిల్లవాళ్ళయినప్పటికీ, న్యాయం ఏమిటన్నది చూసే బుద్ధి వారిలో ఉంటుంది. కూతుళ్ళు ఎప్పుడూ తల్లి పక్షానే మాట్లాడుతారు. కానీ అబ్బాయిలకు న్యాయమేమిటో తెలుసు. దోషం తండ్రిదే అంటారు. ఇద్దరు ముగ్గురితో తండ్రి చేసే తప్పుల గురించి చెప్పి చెప్పి, పెద్దయిన తర్వాత చెప్తాను నీ సంగతి అని నిశ్చయించుకుంటాడు. పెద్దయిన తర్వాత అలాగే చేస్తాడు కూడా. నీ సొత్తు తిరిగి నీకే!

పిల్లల సమక్షంలో ఎప్పుడూ జగడాలాడకూడదు. సంస్కారవంతులుగా మెలగాలి. మీ తప్పున్నా సరే భార్య, 'పోనీలే!' అనాలి, ఆమె తప్పున్నా సరే మీరు 'పోనీలే' అనాలి. పిల్లలు మిమ్మల్ని అలా చూస్తే ఆల్‌రైట్ (సరి) ఐపోతారు. ఒకవేళ దెబ్బలాడాలి అనుకుంటే వేచివుండండి. పిల్లలు స్కూల్‌కి పోయిన తర్వాత ఎంత కావాలంటే అంత దెబ్బలాట పెట్టుకోండి. కానీ పిల్లల ముందు జగడం పెట్టుకుంటే వాళ్ళు చూస్తారు, ఇక చిన్నప్పటి నుంచే వాళ్ళ మనసులో తల్లి, తండ్రి గురించి విరోధ భావన కలుగుతుంది. సకారాత్మక భావన పోయి నకారాత్మకత మొదలౌతుంది. అంటే దాని అర్థం, ఈ కాలపు పిల్లలను చెడగొట్టేవారు వాళ్ళ తల్లిదండ్రులే.

దెబ్బలాడుకోవాలంటే ఏకాంతంలో చెయ్యండా పని కానీ, పిల్లల సమక్షంలో కాదు. ఏకాంతంలో తలుపులు మూసుకుని ఎదురెదురుగా, దెబ్బలాడుకోవాలంటే దెబ్బలాడుకోండి.

ఖరీదైన మామిడి పండ్లు తెచ్చారు, వాటి రసం తీసి, వాటితోపాటు రొట్టెలు చేసి భార్య వడ్డించింది, భోజనం ప్రారంభమైంది. కొద్దిగా తిన్న తర్వాత, కఢీ లో చెయ్యిపెడుతూనే, కొద్దిగా ఉప్పగా అనిపించేసరికి డైనింగ్ టేబుల్ మీద కొట్టి అంటాడు, 'కఢీ ఉప్పగా చేసావు!' అని. అరె, మామూలుగా భోజనం చెయ్యచ్చు కదా. ఇంటి పెద్ద, అతని పైన మరెవరూ లేరు. తనే బాస్ కనుక అరవటం తిట్టటం మొదలు పెడతాడు. తండ్రి ఏమిటలా పిచ్చివాడిలా ప్రవర్తిస్తున్నాడు అని పిల్లలు భయపడతారు. కానీ ఏమీ అనలేరు. పాపం వాళ్ళు అణిగివున్నారు. కానీ, మనసులో ఒక అభిప్రాయాన్ని తయారుచేసుకుంటారు, నాన్న పిచ్చివాడిలా ఉన్నాడు అని.

చివరకు పిల్లలు అందరూ విసుగుచెందుతారు. అమ్మ నాన్న ఇద్దరూ పెళ్ళి చేసుకున్నారు, వాళ్ళ పొందే సుఖాన్ని (వ్యంగంగా) చూసి విసుగు వచ్చింది అని వాళ్ళు అనుకుంటారు. నేను అడిగాను, 'ఏం ఏం చూసారు?' అని. అప్పుడు వాళ్ళు, రోజూ దెబ్బలాడుకుంటూవుంటారు. అందువలన పెళ్ళి చేసుకుంటే కలిగేది బాధే అని, అందువలన పెళ్ళే చేసుకోగూడదని మేము అనుకుంటాము, అన్నారు.

## 4. అన్‌సర్టిఫైడ్ ఫాదర్స్ & మదర్స్

ఒక తండ్రి అంటాడు, 'పిల్లలంతా నాకు విరోధులయ్యారు' అని. నేనన్నాను, 'మీలో యోగ్యత లేదని స్పష్టమౌతోంది!' మీలో యోగ్యత ఉంటే పిల్లలు విరోధులెందుకు అవుతారు? అందువలన ఈ విధంగా మీ గౌరవాన్ని పాడుచేసుకోకండి.

పిల్లలను గద్దిస్తూవుంటే వాళ్ళు చెడిపోతారు. వాళ్ళని సరైన మార్గంలో పెట్టాలంటే వాళ్ళని దగ్గరకు పిలిచి వాళ్ళతో మాట్లాడండి. అప్పుడు వాళ్ళు సరి ఔతారు.

అందుకే నేను పుస్తకంలో 'అన్‌క్వాలిఫైడ్ ఫాదర్స్ & అన్‌క్వాలిఫైడ్ మదర్స్' (యోగ్యత లేని తల్లిదండ్రులు) అని రాసాను. పిల్లలు కూడా అలాగే తయారౌతారు కదా! అందుకే నేను అనవలసివచ్చింది, ఫాధర్ అయ్యే యోగ్యత ఉన్నదని సర్టిఫికేట్ పొందిన తర్వాతనే పెళ్ళిచేసుకోవాలని.

వీళ్ళకి జీవించటమే సరిగ్గా రాదు, ఏమీ రాదు! ఈ సంసారం ఎలా నడపాలన్నది తెలియదు. అందువలన పిల్లలను ఉతుకుతుంటారు. వాళ్ళేమైనా బట్టలా ఉతికి ఆరేయటానికి? పిల్లలను కొట్టి దారిలో పెట్టాలనుకోవటం ఏం పద్ధతి? అప్పడాల కోసం పిండి కలుపుతున్నట్లు. మోగరీతో అప్పడాల పిండిని కలుపుతున్నట్లు ఒక మనిషిని కొట్టటం నేను చూసాను.

తల్లిదండ్రులంటే ఎలా ఉండాలంటే, ఒకవేళ కొడుకు తప్పు మార్గంలో నడుస్తున్నా కూడా, ఒకరోజు తల్లిదండ్రులు 'నాయనా, ఇది మాకు గౌరవం కాదు, ఇలా ఎందుకు చేసావు?' అనగానే రెండవరోజే అదంతా ఆగిపోవాలి. అటువంటి

ప్రేమ ఎక్కువుంది ఇప్పుడు? వీళ్ళంతా ప్రేమ లేని తల్లిదండ్రులు! ఈ జగత్తంతా ప్రేమతోనే వశంలోకి వస్తుంది. ఈ తల్లిదండ్రులకు పిల్లల మీద ఎంత ప్రేమ ఉంది? గులాబీ మొక్క మీద తోటమాలికి ఉన్నంత. అటువంటివాళ్ళని తల్లిదండ్రులని ఎలా అనగలం?

**ప్రశ్నకర్త :** పిల్లల చదువు కోసం లేక సంస్కారం కోసం మేము ఆలోచించనే వద్దా?

**దాదాశ్రీ :** ఆలోచించటంలో తప్పు లేదు.

**ప్రశ్నకర్త :** చదువు స్కూల్లో జరుగుతుంది. కానీ సంస్కారం, గుణం ఎలా ఇవ్వగలం?

**దాదాశ్రీ :** తీర్చిదిద్దటాన్ని స్వర్ణకారునికి వదిలిపెట్టండి. వాళ్ళని తీర్చిదిద్దగలిగే వాళ్ళు వాళ్ళని తీర్చిదిద్దుతారు. కొడుకు పదిహేను సంవత్సరాలకు వచ్చేవరకే వాళ్ళకి ఏమైనా చెప్పగలుగుతారు. అప్పటి వరకు మనం ఎలా ఉన్నామో వాళ్ళని అలా తయారుచేయవచ్చు. ఆ తర్వాత అతని భార్య అతన్ని తీర్చిదిద్దుతుంది. వీళ్ళకి పిల్లలను తీర్చిదిద్దటం చేతనే కాదు కానీ తీర్చిదిద్దే పని తీసుకుంటారు! దానివలన తీర్చిదిద్దే పని సరిగ్గా జరగదు. విగ్రహం సరిగ్గా రూపుదిద్దుకోదు. ముక్కుని రెండున్నర అంగుళాల జాగాలో నాలుగున్నర అంగుళాలు చేసేస్తారు. తర్వాత కొడుకు భార్య వచ్చి, అతని ముక్కుని కోసి సరిచేద్దామని చూస్తుంది. అప్పుడు కొడుకు కూడా ఆమె ముక్కుని కోసేందుకు పోతాడు. అలా ఇద్దరూ ఒకరికొకరు ఎదురెదురుగా అవుతారు.

**ప్రశ్నకర్త :** 'సర్టిఫైడ్ ఫాదర్ మదర్' అంటే ఏమిటి?

**దాదాశ్రీ :** 'సర్టిఫైడ్ పాదర్, మదర్ అంటే, వాళ్ళ పిల్లలు వాళ్ళు చెప్పినట్లుగా వినేవారు. వాళ్ళపిల్లలు వాళ్ళ మీద శ్రద్ధ పెట్టక తల్లిదండ్రులను వేధించేవారు అయినప్పుడు అలాంటి తల్లిదండ్రులను 'అన్‌సర్టిఫైడ్' అనే అనబడతారు కదా?

లేకపోతే పిల్లలు అలా తయారవరు. వాళ్ళు ఆజ్ఞాపాలకులౌతారు. ఇక్కడ తల్లిదండ్రులకే దిక్కులేదు. నేల ఇలా ఉంటే, విత్తనాలు ఎలా ఉంటే, సరుకు (ఫలం) కూడా అలాగే ఉంటుంది. పైగా, 'నా పిల్లలు మహవీర్ అవుతారు' అని అంటారు. మహావీర్ అవుతారా? మహావీర్ తల్లి ఎలా ఉండాలి? తండ్రి ఎలా ఉన్నా పరవాలేదు కానీ తల్లి ఎలా ఉండాలి?

ఇందులో మీకేమైనా రుచించిందా?

**ప్రశ్నకర్త :** ఈ మాట రుచిస్తేనే దాని ప్రభావం కూడా పడుతుంది.

**దాదాశ్రీ :** చాలమంది కొడుకుతో ఇలా అంటారు, 'నువ్వు నేను చెప్పింది వినవు'. నేనంటాను, 'మీ మాటలు వాళ్ళకి నచ్చవు. నచ్చినట్లయితే వాటి ప్రభావం తప్పక పడుతుంది' అని. తండ్రి, 'నువ్వు నా మాట వినవు!' అంటాడు. అరె, నీకు తండ్రి అవటం రాలేదు. ఈ కలియుగంలో మనుషుల దశ చూడండి. సత్యయుగంలో తల్లిదండ్రులు ఎలా ఉండేవారు!

నేను మీకు నేర్పదలచుకుంది ఏమిటంటే, మీ మాటలు మీ పిల్లలకు ఆసక్తిని కలిగించాలి. అప్పుడే వాళ్ళు మీరు చెప్పినట్లు వింటారు. మీరు నన్ను అన్నారు కాదా నా మాటలు మీకు నచ్చుతాయని. మీరు ఈ మాత్రం చెయ్యగలరు.

**ప్రశ్నకర్త :** మీ మాటల ప్రభావం ఎలా ఉంటుందంటే, బుద్ధిని ఉపయోగించి ఏ పరిష్కారాన్నయితే పొందలేకపోయామో, ఆ పరిష్కారాన్ని మీ మాటలు తెచ్చిపెడతాయి.

**దాదాశ్రీ :** హృదయాన్ని స్పర్శించే మాటలు. అవి మదర్లీ (మాతృత్వం కలిగిన) అనబడతాయి.

హృదయాన్ని స్పర్శించే మాటలు ఏ తండ్రి అయినా తన కొడుకుతో అన్నట్లయితే, అతను సర్టిఫైడ్ ఫాదర్ అనబడతాడు.

**ప్రశ్నకర్త :** పిల్లలు అంత త్వరగా ఒప్పుకోరు.

**దాదాశ్రీ :** అయితే హిట్లరిజమ్ (బలవంతంగా) తో ఒప్పుకుంటారా? హిట్లరిజమ్ చేస్తే అది హెల్ప్‌ఫుల్ (ప్రయోజనకరం) కాదు.

**ప్రశ్నకర్త :** వాళ్ళు ఒప్పుకుంటారు కానీ ఎంతో చెప్పిన తర్వాత.

**దాదాశ్రీ :** అదేం పరవాలేదు. న్యాయసమ్మతమే. ఎంతో ఒప్పించవలసి వస్తుంది అంటే కారణమేమిటి? అంటే దాని అర్థం మీరే దాన్ని సరిగ్గా అర్థం చేసుకో లేదన్నమాట! అందుకే ఎక్కువగా వివరించవలసివస్తుంది. తెలివైనవాడికి ఒక్కసారి చెప్తే చాలు. కానీ మనమే అర్థం చేసుకోకపోతే? బాగా చెప్పవలసివచ్చింది కానీ, తర్వాతయితే అర్థం చేసుకుంటారు కదా?

**ప్రశ్నకర్త :** ఔను.

**దాదాశ్రీ :** అదే అన్నిటికన్నా మంచి మార్గం. వీళ్ళేమో కొట్టి, తన్ని, చెప్పాలనుకుంటారు. ఎలాంటి తండ్రి అవుతాడంటే, ప్రపంచంలో ఇంతవరకు ఎవరూ తండ్రి అవనట్లు! అంటే, నచ్చజెప్పి ఎవరైతే పని జరిపించుకుంటారో వాళ్ళని నేను 'అన్‌క్వాలిఫైడ్' అనను.

'తండ్రి అవటం' అనేది సద్వ్యవహారం ఎలా అవాలి? కొడుకుతో దాదాగిరీ చేయటం కాదు, కఠినంగా ప్రవర్తించటమూ కాదు. అప్పుడే తండ్రి అనిపించుకుంటాడు.

**ప్రశ్నకర్త :** పిల్లలు సతాయిస్తుంటే తండ్రి ఏం చెయ్యాలి? అప్పటికీ తండ్రి కఠినంగా ప్రవర్తించగూడదా?

**దాదాశ్రీ :** తండ్రి వ్యవహారం కారణంగానే పిల్లలు సతాయిస్తుంటారు. తండ్రి చేతగానివాడైతే పిల్లలు సతాయిస్తారు. ప్రపంచంలో న్యాయం అలాగే ఉంది. తండ్రికి యోగ్యత లేకపోతే పిల్లలు సతాయించక మానరు.

**ప్రశ్నకర్త :** కొడుకు తండ్రి మాట వినకపోతే ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** 'తప్పు నాదే' అనుకుని వదిలేయాలి! మీది తప్పయితే దాన్ని ఒప్పుకోరు కదా! తండ్రి అవటం వచ్చినట్లయితే తండ్రి అతని మాట వినక పోవటమనేది జరుగుతుందా? కాని తండ్రి అవటమే రాదు కదా!

**ప్రశ్నకర్త :** ఒకసారి తండ్రి అయినట్లయితే ఈ కుక్కపిల్లలు వదిలిపెడతాయా?

**దాదాశ్రీ :** వదిలిపెడతాయా? కుక్కపిల్లలు జీవితమంతా 'డాగ్', 'డాగినీ' లను ఇద్దరినీ గమనిస్తూనేవుంటాయి, అవి భౌభౌ మనటం, ఈ 'డాగిని' కరవటం! 'డాగ్' భౌభౌ అనకమానదు. కానీ చివరకు తప్పంతా ఆ 'డాగ్'దే అవుతుంది. పిల్లలు తల్లి తరఫునే మాట్లాడుతారు. అందుకే నేను ఒక మనిషిని, 'పెద్దయిన తర్వాత ఈ పిల్లలు నిన్ను కొడతారు. కనుక ఇంటావిడతో మంచిగా ఉండు' అన్నాను. ఈ పిల్లలు ఎప్పటివరకు చూస్తుంటారంటే, వాళ్ళకి చేతకానంతవరకే. వాళ్ళకి చేతనైనప్పుడు ఒక గదిలో పెట్టి కుమ్ముతారు. కొందరి విషయంలో అలా జరిగింది కూడా! పిల్లవాడు ఆరోజు నుంచే మనసులో నిర్ణయించుకున్నాడు పెద్దయిన తర్వాత నాన్నకి అంతా తిరిగిస్తాను అని. నాకేమైనా పరవాలేదు కాని అతనికి ఒక గుణపాఠం నేర్పుతాను అని నిశ్చయం చేసుకుంటాడు. ఇది కూడా అర్థం చేసుకోవలసిన విషయమే కదా!

**ప్రశ్నకర్త :** అంటే తప్పంతా తండ్రిదేనా?

**దాదాశ్రీ :** తండ్రిదే! తప్పు తండ్రిదే! తండ్రికి తండ్రయే యోగ్యత లేనపుడే అతని భార్య అతనికి వ్యతిరేకంగా వస్తుంది. తండ్రిలో యోగ్యత లేనప్పుడే అలా జరుగుతుంది కదా! వీళ్ళంతా ఎంతో కష్టపడి సంసారాన్ని నడిపిస్తున్నారు. కానీ భార్య ఎంతకాలం సమాజం ఏమంటుందన్న భయంతో ఉంటుంది?

**ప్రశ్నకర్త :** ఏమిటి, తప్పు ఎప్పటికీ తండ్రిదేనా?

**దాదాశ్రీ :** తప్పు తండ్రిదే అవుతుంది. అతనికి తండ్రి అవటం చేతకాలేదు. అందుకే వ్యవహారమంతా చెడిపోయింది. ఇంట్లో తండ్రి అవాలంటే, అతని భార్య అతని దగ్గర విషయం కోసం వేడుకున్నప్పుడు, ఆ దృష్టి ఉన్నప్పుడు తండ్రి అవగలుగుతాడు.

**ప్రశ్నకర్త :** తండ్రి ఇంట్లో అధికారం చూపించకుండా, తండ్రి అనే పెద్దరికం చూపించకుండా ఉన్నా సరే తప్పు తండ్రిదేనా?

**దాదాశ్రీ :** అలా ఉంటే అంతా సరి అవుతుంది.

**ప్రశ్నకర్త :** అయినా పిల్లలు తండ్రి మాట వింటారన్న గ్యారెంటీ ఏమిటి?

**దాదాశ్రీ :** ఉందిగా! తన 'కేరెక్టర్' (గుణం) మంచిదైతే సంసారంలో అందరూ మంచి కేరెక్టర్ ఉన్నవాళ్ళే (గుణవంతులే) అవుతారు.

**ప్రశ్నకర్త :** పిల్లలు నిమ్న స్థాయివాళ్ళయితే అందులో తండ్రి ఏం చేస్తాడు?

**దాదాశ్రీ :** మౌలికంగా తప్పు తండ్రిదే అవుతుంది. అతనెందుకు అనుభవిస్తున్నాడు? మొదటి నుంచి ఆచరణలో లోపం ఉండబట్టే ఈ దశ వచ్చింది. నేను చెప్పదలచుకున్నదేమిటంటే, ఎవరికైతే గత జన్మలో వారి ఆచరణ మీద 'కంట్రోల్' (నియంత్రణ) తప్పిపోకుండా ఉందో అతని విషయంలో అలా జరగదు. పూర్వ కర్మ ఎలా ఏర్పడింది? మౌలికంగా తన కంట్రోల్ లేకపోవటం వలనే కదా! అంటే నేను కంట్రోల్‌ని నమ్ముతాను. కంట్రోల్‌ని నమ్మటానికి నీవు అందులోని నియమాలన్నిటినీ అర్థం చేసుకోవలసివుంటుంది.

ఈ పిల్లలు మన ప్రతిబింబాలే. మన పిల్లల వలనే మనకి మన తప్పులు ఎన్ని ఉన్నాయన్నది అర్థమౌతుంది!

మీలో శీలమనేది ఉంటే, పులి కూడా మీ వశంలో ఉంటుంది ఇక పిల్లలకెంత ధైర్యం? మన శీలమే అంతుబట్టటం లేదు కనుకనే ఈ గడబడంతా. శీలం అంటే అర్థమైందా మీకు?

**ప్రశ్నకర్త :** శీలమని దేన్ని అంటారు? దీన్ని గురించి అందరికీ అర్థమయ్యేట్టుగా విస్తారంగా చెప్పండి!

**దాదాశ్రీ :** కించిత్తయినా దుఃఖం కలిగించే భావం ఉండగూడదు. తన శత్రువుకైనా ఏమాత్రం బాధ కలిగించే భావన రాకూడదు. అతనిలో 'సిన్సియారిటీ' (నిష్ఠ) ఉండాలి, 'మోరాలిటీ' (నైతికత) ఉండాలి, అన్ని గుణాల సమ్మేళనం కలిగివుండాలి. కించిత్తయినా హింసాత్మక భావన ఉండగూడదు. అతన్ని 'శీలవంతుడు' అంటారు.

**ప్రశ్నకర్త :** ఈకాలం తల్లిదండ్రులలోకి ఇవన్నీ ఎక్కడి నుంచి తేవాలి?

**దాదాశ్రీ :** అయినప్పటికీ కొద్దోగొప్పో ఒక ఇరవై ఐదు శాతమైనా ఉండాలా వద్దా? కానీ మనం ఈ కాలం కారణంగా ఐస్‌క్రీం తింటాం అలాంటి వాటికి అలవాటుపడ్డాం.

**ప్రశ్నకర్త :** తండ్రి గుణం ఎలా ఉండాలి?

**దాదాశ్రీ :** పిల్లలు రోజూ, 'నాన్నా మాకు బయట బాగనిపించదు. మీతోనే బావుంటుంది' అనేటువంటి గుణం ఉండాలి.

**ప్రశ్నకర్త :** కానీ అంతా దానికి వ్యతిరేకంగా జరుగుతోంది. తండ్రి ఇంట్లో ఉంటే కొడుకు బయటకు పోతాడు, తండ్రి బయటకు పోతే కొడుకు ఇంట్లో ఉంటాడు.

**దాదాశ్రీ :** కొడుకుకి తండ్రి లేకుండా బాగనిపించగూడదు. అలా ఉండాలి.

**ప్రశ్నకర్త :** మరి అలా ఉండాలంటే తండ్రి ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** పిల్లలు నన్ను కలుస్తారు కదా, వాళ్ళకి నేను లేకుండా బాగనిపించదు. ముసలివాళ్ళు కలుస్తారు, వాళ్ళకి కూడా నేను లేకుండా బాగనిపించదు. యువతీయువకులు కలుస్తారు కదా, వాళ్ళకి కూడా నేను లేకుండా బాగనిపించదు.

**ప్రశ్నకర్త :** మేము కూడా మీలా తయారవాలని కోరుకుంటున్నాను.

**దాదాశ్రీ :** నేను చేసినట్లు మీరు కూడా చేస్తే అప్పుడు మీరూ నాలాగే తయారౌతారు. మీరు, 'పెప్సీ తీసుకురా' అంటే వాళ్ళు 'లేదు' అంటే, 'ఏం పరవాలేదు మంచినీళ్ళు తీసుకురా' అంటాను. కానీ వీళ్ళు, 'పెప్సీ ఎందుకు తెచ్చిపెట్టుకోలేదు?' అంటారు. దానితో మళ్ళీ వస్తుంది తంటా. నాకు మధ్యాహ్నం భోజనం సమయం

అయినపుడు, 'ఈరోజు వంట చెయ్యలేదు' అని అంటే నేను, 'సరే, కాస్త నీళ్ళు ఇవ్వు చాలు' అంటాను. 'ఎందుకు వండలేదు?' అంటే యుద్ధ సిపాయి అయిపోతారు, అక్కడ యుద్ధం చెయ్యటం మొదలుపెడతారు.

## 5. అర్థమయేటట్టుగా చెప్తే పిల్లలు బాగుపడతారు

కీచులాటలు పెట్టుకునే బదులు మౌనం వహించటం మంచిది. ఏమీ మాట్లాడకుండా ఉండటం మంచిది. పిల్లలు బాగుపడటానికి బదులు చెడిపోతారు. అందువలన ఒక మాట కూడా మాట్లాడవద్దు. చెడిపోతే అది మన బాధ్యత. ఈ మాట అర్థమయ్యేటట్టుగానే ఉంది కదా?

అలా చెయ్యవద్దు అని మీరు అంటే, దానికి విరుద్ధంగానే చేస్తారు. 'అలాగే చేస్తాను ఏం చేసుకుంటారో చేసుకోండి'. వాళ్ళింకా ఎక్కువ చెడిపోతారు. పిల్లలు మన గౌరవాన్ని మట్టిలో కలుపుతారు. భారతీయులకు జీవించటమే రాలేదు! తండ్రి అవటం రాలేదు కానీ తండ్రి అయ్యికూర్చున్నారు. అందుకే నేను ఇట్లా అట్లా అని చెప్పవలసివస్తుంది, పుస్తకాలను ప్రచురించవలసివస్తుంది. లేకపోతే జ్ఞానం తీసుకున్నవారు తమ పిల్లలను చాల బాగా తయారుచేయగలుగుతారు. కూర్చోబెట్టి తల నిమురుతూ, 'బాబూ, నువ్వు ఈ తప్పు చేసావు కదా, అలా అనిపించటం లేదూ!' అని అడగండి.

ఇది ఇండియన్ ఫిలాసఫీ (భారతీయ తత్త్వజ్ఞానం) ఎలా అవుతుంది? తల్లిదండ్రులలో ఒకరు కోప్పడుతుంటే, రెండవవారు పిల్లలను వెనకేసుకునివస్తారు. అందువలన అతను ఏమైనా కాస్త బాగుపడుతుంటే, బాగుపడటం పక్కకి పెట్టి, కొడుకు ఏమనుకుంటాడంటే, 'అమ్మ మంచిది కాని నాన్న చాల చెడ్డవాడు. పెద్దయిన తర్వాత ఇతన్ని నేను కొడతాను' అని.

పిల్లలను బాగుచెయ్యాలి అంటే నా ఆజ్ఞానుసారం నడువు. పిల్లలు అడిగితేనే చెప్పండి, నన్ను అడక్కపోతేనే మంచిది అని కూడా వాళ్ళకి చెప్పండి. పిల్లలకు సంబంధించి ఏమైనా వ్యతిరేక భావన కలిగినట్లయితే వెంటనే ప్రతిక్రమణ చేసెయ్యండి.

ఎవరినైనా బాగుచేసే శక్తి ఈ కాలంలో లేకుండాపోయింది. అందువలన బాగుచెయ్యాలనే ఆశే పెట్టుకోవద్దు. కారణమేమిటంటే, ఎదుటివారిలో మనోవాక్కాయ కర్మల మధ్య ఏకత్వముంటేనే ఎదుటివాళ్ళు బాగవుతారు. మనసులో ఉన్నదే వాక్కు ద్వారా బయటకు రావాలి, ప్రవర్తన కూడా అదే విధంగా ఉండాలి. అలా ఉన్నప్పుడే ఎదుటివారు బాగుపడతారు. ఈ కాలంలో అలా లేదు. ఇంట్లో ప్రతి వ్యక్తితోను వ్యవహారం ఎలా ఉండాలన్నదానిలో 'నార్మలిటీ' (సమానత) తీసుకునిరా. ఆచరణ, ఆలోచన, ఉచ్చారణలలో సరైన పరివర్తన వచ్చినట్లయితే వాళ్ళు పరమాత్మ అవుతారు. లేదు, వ్యతిరేక పరివర్తన వస్తే మాత్రం రాక్షసులే అవుతారు.

ఎదుటివారిలో మెరుగుదలను తీసుకునిరావటం కోసం మనుషులు అంతా ఫ్రాక్చర్ చేసేస్తారు. ముందుగా మీరు బాగువడితే అప్పుడు ఎదుటివారిని బాగుచేయ గలుగుతారు. కాని స్వయంగా బాగుపడకుండా ఎదుటివారిని ఎలా బాగుచేస్తారు?

మీరు పిల్లల గురించి ఆలోచించేటప్పుడు, వాళ్ళకి సద్బుద్ధి కలగాలని భావన చేసుకుంటూవుండాలి. అలా చెయ్యగా చెయ్యగా ఎంతో కాలం తర్వాత దాని ప్రభావం పడక మానదు. వాళ్ళు నెమ్మది నెమ్మదిగా అర్థం చేసుకుంటారు. మీరు భావన చేసుకుంటూవుండండి. వాళ్ళ మీద బలవంతం చేయబోతే వాళ్ళు అందుకు విరుద్ధంగా నడుస్తారు. నీతి ఏమిటంటే, ప్రపంచం ఎలా ఉందో అలాగే నడుచుకుంటూ వుండాలి.

కొడుకు తాగివచ్చాడంటే మీకు మనసుకి బాధ కలుగుతుంది. అప్పుడు మీరు నాతో అంటారు, వీడు నాకు చాల బాధ కలిగిస్తున్నాడు అని. అప్పుడు నేను అంటాను, తప్పు మీదే అని. అందువలన ప్రశాంతంగా అంతా అనుభవిస్తూపో, మీ భావనలో మార్పు రాకుండా చూసుకుంటూ. భగవాన్ మహావీర్ నియమం ఇది. మరి ప్రపంచంలోని నియమం వేరు. లోకులంతా 'కొడుకుదే తప్పు' అంటారు. అలా అనేవాళ్ళే ఉంటారు అంతా. మీరు ఇంకా గట్టిగా నమ్ముతారు, 'తప్పంతా కొడుకుదే, నేను అనుకున్నది నిజమే' అని. పెద్ద వచ్చారు గొప్పగా అర్థం చేసుకునేవారు! 'తప్పు మీదే' అంటారు భగవాన్.

మీరు ఫ్రెండ్‌షిప్ (మైత్రి) చేస్తే పిల్లలు బాగుపడతారు. మీ ఫ్రెండ్‌షిప్ ఉంటే పిల్లలు బాగుపడతారు. అలా కాకుండా తల్లిదండ్రులలాగానే ఉంటే, పెత్తనం చెలాయిస్తుంటే, అది ప్రమాదానికి దారితీస్తుంది. ఫ్రెండ్ (మిత్రుడు) లా ఉండాలి. వాళ్ళు ఫ్రెండ్‌ని బయట వెతుక్కోగూడదు. అలా ఉండాలి మీ ప్రవర్తన. మీరు ఫ్రెండ్ అయినట్లయితే, అతనితో మీరు ఆడుకోవాలి, అన్నీ ఒక ఫ్రెండ్ చేసినట్లే చేయాలి. నువ్వు వచ్చిన తర్వాత మనం కలిసి టీ తాగుదాం– అలా మాట్లాడాలి. మనమంతా కలిసి టీ తాగుదాం. మీకు ఫ్రెండ్ అయినట్లయితే అలా వ్యవహరించాలి. అలా చేస్తే పిల్లలు మీ పక్షాన ఉంటారు. లేకపోతే పిల్లలు మీకు దక్కరు. నిజానికి పిల్లలు ఎవరూ ఎవరివాళ్ళూ కారు. ఎవరైనా మనిషి చనిపోతే అతనితోపాటు అతని కొడుకు చనిపోతాడా? అందరూ ఇంటికి వచ్చి తింటారు, తాగుతారు. వీళ్ళు పిల్లలు కారు. వీళ్ళు కేవలం ప్రకృతి నియమానుసారం (సంబంధం కారణంగా) అలా కనిపిస్తారు అంతే. 'యువర్ ఫ్రెండ్' (మీ స్నేహితుడు) కి అనుగుణంగా ఉండాలి. మీరు ముందుగా నిర్ణయించుకుంటే మీరు మీ ఫ్రెండ్ కి అనుగుణంగా నడుచుకోగలుగుతారు. ఫ్రెండ్ ఇష్టపడని విధంగా మాట్లాడరు. అతను వ్యతిరేకంగా నడుచుకుంటూవుంటే మనం అతనికి ఎంతకాలం చెప్తుంటామంటే అతను ఒప్పుకునేంతవరకు. అప్పటికీ ఒప్పుకోకపోతే 'సరే నీ ఇష్టం!' అంటాం. ఫ్రెండ్ అవాలంటే ముందుగా మనసులో ఏమనుకోవాలి? బయటి వ్యవహార రీత్యా 'నేను అతని తండ్రిని' అని. కానీ మనసులో, నేను అతని కొడుకుని' అనుకోవాలి. అలా చేస్తేనే ఫ్రెండ్‌షిప్ ఉంటుంది లేకపోతే ఉండదు. తండ్రి మిత్రుడు ఎలా అవుతాడు? అతని లెవెల్ (స్థాయి) వచ్చినపుడు. అతని లెవెల్‌కి ఎలా రావాలి? మనసులో అతను, 'నేను అతని పుత్రుడను' అనుకోవాలి. అలా అనుకుంటే చాలు పని జరిగిపోతుంది. కొందరు అలా భావిస్తారు, వాళ్ళ పని నెరవేరుతుంది కూడా.

**ప్రశ్నకర్త :** పదహారు సంవత్సరాల వయసు తర్వాత పిల్లలతో కలిసిపోవాలి అని చెప్పారు. పదహారు సంవత్సరాలకు ముందు కూడా వాళ్ళతో ఫ్రెండ్‌షిప్‌లో ఉండాలా?

**దాదాశ్రీ :** అలా చేస్తే మరీ మంచిది. కానీ పది, పదకొండు సంవత్సరాల వరకు మనం ఫ్రెండ్‌షిప్ చేయలేము. అప్పటివరకు అతను తప్పొప్పులు చేస్తూనేవుంటాడు. అందువలన అతనికి అర్థమయ్యేటట్లుగా చెప్తుండాలి. ఒకటో అరో సార్లు ఒక దెబ్బ కూడా పడుతుండాలి– పది, పదకొండు సంవత్సరాల వరకు. అతను తండ్రి మీసాలు పట్టుకుని లాగుతుంటే, ఒక్కటి తగిలించాలి. తండ్రిలా పెత్తనం చేసేవాళ్ళు దెబ్బతినిపోయారు.

ప్రతి మనిషీ, తన పిల్లలను సరైన దార్లో పెట్టే ప్రయత్నం చేయాలి. కానీ ఆ ప్రయత్నం సఫలమవాలి. తండ్రి అయిన తర్వాత పిల్లలను సరైన మార్గంలో పెట్టే దిశగా అతను తండ్రి పెత్తనాన్ని వదిలేసుకోగలడా? 'నేను తండ్రిని' అనే భావనను వదిలేసుకుంటాడా?

**ప్రశ్నకర్త :** వాడిని బాగుచేసే ప్రయత్నంలో అహంభావం, ద్వేషం, అన్నీ వదిలేయాలా?

**దాదాశ్రీ :** మీరు తండ్రి అనే భావనను వదిలేయాలి.

**ప్రశ్నకర్త :** 'వీడు నా కొడుకు' అనే భావన పెట్టుకోవద్దు లేక 'నేను వీడి తండ్రిని' అనే భావన పెట్టుకోవద్దు.

**దాదాశ్రీ :** అలా చెయ్యగలిగితే దాన్ని మించి ఏమీ లేదు.

నా స్వభావం ప్రేమభరితం కనుక, ఇద్దరు ముగ్గురు మనుషులు నన్ను ప్రేమగా 'దాదా' అని పిలిచేవారు. మిగతావారంతా, 'దాదా ఎప్పుడు వచ్చారు?' అంటూ పైపైకే అంటారు. నేనంటాను 'మొన్న వచ్చాను' అని. అంతే ఇంకేమీ ఉండదు. అంతా పైకి చూపించే వందనాలు! కాని వాళ్ళు 'రెగ్యులర్' (నియమిత) నమస్కారాలు పెడతారు. నేను ఆలోచించి తెలుసుకున్నాను, వీళ్ళు నన్ను 'దాదా' అంటే నేను కూడా వీళ్ళని 'దాదా' గా భావించాలి అని. అంటే ప్లస్ మైనస్ చేస్తూ భేద భావాన్ని పోగొట్టుకుంటూవుండేవాడిని. నేను వాళ్ళని మనసులో దాదాగా భావిస్తుంటే నా మనస్సు నిర్మలంగా, తేలిగ్గా ఉంటూవస్తే వాళ్ళలో 'అట్రాక్షన్' ఆకర్షణ అంత పెరుగుతూవచ్చింది.

నేను మనసులో వాళ్ళని 'దాదా' గా భావిస్తాను కనుకనే నా మాటలు వాళ్ళ మనసుకి చేరుతాయి! వాళ్ళకి, 'ఓహోహో! ఆయనకు నా మీద ఎంత మంచి భావన ఉంది!' అనిపిస్తుంది. ఇది లోతుగా అర్థం చేసుకోవలసిన మాట. ఇటువంటి సూక్ష్మం అప్పుడప్పుడు బయటపడతాయి. వాటిని మీకు చెప్తుంటాను. వాటిని మీరు పాటిస్తే మీకు మంచి జరుగుతుంది. అటువంటి మాటలవి. అప్పుడేం చేస్తారు? ఇలా ప్రతిసారి నడుస్తుంటుంది కనుక, వాళ్ళ మనసులో, దాదాలాంటి వాళ్ళు వేరెవరూ ఉండరు అనిపిస్తుంది.

**ప్రశ్నకర్త :** కొడుకు ఎందుకు అడ్జస్ట్ (అనుకూలంగా) అవటం లేదు అని తండ్రి అనుకుంటాడు.

**దాదాశ్రీ :** అది తండ్రి అనే అధికారం. అతనికి తెలియటం లేదు. తండ్రిగా పెత్తనం చెయ్యటం అంటే అర్థం చేసుకోకపోవటం. ఎక్కడైతే పెత్తనం అనేది వస్తుందో అక్కడ మనిషి తన స్పృహ కోల్పోయినట్లే.

**ప్రశ్నకర్త :** కానీ అందుకు విరుద్ధంగా తండ్రి, 'నేను నీ తండ్రిని కదా, నువ్వు నేను చెప్పేది వినవా? నాకు గౌరవమివ్వవా?' అంటాడు.

**దాదాశ్రీ :** 'నీకు తెలియదా నేను నీ బాబునని?' అని ఒకతను అనటం నేను విన్నాను. ఎలాంటి మనిషితను? అలా కూడా అనవలసివస్తుందా? ప్రపంచమంతా తెలిసిన విషయాన్ని చెప్పవలసి కూడా వస్తుందా?

**ప్రశ్నకర్త :** దాదా, ఆ తర్వాత డైలాగ్ (సంభాషణ) కూడా నేను విన్నాను. 'నీకు ఎవరు చెప్పారు నన్ను కనమని?'

**దాదాశ్రీ :** అలా అన్నప్పుడు ఇక మన గౌరవం ఏముంటుంది?

## 6. చిన్నారులను ప్రేమతో సరిచేయండి

**ప్రశ్నకర్త:** అతని తప్పు ఉన్నప్పుడు గట్టిగా చెప్పవలసివస్తుంది కదా!

**దాదాశ్రీ:** అలాంటప్పుడు మీరు అతన్ని ఇలా అడగాలి- ఇదంతా నువ్వు చేస్తున్నావు కదా, నీకు బాగనిపిస్తోందా? ఇదంతా నువ్వు ఆలోచించే చేస్తున్నావా? అని. అతను ఒకవేళ నాకు బాగనిపించటం లేదు అని అంటే, మీరు, మరి బాబూ అలాంటప్పుడు వట్టిగా ఎందుకలా చెయ్యటం? అనాలి. అలా ఆలోచించి మాట్లాడండి! ఎవరైనా అర్థం చేసుకుంటారు. అందరూ ఎవరికి వారు న్యాయం ఏమిటి అని ఆలోచిస్తారు. తప్పు జరిగినప్పుడు స్వయంగా అది తెలుసుకుంటారు. 'నువ్వు ఎందుకలా చేసావు?' అని అంటే దాన్ని తప్పుగా తీసుకుంటాడు. 'నేను చేస్తున్నదే సరైనది' అంటాడు, మళ్ళీ అలాగే చేస్తాడు. ఇల్లు నడపటం చేతకాదు. ఎలా జీవించాలి అన్నది తెలియదు. అందుకే జీవితాన్ని హాయిగా గడిపేందుకు అవసరమైన తాళంచెవిని అందించటం జరుగుతోంది.

ఎదుటివారిలో అహంకారం పైకి లేవగూడదు. మన నుండి అధికారంతో మాటలు బయటకే రాకూడదు. అంటే అధికార భావమే ఉండగూడదు. పిల్లలకు మీరు ఏమైనా చెప్తే అది అధికారంతో చెప్పినట్లు ఉండగూడదు.

**ప్రశ్నకర్త:** ప్రపంచంలో ఎన్ని రకాల బాధ్యతలను నెరవేర్చవలసివుంటుంది అలా బాధ్యతలను నెరవేర్చకూడా ఒక ధర్మమే. అలా ధర్మాచరణలో తెలిసో తెలియకో ఏమైనా కటువుగా మాట్లాడితే అది పాపం, దోషం అవుతుందా?

**దాదాశ్రీ:** అదేమిటంటే, కటువుగా మాట్లాడేటప్పుడు మన ముఖం ఎలా ఉంటుంది? గులాబి పువ్వులా ఉంటుందా? మీరు ముఖం మాడ్చుకునే విధంగా మాట్లాడితే అది పాపం చేసినట్లేనని అర్థం చేసుకోండి. కటువుగా మాట్లాడకండి. కొద్దిగా ఏమైనా చెప్పండి కాని, అహింసాత్మకంగా అర్థం చేసుకుని చెప్పండి. ప్రేమగా ఉంటే ఏదో ఒక రోజు మీరు గెలుస్తారు. కటువుగా ఉంటే గెలవలేరు. పైగా అది వ్యతిరేకంగా మారుతుంది, పరిణామం విరుద్ధంగా ఉంటుంది. 'ఇప్పుడు నేను

చిన్నవాడిని కనుకనే నన్ను తిడుతున్నారు కదా, నేను పెద్దయిన తర్వాత చూపిస్తా' అనే అభిప్రాయం అతనిలో ఏర్పరచుకుంటాడు. అందువలన అలా చెయ్యవద్దు. అతనికి నచ్చచెప్పు. ఏదో ఒక రోజు ప్రేమతోనే గెలుస్తారు. రెండు రోజులలో ఫలితం వచ్చేయదు. పది రోజులు, పదిహేను రోజులు, నెల వరకు ప్రేమగా ఉండు. చూడండి మరి ప్రేమ ఫలితం ఎలా ఉంటుందో!

**ప్రశ్నకర్త :** అనేకసార్లు చెప్పినా వాడు వినకపోతే ఏం చెయ్యాలియ?

**దాదాశ్రీ :** చెప్పాల్సిన అవసరమే లేదు. ప్రేమగా ఉండు. నెమ్మదిగా అతనికి అర్థమయ్యేటట్లుగా చెప్పు. మీ పొరుగువారితో కూడా అలా కటువుగా మాట్లాడుతారా?

మనం నిప్పు రవ్వని ఎలా పట్టుకుంటాం? పట్టుకారతోనే కదా! పట్టుకార పెట్టుకుంటావు కదా. అదే చేతితో నిప్పురవ్వని పట్టుకుంటే ఏమౌతుంది?

**ప్రశ్నకర్త :** కాలుతుంది.

**దాదాశ్రీ :** అందుకే పట్టుకారుని దగ్గరుంచుకోవాలి.

**ప్రశ్నకర్త :** మరి ఎలాంటి పట్టుకారుని పెట్టుకోవాలి?

**దాదాశ్రీ :** మీ ఇంట్లోని ఒక వ్యక్తి పట్టుకారులాంటివాడు. అతను కాలకుండా కాలుతున్న ఎదుటివారిని పట్టుకుంటాడు. అలాంటివాడిని పిలిచి మనం, 'అరె బాబూ, నేను వీడితో మాట్లాడబోతున్నాను. నువ్వు కూడా నాకు తోడుగా ఉండు' అనాలి. ఆ తర్వాత అతను అంతా సరిచేస్తాడు. ఏదైనా ఒక మార్గాన్ని వెతికి పట్టుకోవాలి. ఒట్టి చేతులతో నిప్పుని ముట్టుకుంటే పరిణామం ఎలా ఉంటుంది?

మనం చెప్పటం వలన ఎటువంటి ఫలితమూ రాకపోయినట్లయితే మిన్నకుండటమే మంచిది. మీరు మూర్ఖులు. మీకు మాట్లాడటం చేతకాదు. అందుకే మీరు మాట్లాడకుండా ఉండాలి. మనం చెప్పటం వలన ఫలితమేమీ రాదు సరికదా, మన మనసు కూడా కలతపడుతుంది, ఆత్మ క్షోభిస్తుంది. అటువంటి పని ఎవరు చేస్తారు?

**ప్రశ్నకర్త :** తల్లిదండ్రులు తమ పిల్లలతో ఏర్పరచుకునే బంధం ఏదైతే ఉంటుందో, అందులో ఒక్కోసారి కాస్త ఎక్కువైనట్లే అనిపిస్తుంది.

**దాదాశ్రీ :** అదంతా ఇమోషనల్ (భావుకత). తక్కువగా చూపించేవారు కూడా ఇమోషనలే. నార్మల్‌గా (సామాన్యంగా) ఉండాలి. నార్మల్ అంటే కేవలం బయటకు చూపించటం వరకే, డ్రామేటిక్ (నాటకీయత). డ్రామా (నాటకం) లో, ఒక స్త్రీతో కలిసి నాటకం ఆడుతున్నారనుకోండి. అది చూసేవాళ్ళకి నిజంగా జరుగుతున్నట్లుగా, ఎగ్జాక్ట్‌గా అవుతున్నట్లుగా, రియల్ (నిజమని) అనిపిస్తుంది. కాని, కళాకారులు బయటకు వచ్చి కూడా, 'పద నాతో' అంటే? ఆమె వెంట రాదు. 'అదంతా డ్రామా వరకే' అంటుంది. అర్థమౌతోందా?

ఈ ప్రపంచంలో బాగు చేసే దారి ప్రేమ ద్వారా మాత్రమే. ప్రపంచంలో ప్రేమ అని అంటున్నది నిజానికి ప్రేమ కాదు. అది ఆసక్తి. ఈ అమ్మాయిని ప్రేమిస్తుంటే, ఆమె ఒక కప్పుని పగలగొట్టినపుడు కూడా ప్రేమ ఉంటుందా అలాగే? అప్పుడు నువ్వు కోపం చూపిస్తావు కదా. అంటే అది ఆసక్తి. పిల్లలు ప్రేమని వెతుక్కుంటూవుంటారు. కానీ వాళ్ళకి ప్రేమ లభించదు. ఇక వాళ్ళ కష్టాలు వాళ్ళకే తెలుసు. ఎవరికీ చెప్పుకోలేరు, భరించనూలేరు. ఈకాలం యువత కోసం నాదగ్గర ఒక మార్గం ఉంది. ఈ ఓడని ఎలా నియంత్రించాలి అన్న మార్గం నాకు లోపలి నుంచి గోచరిస్తుంది. నాలో ఎటువంటి ప్రేమ ఉద్భవిస్తుందంటే, అది పెరగదూ, తగ్గదు. పెరగటం, తరగటం జరిగితే అది ఆసక్తి అనబడుతుంది. పెరగటం తగ్గటం అనేది లేనిది పరమాత్మ ప్రేమ. అందరూ ప్రేమకు లొంగుతారు. నిజమైన ప్రేమ ఏదైతే ఉంటుందో, అది ఎక్కడా చూడటానికైనా దొరకదు. ఈ జగత్తు ప్రేమ అనేదాన్ని చూడనేలేదు. జ్ఞాని పురుష్ లేక భగవాన్ ఎప్పుడైనా అయితే అప్పుడు చూడగలుగుతారు. ప్రేమ పెరగటం, తరగటం జరగదు. ఆసక్తి అలా అవుతుంది. అదే ప్రేమ. జ్ఞానుల ప్రేమే పరమాత్మ.

చిన్నపిల్లలతో నాకు బాగా కలుస్తుంది. నాతో ఫ్రెండ్‌షిప్ (స్నేహం) చేస్తారు. ఇప్పుడు లోపలికి వస్తుంటే, ఒక చిన్న పిల్లవాడు నన్ను తీసుకుని వెళ్ళటానికి వచ్చి

'పదండి' అన్నాడు. నాతో ఫ్రెండ్‌షిప్ చేసాడు. మీరు గారాబం చేస్తారు కదా. నేను గారాబం చెయ్యను. ప్రేమ చూపిస్తాను.

**ప్రశ్నకర్త :** దాదాజీ, గారాబం చెయ్యటం, ప్రేమ చూపించటం, ఏదైనా ఉదాహరణతో ఇది కాస్త వివరించండి.

**దాదాశ్రీ :** అరె, ఒక మనిషి తన పిల్లవాడిని ఛాతీకి ఎలా గట్టిగా హత్తుకున్నాడో! రెండు సంవత్సరాల నుంచి ఆ పిల్లవాడిని చూడలేదట. ఇక ఎత్తుకుని ఎలా హత్తుకున్నాడంటే, ఆ పిల్లవాడు బాగా నలిగిపోయాడు. వాడి దగ్గర మరేదారి లేక అతన్ని కొరికేసాడు. ఇదేమైనా సరైన పద్ధతేనా? వీళ్ళకి తండ్రి అవటం కూడా చేతకాదు.

**ప్రశ్నకర్త :** నిజంగా ప్రేమ చూపించేవాడు ఎలా చేస్తాడు?

**దాదాశ్రీ :** అతను బుగ్గ మీద నిమురుతాడు, భుజం మీద తట్టుతాడు. అలా వాడిని సంతోషంగా చూస్తాడు. కాని పాపం వాడికి ఊపిరి ఆడకుండా అలా గట్టిగా నొక్కేయాలా? అలాంటప్పుడు కొరుకుతాడుకదా! కొరక్కపోతే ఊపిరి ఆగిపోయుంటే?

ఇక, పిల్లలను ఎప్పుడూ కొట్టవద్దు. ఏమైనా తప్పులు చేస్తే అర్థమయ్యేటట్లుగా చెప్పండి. నెమ్మదిగా నుదుటి మీద చేతితో తడుముతూ తప్పక నచ్చచెప్పండి. ప్రేమగా చూస్తే పిల్లవాళ్ళు అర్థం చేసుకుంటారు.

## 7. విపరీత ధోరణి ఇలా వదిలిపోతుంది

ఎప్పుడైనా డ్రింక్స్ (మద్యం) తీసుకుంటారా?

**ప్రశ్నకర్త :** అప్పుడప్పుడు. ఎప్పుడైనా ఇంట్లో గొడవ జరిగినప్పుడు. నేను నిజం చెప్తున్నాను.

**దాదాశ్రీ :** మానెయ్యండి. దానికి బానిసైపోయారు. అవన్నీ నడవవు, అవన్నీ వద్దు. తీసుకోవద్దు. అసలు ముట్టుకోనేవద్దు. ఇది దాదా ఆజ్ఞ. కాబట్టి అలాంటి వాటిని ముట్టుకోవద్దు. అప్పుడే మీ జీవితం బాగా నడుస్తుంది. ఎందుకంటే ఇక మీకు దాని అవసరమే ఉండదు. ఈ చరణవిధి ఇవన్నీ చదివితే మీకు దాని అవసరం పడదు. ఆనందం పూర్తిగా ఉంటుంది. ఎంతో ఆనందంగా ఉంటారు. అర్థమైందా లేదా?

**ప్రశ్నకర్త :** వ్యసనం నుండి విముక్తులమెలా అవాలి?

**దాదాశ్రీ :** వ్యసనం నుండి విముక్తులవాలంటే, 'వ్యసనం చాల చెడ్డది' అన్నది మనకి అర్థమవాలి. ఆ అర్థమైంది ఢీలాగా ఉండగూడదు. నిశ్చయం ధృఢంగా ఉండాలి. అలా చేస్తే మనిషి వ్యసనాలకు దూరంగా ఉంటాడు. 'ఇందులో తప్పేమీ లేదు' అని అనుకుంటే ఆ వ్యసనం ఇంకా బలంగా తయారౌతుంది.

**ప్రశ్నకర్త :** చాల కాలం నుండి ఎవరైనా మద్యం సేవిస్తూవస్తుంటే, లేదా డ్రగ్స్ (మాదక ద్రవ్యాలు) తీసుకుంటూవుంటే, వాటి ప్రభావం వాళ్ళ మెదడు మీద పడుతుంది అని అంటారు. తర్వాత మానేసినా కూడా ఆ ప్రభావం అలాగే ఉంటుంది కదా. ఆ ప్రభావం నుంచి విముక్తులవటానికి మీరేం చెప్తారు? ఏ విధంగా బయటపడాలి? అందుకేమైనా మార్గం ఉందా?

**దాదాశ్రీ :** దాని రియాక్షన్ తర్వాత వస్తుంది. పరమాణువులన్నీ శుద్ధమవాలి కదా! తాగుడు మానేసారు కదా? ఇక అతను ఏం చెయ్యాలి? 'తాగటం తప్పు' అని ఎల్లప్పుడూ అనుకుంటూవుండాలి.

ఔను. వదిలిపెట్టిన తర్వాత కూడా అలా అనుకుంటూనేవుండాలి కానీ, అది మంచిదే అని ఎప్పుడూ అనుకోగూడదు. లేకపోతే తిరిగి దాని ప్రభావం పడుతుంది.

**ప్రశ్నకర్త :** మద్యం సేవించటం వలన మెదడుకి ఎలాంటి నష్టం కలుగుతుంది?

**దాదాశ్రీ :** ఒకటి మంచిచెడు విస్మరిస్తాడు. ఆ సమయంలో లోపల ఉండే ఎరుక మీద పొర కమ్ముతుంది. ఇక ఆ పొర ఎన్నటికీ పోదు. మనసులో మనం, అది తొలగిపోయిందని అనుకుంటాం కాని అది తొలగిపోదు. అలా చెయ్యగా చెయ్యగా పొర కమ్మి కమ్మి, చివరకు మనిషికి పూర్తిగా జడత్వం వచ్చేస్తుంది. ఇక ఆ మనిషికి మంచి ఆలోచనలే రావు. డెవలప్ అయిన (వికాసం పొందిన) తర్వాత, వాళ్ళు అందులోంచి బయటపడిన తర్వాత బ్రైన్ (మెదడు) చాల బాగా డెవలప్ అవుతుంది. అది మళ్ళీ తిరిగి చెడిపోగూడదు.

**ప్రశ్నకర్త :** మద్యం సేవించటం వలన డ్యామేజ్ అయిన (నష్టపోయిన) మెదడు, మెదడులోని డ్యామేజ్ అయిన పరమాణువులు, ఆ డైమండ్ శరీరభాగం తిరిగి రిపేర్ ఎలా అవుతుంది?

**దాదాశ్రీ :** దానిక మార్గమే లేదు. అతి కాలక్రమంలో నెమ్మది నెమ్మదిగా పోతుంది. తాగకుండా ఉన్న జీవితాన్ని గడుపుతున్న సమయంలో క్రమక్రమంగా దాని నివారణ జరుగుతుంటుంది. ఒకేసారి అయిపోదు. మద్యమాంసాలతో జరిగే నష్టం, మద్యమాంసాల వలన కలిగే సుఖం, ఆ సుఖాన్ని 'రి పే' చేసే సమయంలో పశుయోనిలోకి పోవలసివుంటుంది. మీరు ఎంత సుఖాన్నయితే అనుభవించారో, దాని 'రి పే' చేయవలసివుంటుంది. ఆ బాధ్యతను మీరు అర్థం చేసుకోవాలి. ఈ జగత్తంతా వట్టి విషయం కాదు. జగత్తులో అంతా తిరిగి ఇవ్వవలసివుంటుంది. కేవలం అంతరంగంలో కలిగే సుఖాన్ని మాత్రమే తిరిగి ఇవ్వవలసిన అవసరం ఉండదు. మిగిలిన బాహ్య సుఖాలన్నిటినీ 'రి పే' చెయ్యవలసివుంటుంది. ఎంత జమ చేసుకోవాలో అంత చేసుకుని, తిరిగి వాపసు ఇవ్వవలసివుంటుంది.

**ప్రశ్నకర్త :** మరు జన్మలో పశువై, 'రి పే' చెయ్యవలసివస్తే సరే కాని, ఈ జన్మలో దాని పరిణామమేమిటి?

**దాదాశ్రీ :** ఈ జన్మలో అతనికి పొర కమ్మి ఉంటుంది కనుక అతను జడంలాంటివాడే, పశువులాగానే అయిపోతాడు. మనుషులలో 'ప్రిస్టైజ్' ఉండదు. ఎవరూ గౌరవించరు, ఏమీ ఉండదు.

గుడ్లు, పిల్లలు ఒకలాంటివాళ్ళే. ఎవరి గుడ్లయినా తినటం లేక ఎవరి పిల్లలనైనా తినటం రెండిటిలో తేడా లేదు. నీకు పిల్లలను తినటం ఇష్టమా? నువ్వు ఎవరి పిల్లలనైనా తినటానికి ఇష్టపడతావా?

**ప్రశ్నకర్త :** గుడ్లలో కూడా శాకాహారి గుడ్లుంటాయని కొందరు నమ్ముతారు.

**దాదాశ్రీ :** లేదు. ఆ నమ్మకం సరి కాదు. నిర్జీవ గుడ్లు అని వేటిని అంటారో, అవేమైనా ప్రాణం లేకుండా ఉండే వస్తువులా? జీవం లేనివాటిని అసలు తిననేగూడదు.

**ప్రశ్నకర్త :** ఈ మాటలు కాస్త వేరుగా ఉన్నాయి. దయచేసి వివరించండి

**దాదాశ్రీ :** వేరుగానే ఉన్నా ఇవి ఎగ్జాక్ట్‌గా ఉన్న మాటలు. 'సైంటిస్ట్' లు కూడా, ఎప్పుడూ నిర్జీవ పదార్థాలను తినగూడదు, జీవంతో ఉన్నవాటినే తినాలనే అన్నారు. అందులో జీవం ఉంది కాని, భిన్న ప్రకారమైన జీవం. ఈ మాటను మనుషులు తమ స్వలాభం కోసం వాడుకున్నారు. వాటిని తాకనేవద్దు. పిల్లలకు ఆ గుడ్లను తినిపిస్తే ఏమౌతుంది? శరీరంలో ఆవేశం పెరిగి కంట్రోల్‌లోనే ఉండకుండా పోతుంది. మన వెజిటేరియన్ ఫుడ్ (శాకాహార భోజనం) చాల మంచిది. పచ్చిగా ఉన్నా సరే. ఇందులో డాక్టర్ల తప్పేమీ లేదు. వాళ్ళకి తెలిసినదాన్నిబట్టి, అర్థం చేసుకున్నదాన్నిబట్టి చెప్తారు. మనం మన సంస్కారాలను రక్షించుకోవాలి కదా! మనం సంస్కారవంతమైన కుటుంబాలకు చెందినవాళ్ళం.

**ప్రశ్నకర్త :** అమెరికాలో దాదా చాలమంది యువకులను ఒక్కసారే టర్న్ చేసేసారు (మార్చివేసారు).

**దాదాశ్రీ :** ఔను. వాళ్ళ తల్లిదండ్రులు వాళ్ళ మీద ఆరోపణలు చేసారు, వాళ్ళు చెడిపోతున్నారు, ఏం చెయ్యాలంటూ. 'మీరు ఎప్పుడు బాగుపడ్డారుగనక వాళ్ళు చెడిపోయారని అనటానికి! మీరు మాంసాహారం తింటారా?' అని అడిగితే, 'ఆ. అప్పుడప్పుడు' అన్నారు. అందుకే ఆ పిల్లలు, మా తండ్రి చేస్తున్నాడు కాబట్టి అది చేసే పనే అని అనుకున్నారు. మంచి పనైతేనే తండ్రి చేస్తాడు కదా! ఇవన్నీ

మీకు శోభనివ్వదు. ఇక ఆ పిల్లలను మాంసాహారం వదిలిపెట్టేటట్టు చేసాను. ఆ పిల్లలతో, 'నువ్వు బంగాళదుంపని కొయ్యగలవు కదా, నువ్వు ఈ బొప్పాయిని కొయ్యగలవా? ఈ ఆపిల్ పండుని కోస్తావా? వీటన్నిటినీ కొయ్యగలరు కదా?' అని అంటే, 'ఔను వాటన్నిటినీ కొయ్యగలం' అన్నారు వాళ్ళు. 'కకడీ అంత పెద్దగా ఉంటుంది కదా, దాన్ని కూడా కొయ్యగలుగుతాను' అన్నాడు. 'ఆ సమయంలో మీ హార్ట్ (హృదయం) మీద దాని ప్రభావమేమీ ఉండదా?' అంటే 'ఉండదు' అన్నారు. ఆ తర్వాత నేను వాళ్ళని, 'మేకని కొయ్యగలరా?' అని అడిగాను. 'లేదు' 'కోడిని కోస్తారా?' 'లేదు నేను కొయ్యలేను' 'అందువలన, మీ హార్ట్ దేన్నయితే కొయ్యటానికి 'యాక్సెప్ట్' చేస్తుందో (ఒప్పుకుంటుందో) దాన్ని తినండి. హార్ట్‌కి ఇష్టం లేనివి, రుచించనివి తినకండి. లేదంటే దాని పరిణామం వేరుగా ఉంటుంది. ఆ పరమాణువులు మీ హార్ట్ మీద ప్రభావాన్ని చూపుతాయి. ఫలితంగా, ఆ యువకులంతా బాగా అర్థం చేసుకుని, వదిలిపెట్టేసారు.

(ప్రసిద్ధ రచయిత) 'బెర్నార్డ్ షా' ని ఒకరు అడిగారు, 'మీరు మాంసాహారం ఎందుకు తినరు?' అని. 'నా శరీరం స్మశానభూమి కాదు. ఇది కోడిపెట్ట, కోడిపుంజుల స్మశానవాటిక కాదు' అన్నాడు. కాని దానివలన లాభమేమిటి? అంటే అతను, 'ఐ వాంట్ టు బి ఎ సివిలైజ్డ్ మాన్' (నేను ఒక సంస్కారిగా ఉండదలచుకున్నాను) అన్నాడు. అయినా అంటుంటారు, 'క్షత్రియులకు అందుకు అధికారం ఉంది కాని, వాళ్ళ క్షత్రియత ఉంటేనే ఆ అధికారం ఉంటుంది' అని.

**ప్రశ్నకర్త :** చిన్న పిల్లలందరికీ మగదలె (ఎక్కువ నేతితో తయారు చేసిన మిఠాయి) తినిపిస్తే వాళ్ళు బాగా ఎదుగుతారు కదా?

**దాదాశ్రీ :** లేదు. అలా చేయవద్దు. మగదల్ తినిపించకండి. చిన్నపిల్లలకు మగదల్, గోంద్‌పాక్, పక్వాన్ ఇలాంటివి ఎక్కువగా తినిపించకండి. వాళ్ళకి మామూలు భోజనం పెట్టండి, పాలు కూడా తక్కువగా ఇవ్వండి. పిల్లలకు అలాంటివన్నీ పెట్టవద్దు. పాలతో చేసిన పదార్థాలను పిల్లలకు ఊరికూరికే పెడుతుంటారు. అలాంటివి పెట్టవద్దు.

ఉద్వేగాలు పెరుగుతాయి, పన్నెండు సంవత్సరాలు వచ్చేసరికే వాళ్ళలో దృష్టిలోపాలు తలెత్తుతాయి. ఉద్వేగాలు తగ్గే ఆహారపదార్థాలే పిల్లలకు పెట్టాలి. వీటి గురించి ఆలోచనే లేదు కదా. జీవనాన్ని ఎలా సాగించాలి అన్నదే తెలియదు కదా!

**ప్రశ్నకర్త:** మేము ఏమీ అనగూడదంటే, ఒకవేళ మా అబ్బాయి దొంగతనం చేస్తున్నాడనుకోండి, చేయనివ్వాలా?

**దాదాశ్రీ:** పైకి విరోధించండి. కాని లోపల సమభావంతో ఉండండి. బయటకు చూపించటానికి విరోధించటం, దొంగతనం చేసినందుకు అతని మీద నిర్దయత అసలు ఉండగూడదు. లోపల ఒకవేళ సమభావం పోయినట్లయితే నిర్దయత పెరుగుతుంది, జగత్తంతా నిర్దయంగా తయారౌతుంది.

అతనికి నచ్చచెప్పండి, 'ఎవరి ఇంట్లోనైతే దొంగతనం చేసావో, దానికి ప్రతిక్రమణ చేయి, అలా ఎన్నిసార్లు ప్రతిక్రమణ చేసావన్నది నాకు చెప్పు. అప్పుడు అది తీరిపోతుంది. తర్వాత, నీవు మరోసారి దొంగతనం చేయనని ప్రతిజ్ఞ చెయ్యి. మరోసారి దొంగతనం చేయను, చేసిన దానికి క్షమాపణ కోరుకుంటున్నాను.' అలా మళ్ళీ మళ్ళీ అర్థమయేటట్టుగా చెప్పినట్లయితే జ్ఞానం ఫిట్ అవుతుంది. అలా చేస్తే మరుజన్మలో అతను దొంగతనం చెయ్యడు. ఇది కేవలం ఎఫెక్ట్ (పరిణామం). ఇక రెండవదేమీ నేర్వకపోతే కొత్తగా మరేమీ ఎదురవదు.

ఈ అబ్బాయి నా దగ్గర తన తప్పులన్నిటినీ ఒప్పుకుంటాడు. దొంగతనం చేసినా, అదీ ఒప్పుకుంటాడు. ఆలోచన అయితే అద్భుతంగా ఉండే మనిషి అయితేనే అది సాధ్యమౌతుంది. అందరూ ఇలా ఉంటే భారతదేశంలో ఆశ్చర్యపరచే పరివర్తన జరుగుతుంది.

## 8. హెల్దీ మైండ్ ఉన్న నూతన జనరేషన్

**దాదాశ్రీ:** ఆదివారం రోజన మీకు దగ్గర్లోనే సత్సంగం జరుగుతుంది కదా మీరెందుకు రారు?

**ప్రశ్నకర్త :** ఆదివారం రోజున టి.వి. చూస్తుంటాం కదా దాదాజీ!

**దాదాశ్రీ :** టి.వి. కి మీకు ఏమిటి సంబంధం? కంటికి జోడు కూడా వచ్చింది. అయినా టి.వి. చూస్తుంటారా? మన దేశంలో ఎలా అంటే, టి.వి. చూసే అవసరం లేదు, నాటకం చూసే అవసరం లేదు. అవన్నీ ఇక్కడ రోడ్ల పైన జరుగుతూవుంటాయి కదా!

**ప్రశ్నకర్త :** ఆ దారిలోకి వచ్చినప్పుడు అంతా పోతుంది కదా?

**దాదాశ్రీ :** కృష్ణ భగవానుడు గీతలో చెప్తాడు, మనుషులు తమ సమయాన్ని వ్యర్థం చేసుకుంటున్నారు. సంపాదించటం కోసం ఉద్యోగానికి పోవటం అనర్థం అనిపించుకోదు. ఆ దృష్టి వచ్చేంత వరకు ఈ దృష్టి వదిలిపోదు.

మనుషులు కూడా జంతువులలాగా వాసనవచ్చే బురదని ఒంటికి ఎప్పుడు పులుముకుంటారు? వాళ్ళకి మంట పుట్టినపుడు. ఈ టి.వి., సినిమా, ఇవన్నీ దుర్వాసన వచ్చే బురదలాంటివి. దానివలన ఏ సారమూ లభించదు. నాకు టి.వి. తో విరోధం లేదు. ప్రతిది చూసే స్వేచ్ఛ ఉంది. కానీ, ఐదు గంటల పది నిమిషాలకు టి.వి. లో కార్యక్రమం ఉంటే, మరో పక్క ఐదు గంటల పది నిమిషాలకు సత్సంగం ఉంటే, మీరు దేన్ని ఇష్టపడతారు? పదకొండు గంటలకు పరీక్ష రాయాలి, పదకొండు గంటలకు మీకు భోజన సమయం అయితే ఏం చేస్తారు? అలా అర్థం చేసుకోవాలి.

**ప్రశ్నకర్త :** చాల రాత్రి వరకు టి.వి. చూస్తుంటారు కనుక నిద్రపోరు కదా?

**దాదాశ్రీ :** కానీ మీరు టి.వి. ని మీరు కొనుక్కుని రావటం వలనే కదా చూస్తారు? ఈ పిల్లలనందరినీ పాడు చేసింది మీరే. ఈ తల్లిదండ్రులే పిల్లలను చెడగొడుతున్నారు. ఆ పైన టి.వి. తీసుకొచ్చారు ఇంటికి! అంతకు ముందు ఉన్న చికాకు సరిపోదనా మరొకటి జోడించారు?

కొత్త ప్యాంటు తొడుక్కుని మళ్ళీమళ్ళీ అద్దంలో చూసుకుంటారు. అరె, అద్దం ఏం చూస్తుంది? ఈయన ఎవరినో అనుకరిస్తున్నారని అర్థం చేసుకోండి.

ఆధ్యాత్మికంలో ఉన్నవాళ్ళనా లేక భౌతిక దృష్టితో అనుకరిస్తున్నారా? ఒకవేళ భౌతిక దృష్టితో అనుకరిస్తుంటే, ఆఫ్రికావాళ్ళని ఎందుకు అనుకరించరు? కానీ ఈయన దొరబాబులా ఉన్నారు అందుకే అనుకరించటం ఆరంభించారు. కానీ నీలో ఆ యోగ్యత లేదు. ఎందుకలా దొరలా తయారై తిరుగుతుంటావు? కానీ దొరలా అయ్యేందుకు అద్దంలో చూసుకుని, జుట్టు సరిచేసుకుని, 'ఆల్‌రైట్' గా ఉన్నాను అనుకుంటాడు. పైగా ప్యాంటు వేసుకుని తనని తానే మెచ్చుకుంటూ ఉంటాడు. అరె, అనవసరంగా ఎందుకలా నీకు నీవే మెచ్చుకుంటావు. ఇక్కడెవరూ చూడటం లేదు. అందరూ వాళ్ళవాళ్ళ పనుల్లో ఉన్నారు! అందరూ వారివారి గొడవల్లో పడిఉన్నారు!

నిన్ను చూసేంత ఖాళీ ఎవరికుంది? అందరూ వారివారి గొడవల్లో పడివున్నారు. కానీ మిమ్మల్ని మీరు ఏమనుకుంటున్నారో?

ఎవరో పాత తరంవారు పిల్లలతో గొడవపడుతుంటే, నేను, 'మీరు చిన్నగా ఉన్నపుడు మిమ్మల్ని కూడా మీ తండ్రిగారు ఏదో అనివుంటారు కదా?' అని అడిగాను. అప్పుడతను, 'ఆయన కూడా గొడవపడుతుండేవారు' అన్నాడు. ఆయన తండ్రిని అదే ప్రశ్న వేస్తూ, 'మీ చిన్నప్పుడు?' అని అడిగితే, ఆయన కూడా, 'మా తండ్రి కూడా నాతో గొడవపడుతుండేవారు' అంటారు. అంటే ఇది పూర్వం నుంచే వస్తోంది.

కొడుకు పాత విషయాలను స్వీకరించటానికి తయారుగా లేడు. అందుకే అలా గొడవ జరుగతుంటుంది. నేను నా అమ్మానాన్నలను మోడ్రన్ (ఆధునికం) గా అవమని చెప్తుంటాను కాని వాళ్ళు అలా అవరు. ఎలా ఔతారు? మోడ్రన్‌గా అవటం తేలిక కాదు.

మన దేశం యూజ్‌లెస్ (పనికిరానిది) అయిపోయింది. కొన్ని జాతులను తిరస్కార భావంతో చూస్తారు. ఒకరి పక్కన మరొకరు కూర్చోరు. భేదభావంతో ఉంటారు. ప్రసాదం ఇవ్వటం కూడా చెయ్యి పైకెత్తి ఇస్తారు. కానీ ఈ నవతరం హెల్దీ మైండ్‌వాళ్ళు. చాల బావుంది.

పిల్లల గురించి మంచి భావన చేసుకుంటూవుండండి. అన్నీ అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి. లేకపోతే ఈ పిల్లలు బాగుపడరు. పిల్లలు బాగైనాపడాలి

లేకపోతే ప్రకృతి తనంతటతానే వాళ్ళని బాగుచేస్తుంది. పిల్లలు చాల మంచివాళ్ళు. ఇంతవరకు ఏ కాలంలోనూ ఈ కాలంలో ఉన్నంత మంచి పిల్లలు లేరు.

ఇప్పటి పిల్లలలో ఇంతవరకు ఎప్పుడు లేనటువంటి ఎలాంటి గుణం ఉండటం వలన నేను అలా చెప్తున్నానంటే, పాపం వీళ్ళల్లో తిరస్కార భావం లేదు, ఏమీ లేదు. కేవలం మోహం ఉందంతే. ఆ కారణంగానే సినిమా లేక ఇతర ప్రదేశాలకు తిరుగుతుంటారు. అంతకు ముందు ఎటువంటి తిరస్కార భావం ఉండేదంటే, బ్రాహ్మణ పుత్రుడు ఇతరులను తాకేవాడు కూడా కాదు. ఇప్పుడు ఇలాంటి తల నొప్పి ఉందా?

**ప్రశ్నకర్త :** అలా ఏమీ లేదు. మానం యొక్క పరవా కూడా లేదు.

**దాదాశ్రీ :** సరుకంతా శుభ్రపడింది, లోభం కూడా లేదు, మానావమానాల పట్టింపు లేదు. ఇప్పటి వరకు ఉన్న సరుకంతా అశుభ్రమైనది- మానం, క్రోధం, లోభం! కాని పాపం వీళ్ళు కేవలం మోహం కలిగివున్నారంతే.

**ప్రశ్నకర్త :** మీరనేది వర్తమానంలోని జెనరేషన్ 'హెల్దీ మైండ్' వాళ్ళని కానీ మరోవైపు నుంచి చూస్తే అందరూ వ్యసనపరులయ్యారు. ఇంకేమేమిటన్నది తెలియదు.

**దాదాశ్రీ :** వ్యసనపరులలా కనిపిస్తుండవచ్చు కాని, వాళ్ళకి సరైన మార్గం లభించనప్పుడు వాళ్ళేం చేస్తారు? వాళ్ళ మైండ్ అయితే హెల్దీయే.

**ప్రశ్నకర్త :** హెల్దీ మైండ్ అంటే ఏమిటి?

**దాదాశ్రీ :** హెల్దీ మైండ్ అంటే, నీది నాది అనే పట్టింపు లేదు. మన చిన్నప్పుడు బయట ఏమైనా పడిపోయి కనిపిస్తే, దాన్ని తీసేసుకోవాలనుకునేవాళ్ళం. ఎక్కడికైనా భోజనానికి పోతే, ఇంట్లో తినేదానికంటే అక్కడ కాస్త ఎక్కువ తినేవాళ్ళం. చిన్నవాళ్ళ నుంచి ముసలివాళ్ళ వరకు అందరూ నాది అనే మమకారాలతో ఉండేవాళ్ళం.

అరె, ఈ డబల్ బెడ్ సిస్టమ్ భారత్‌లో ఉండేదా? ఎటువంటి పశుప్రాయులు వీళ్ళు? భారతదేశంలో ఒక రూమ్ (గది) లో స్త్రీపురుషులు కలిసివుండేవారు కాదు. ఎప్పుడూ వేరు వేరు రూములలో ఉండేవారు. ఆ స్థానంలో ఇప్పుడు చూడండి! ఈ రోజుల్లో తండ్రే బెడ్ రూమ్‌ని తయారుచేస్తాడు 'డబల్ బెడ్' కొనితెచ్చి! అది చూసిన పిల్లలు ప్రపంచ రీతి ఇలాగే ఉంటుంది కాబోలు అనుకుంటారు. మీకు తెలుసా, పూర్వం స్త్రీ పురుషుల పక్కలు వేరు వేరు రూములలో ఉండేవని? ఏమిటి మీకు తెలియదా? అదంతా నేను చూసాను. మీ కాలంలో డబల్ బెడ్‌ని చూసారా?

## 9. తల్లిదండ్రుల ఫిర్యాదులు

ఒకతను నాతో అన్నాడు, మా అన్నయ్య కొడుకు రోజూ తొమ్మిది గంటలకు లేస్తాడు అని. ఇంట్లో ఏ పనీ చేయడు. నేను ఇంట్లో అందరినీ అడిగాను, త్వరగా లేవడు కదా, ఇది మీకు నచ్చదు కదా అని. దానికి వాళ్ళు, మాకు ఇష్టం లేదు కానీ వాడు త్వరగా లేవడు అన్నారు. నేను వాళ్ళతో, 'సూర్యనారాయణుడు వచ్చిన తర్వాతైనా లేస్తాడా లేదా?' అని అడిగాను. 'ఆ తర్వాత కూడా ఒక గంట తర్వాత లేస్తాడు' అన్నారు వాళ్ళు. 'అంటే సూర్యనారాయణుని కూడా మర్యాద ఇవ్వడా? అయితే అతను చాల పెద్దవాడు అయ్యుండాలి. అయితే అందరూ సూర్యనారాయణుడు రాకముందే లేస్తారు. ఇతనేమో సూర్యనారాయణుని కూడా పట్టించుకోడు. అప్పుడు వాళ్ళు నన్ను అతన్ని కాస్త కోప్పడమని అన్నారు. అందుకు నేను, 'నేను అతన్ని కోప్పడలేను. నేను కోప్పడటానికి రాలేదు, అర్థమయ్యేటట్టు చెప్పటానికి వచ్చాను. కోప్పడి తిట్టే వ్యాపారం కాదు నాది. నాది వివరించి చెప్పే వ్యాపారం.' అన్నాను. తర్వాత ఆ అబ్బాయితో, 'దర్శనం చేసుకుని, దాదా రోజూ నేను త్వరగా లేచే శక్తినివ్వు అని తలచుకో' అన్నాను. ఇది అతనితో అనిపించిన తర్వాత కుటుంబ సభ్యులతో, టీ తాగే సమయానికి కూడా లేవకపోతే, అతన్ని, 'దుప్పటి కప్పనా, చలిగా ఉంది కదా, కప్పమంటే కప్పుతాను' అనండి అన్నాను. అలా హాస్యంగా కాకుండా నిజంగానే కప్పండి అంటే, ఆ ఇంటివాళ్ళు అలాగే చేసారు. ఫలితంగా ఆ పిల్లవాడు ఆరు నెలలలో త్వరగా లేవటం మొదలుపెట్టాడు, కుటుంబ సభ్యులు అనటానికి ఏమీ లేకుండా పోయింది.

**ప్రశ్నకర్త :** ఈ కాలం పిల్లలు చదువు మీద కాకుండా ఆటలలో ఎక్కువ ఇష్టం చూపిస్తున్నారు. వాళ్ళతో గొడవ కూడా రాకుండా, వాళ్ళని చదువువైపు మళ్ళించటానికి ఏం చేయాలి?

**దాదాశ్రీ :** ఇనామీ (బహుమతి) యోజనను ప్రకటించండి! పిల్లలతో, ఫస్ట్ వస్తే ఇంత ఇస్తాను, ఆరవ నంబర్ వస్తే ఇంత, పాసైతే ఇంత అని చెప్పండి. వాళ్ళల్లో ఉత్సాహాన్ని పెంచే ప్రయత్నం చేయండి. ఆ లాభమేదో వెంటనే కనిపించే విధంగా ఉండాలి. అప్పుడు అతను ఆ సవాలుని స్వీకరిస్తాడు. వేరే మార్గమేమిటి? అతని మీద ప్రేమ కురిపించండి. ప్రేమగా ఉంటే పిల్లలు చెప్పినవన్నీ ఒప్పుకుంటారు. నేను చెప్పింది చెయ్యటానికి అతను తయారే. అంటే, మనం అతనికి నచ్చచెప్తూ వుండాలి. ఆ తర్వాత ఏం చేస్తే అది సరి.

**ప్రశ్నకర్త :** మూల సమస్య ఏమిటంటే, చదువుకోమని పిల్లలకు మేము ఎన్నో రకాలుగా చెప్తాము కానీ, వాళ్ళకి ఎంత చెప్పినా అర్థం చేసుకోరు. మా మాట వినరు.

**దాదాశ్రీ :** వాళ్ళు వినరు అని కాదు కాని, మీకు తల్లిగా వ్యవహరించటం రాలేదు. మీరు తల్లిగా వ్యవహరిస్తే వాళ్ళు ఎందుకు వినరు? కొడుకు ఎందుకు వినడు? ఎందుకంటే, తన తల్లిదండ్రుల మాట తనెప్పుడూ వినలేదు కదా అందుకే.

**ప్రశ్నకర్త :** దాదా అతనిలో వాతావరణ దోషం ఉందన్నట్లా లేదన్నట్లా?

**దాదాశ్రీ :** వాతావరణ దోషమేమీ లేదు. తల్లిదండ్రులకు నిజానికి తల్లిదండ్రులలా వ్యవహరించటం రాలేదు. ప్రధాన మంత్రి అయితే ఉండే బాధ్యతలు తక్కువే కానీ తల్లిదండ్రులలా ఉండటం చాల పెద్ద బాధ్యత.

**ప్రశ్నకర్త :** అదెలా?

**దాదాశ్రీ :** ప్రధాన మంత్రి అవటంలో చేసేది ప్రజల ఆపరేషన్. ఇక్కడ చేసేది చిన్నపిల్లల ఆపరేషన్. ఇంటికి రాగానే పిల్లలు చూసి సంతోషపడేటట్లుగా ఉండాలి. కానీ ఈ కాలం పిల్లలు ఏమంటారు? 'మా నాన్న ఇంటికి రాకపోతేనే బావుంటుంది' అంటారు. అరె, అలా అయినట్లయితే ఏమౌతుంది మరి?

అందుకే నేను ఏం చెప్తానంటే, 'భాయ్, పిల్లలు పదహారు సంవత్సరాల ప్రాయానికి వచ్చిన తర్వాత వాళ్ళని 'ఫ్రెండ్' (స్నేహితుడు) గా చూడండి' అని. అలా చెప్పలేదూ? 'ఫ్రెండ్లీ టోన్' (స్నేహపూర్వకంగా) ఉంటే, మీరు మాట్లాడే మాటలు మృదువుగా ఉంటాయి. లేకుంటే ప్రతిరోజు తండ్రిలా పెత్తనం చేస్తుంటే దాని ఫలితం ఏమీ ఉండదు. కొడుకు నలభై సంవత్సరాలకు వచ్చినా మనం తండ్రి పెత్తనం చూపిస్తుంటే ఏమౌతుంది?

**ప్రశ్నకర్త :** కానీ దాదా, ముసలివాళ్ళు కూడా మాతో అలా వ్యవహరిస్తుంటే వాళ్ళ ఆలోచనలు చాల పాతవైయున్నప్పుడు, మేము వాళ్ళని ఎలా హ్యాండిల్ చేయాలి?

**దాదాశ్రీ :** ఈ బండివుందే, అత్యవసరమైన సమయంలో అవసరంగా వెళ్ళవలసిన సమయంలోనే పంక్చర్ అయిందనుకోండి, ఆ వీల్ (చక్రం) ని పడేసి బాదుతారా?

**ప్రశ్నకర్త :** లేదు.

**దాదాశ్రీ :** అలా అత్యవసర సమయంలో, వెళ్ళే తొందరలో ఉన్నప్పుడు పంక్చర్ అయినట్లయితే ఆ వీల్‌ని కొట్టుకుంటూ కూర్చోవాలా లేక గబగబా దారి చూసుకుని పని నెరవేర్చుకోవాలా? బండి ఉన్నప్పుడు పంక్చర్లు అవుతూనేవుంటాయి. అలా ముసలివాళ్ళకి పంక్చర్లు అవుతునేవుంటాయి. మనం సర్దుకుపోవాలి. పంక్చర్ అయితే బండిని కొట్టుకుంటూవుంటారా ఏమిటి?

**ప్రశ్నకర్త :** ఇద్దరు కొడుకులు పరస్పరం దెబ్బలాడుకుంటూవుంటే, ఆ ఇద్దరిలో ఎవరూ మాట వినరని తెలిసినప్పుడు ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** ఇద్దరినీ ఒకసారి కూర్చోబెట్టి, మీలోమీరు కొట్టుకోవటం వలన లాభమేమీ ఉండదని, దాని వలన ఇంట్లోంచి లక్ష్మి వెళ్ళిపోతుందని చెప్పాలి.

**ప్రశ్నకర్త :** అయినా వాళ్ళు ఒప్పుకోవటానికి తయారుగా లేకపోతే ఏం చెయ్యాలి దాదాజీ?

**దాదాశ్రీ :** ఎలా ఉంటే అలా ఉండనీయండి.

**ప్రశ్నకర్త :** కొడుకులు పరస్పరం దెబ్బలాడుకుంటూ, పరిస్థితి బాగా విషమిస్తుంటే, ఇదంతా ఎలా జరిగింది అనుకుంటాం మనం.

**దాదాశ్రీ :** వాళ్ళకే తెలిసిరానీయండి. పరస్పరం దెబ్బలాడుకుంటూపోతే, వాళ్ళకే తెలిసివస్తుంది, తెలిసివస్తుంది కదా? ఊరికూరికే వాళ్ళని ఆపుతుంటే వాళ్ళకి తెలివిరాదు. జగత్తంతా నిరీక్షించి చూడవలసినటువంటిదే.

ఈ పిల్లలు ఎవరికీ చెందినవారు కారు. వీళ్ళు నెత్తిమీద పడ్డ జంఝాటాలు. కాబట్టి వాళ్ళకి సహాయం తప్పక చేయండి కానీ, లోపలి నుంచి డ్రామేటిక్‌గా ఉండండి.

ముందుగా ఫిర్యాదు చేస్తూ ఎవరు వస్తారు? కలియుగంలో, ఎవరిదైతే తప్పు ఉంటుందో వాళ్ళే ముందుగా ఫిర్యాదు చెయ్యటానికి వస్తారు. సత్యయుగంలో, నిర్దోషులు ముందుగా ఫిర్యాదు చేసేవారు. ఈ కలియుగంలో న్యాయం చేసేవాళ్ళు కూడా ఎలాంటివాళ్ళంటే, ఎవరివైపు ముందుగా వింటారో వాళ్ళ పక్షాన నిలబడతారు.

కుటుంబంలో నలుగురు పిల్లలుంటే, అందులో ఇద్దరి తప్పేమీ లేకపోయినప్పటికీ తండ్రి వాళ్ళ మీద అరుస్తాడు. మిగతా ఇద్దరూ తప్పులు చేస్తున్నా, వాళ్ళని ఎవరూ ఏమీ అనరు. దాని వెనక ఉండే రూట్‌కాజ్ (మూలకారణం) ఏదైతే ఉందో, అదే అందుకు కారణం. ఇంట్లో సంతానం ఇద్దరుంటే, ఇద్దరూ సమానంగా అనిపించాలి. ఒకవేళ మనం ఏ ఒక్కరి పక్షంలో 'పెద్దవాడు దయాహృదయం కలవాడు, చిన్నవాడు అలా కాదు' అని అనుకుంటే, వ్యవహారమంతా చెడిపోతుంది. ఇద్దరినీ సమానంగా చూడాలి.

**ప్రశ్నకర్త :** నా కొడుకు ప్రతి మాటకీ కోపం తెచ్చుకుంటాడు.

**దాదాశ్రీ :** అంతా చాల ప్రియమైపోయింది కదా! చాల ప్రియమైపోయింది, అప్పుడేమౌతుంది? కూతురు చౌకది పాపం కోపం తెచ్చుకోదు.

**ప్రశ్నకర్త :** అలా కోపం తెచ్చుకోవటం ఎందుకు జరుగుతుంది దాదాజీ?

**దాదాశ్రీ :** మీరు బుజ్జగించచూస్తారు కదా, అందుకే కోపం తెచ్చుకుంటారు. నా దగ్గర అలక చూపించమను! నా దగ్గర ఎవరూ అలక చూపించరు. మళ్ళీ పిలవనుకూడా పిలవను కదా. తింటే తిన్నాడు లేకపోతే లేదు కానీ మళ్ళీ పిలవను. నాకు తెలుసు దానివలన అలవాటు చెడిపోతుందని. దురలవాటు అవుతుంది. లేదు, నాయనా అన్నం తిను, నాయనా అన్నం తిను! అరె, ఆకలయితే కొడుకు వాడంతవాడే వచ్చి తింటాడు, ఎక్కడికి పోతాడు? అయితే నాకు మరో కళ కూడా వస్తుంది. చాల మొండివాడైతే ఆకలయినా కూడా తినడు. అలాంటప్పుడు నేను అతని ఆత్మతో లోపలే విధి చేస్తాను. మీరు అలా చెయ్యవద్దు. మీరు ఎలా చేస్తున్నారో అలాగే చెయ్యండి. ఇకపోతే నా దగ్గర అలక చూపించరు. ఇక్కడ అలిగి లాభం కూడా ఏముంటుంది గనక?

**ప్రశ్నకర్త :** దాదాజీ, ఆ కళ నేర్పించరాదండి! ఎందుకంటే ఈ అలకలు, బుజ్జగింపులు రోజువారీ కార్యక్రమం అయిపోయింది. మీరు ఒకటో అరో తాళంచెవులు అందిస్తే అంతా సమసిపోతుంది.

**దాదాశ్రీ :** మనకి ఎంతో అవసరం పడితేనే వాళ్ళు అలా అలుగుతారు. అంతటి అవసరం ఎందుకు మరి?

**ప్రశ్నకర్త :** దాని అర్థమేమిటో నాకు తెలియలేదు. ఎక్కువ అవసరం ఉంటే అలుగుతారా? ఎవరికి ఆ అవసరం ఉండేది?

**దాదాశ్రీ :** ఎదుటివారి అవసరం. అలిగేవారు ఎప్పుడు అలుగుతారంటే, ఎదుటివారికి ఆ అవసరం ఉన్నప్పుడు.

**ప్రశ్నకర్త :** అంటే మనం ఆ అవసరాన్ని చూపించగూడదా?

**దాదాశ్రీ :** అవసరం అనేదే ఉండగూడదు. ఎందుకు పడుతుంది ఆ అవసరం? కర్మానుసారం జరిగేదేదో జరుగుతుంది. ఇక దాన్ని అవసరంగా ఎందుకు తీసుకోవాలి? మరిపోతే అది కర్మోదయమే. మన అవసరం చూపిస్తే మొండికెత్తుతారు.

**ప్రశ్నకర్త :** చిన్న పిల్లల కోపాన్ని పోగొట్టటానికి వాళ్ళని ఎలా సముదాయించాలి?

**దాదాశ్రీ :** వాళ్ళ కోపాన్ని పోగొట్టి ఏం ప్రయోజనం?

**ప్రశ్నకర్త :** మనతో దెబ్బలాడకుండా ఉండేందుకు.

**దాదాశ్రీ :** అందుకు ఒక ఉపాయాన్ని వెతుక్కునే బదులు తల్లిదండ్రులు ఎలా ఉండాలంటే, వాళ్ళ కోపాన్ని పిల్లల మీద చూపించకుండావుండాలి. వాళ్ళు కోపం ప్రదర్శించటాన్ని చూసి, 'నాన్న కోప్పడుతాడు, ఇక నేను దానికి నాలుగోవంతు ఎక్కువ కోపం చూపిస్తాను' అనుకుంటాడు. మీరు నిలిపివేస్తే వాళ్ళది కూడా దానంతటదే ఆగిపోతుంది. నేను ఆపివేసాను. నా కోపం ఆగిపోయింది. కనుక నాతో ఎవరూ కోపానికి రారు. కోప్పడమని చెప్పినా రారు. చిన్నపిల్లలు కూడా కోపం చూపించరు. నేను కొట్టినా సరే వాళ్ళకి కోపం రాదు.

**ప్రశ్నకర్త :** పిల్లలను సరైన మార్గంలో పెట్టేందుకు తల్లిదండ్రులు తమ బాధ్యతను నెరవార్చవలసివుంటుంది. అందుకే కోప్పడవలసివస్తుంది కదా?

**దాదాశ్రీ :** కోపమెందుకు చూపించవలసివస్తుంది? మామూలుగా మాట్లాడి అర్థమయ్యేటట్టుగా చెప్తే ఏం పోతుంది? కోపాన్ని మీరు ప్రదర్శించరు, మీ వలన అలా జరిగిపోతుంది. మీరుగా కోప్పడితే అది కోపం అవదు. మీరే స్వయంగా కోప్పడితే, అతన్ని మందలించటం అవతుంది అది కోప్పడటం అవదు. కానీ మీరు కోపం తెచ్చేసుకుంటారు.

**ప్రశ్నకర్త :** అలా కోపం కలగటానికి కారణం ఏమిటి?

**దాదాశ్రీ :** 'వీక్‌నెస్'! అది 'వీక్‌నెస్' (బలహీనత)! అంటే, అతను స్వయంగా కోప్పడటం జరగదు. అలా కోపం వచ్చిన తర్వాత అతనికి తెలిసివస్తుంది తప్పు జరిగిందని, అలా జరిగిండకుండా ఉండాల్సిందని. అంటే, అంకుశం అతని చేతిలో లేదు. ఈ మెషీన్ వేడెక్కిందంటే, ఆ సమయంలో మీరు కాస్త చల్లగా ఉండాలి. దానంతటదే చల్లబడిన తర్వాత చెయిపెట్టాలి.

పిల్లలను మీరు విసుక్కున్నారంటే అది ఒక కొత్త అప్పు చేసినట్లే. విసుక్కోవటంలో తప్పు లేదు కాని, మీరు స్వయంగా విసుగుని చూపిస్తారే అదే నష్టం కలిగిస్తుంది.

**ప్రశ్నకర్త :** శాంతమయ్యేంత వరకు పిల్లలను కోప్పడవద్దు అంటారా, కాని కోప్పడటమైతే జరుగుతుంది కదా!

**దాదాశ్రీ :** లేదు, కోప్పడటంలో తప్పు లేదు. కానీ 'స్వయంగా' కోప్పడుతారు కనుకనే మీ ముఖం అలా ఎఱ్ఱబారుతుంది. అందుకే అది మీ బాధ్యత. మీ ముఖంలో కోపం లేకుండా, ముఖాన్ని ప్రశాంతంగా పెట్టుకుని కోప్పడండి, బాగా కోప్పడండి. మీ ముఖం కోపంతో ఎఱ్ఱబారిందంటే దాని అర్థం మీరు కోపాన్ని అహంకారిగా ప్రదర్శిస్తున్నారని.

**ప్రశ్నకర్త :** అలా చేస్తే పిల్లలకు సరదాగా అలా కోపం చూపిస్తున్నారని అనిపిస్తుంది.

**దాదాశ్రీ :** వాళ్ళకి అంత అర్థమైందంటే చాలు ఎక్కువే అది. మరి దాని ప్రభావమైతే ఉంటుంది. మీరు ఎక్కువగా కోపాన్ని ప్రదర్శిస్తుంటే వాళ్ళు, 'ఈయన ఎంత బలహీనుడు' అనుకుంటారు. వాళ్ళు నాకు చెప్తుంటారు, 'మా నాన్నగారు చాల బలహీనమైనవాడు. బాగా కోప్పడుతుంటారు' అని.

**ప్రశ్నకర్త :** మనం చెప్పేదానివలన మనలోనే ఆలోచనలు వచ్చి మన మీదనే దాని ప్రభావం పడుతుండాలా?

**దాదాశ్రీ :** అది తప్పు. కోప్పడటమంటే అలా ఉండగూడదు. పైకి కోపాన్ని ప్రదర్శించాలి నాటకంలో దెబ్బలాడుతున్నట్లుగా. నాటకంలో దెబ్బలాడుతుంటారు కదా, 'నువ్వెందుకు అలా చేసావు, ఫలానా ఫలానా' అంటూ. అనాల్సినవి అన్నీ అనేస్తారు కానీ లోపల ఏమీ ఉండదు. అలా కోప్పడాలి.

**ప్రశ్నకర్త :** పిల్లలకు ఏమైనా చెప్పవలసిన అవసరం ఉందనిపిస్తే వాళ్ళ కోప్పడుతాం. అలాంటప్పుడు వాళ్ళకి బాధ కూడా కలుగుతుండవచ్చు. అప్పుడేం చెయ్యాలి?

**దాదాశ్రీ :** అలాంటప్పుడు లోలోపల క్షమాపణ కోరుకోవాలి. ఈమెని బాగా అన్నారు, ఈమెకి బాధ కలిగింది అనుకోండి, అప్పుడు మీరు ఈమెను క్షమించమని కోరుకోవాలి. అలా చెప్పలేకపోతే అది అతిక్రమణ అవుతుంది కనుక లోపల ప్రతిక్రమణ చేయాలి. మీరు 'శుద్ధాత్మ' కనుక, 'ప్రతిక్రమణ చెయ్యి' అని చందూభాయ్‌కి చెప్పాలి. మీరు రెండు విభాగాలను విడివిడిగా ఉంచాలి. ఒంటరిగా ఉన్నప్పుడు మీకు మీరే చెప్పుకోండి, 'ఎదుటివారికి బాధ కలుగని విధంగా మాట్లాడు' అని. అయినా కొడుకుకి బాధ కలిగితే చందూభాయ్‌తో, 'ప్రతిక్రమణ చెయ్యి' అని చెప్పండి.

**ప్రశ్నకర్త :** కానీ మనకంటే చిన్నవాడిని, కొడుకుని, క్షమాపణ ఎలా కోరాలి?

**దాదాశ్రీ :** లోలోపల క్షమాపణ కోరండి. హృదయంలోంచి క్షమాపణ కోరండి. అతని లోపల దాదాజీ కనిపించినట్లయితే, ఆయన సాక్షిగా ఆలోచన, ప్రతిక్రమణ, ప్రత్యాఖ్యానాలను ఆ అబ్బాయి కోసం చెయ్యండి. అవి వెంటనే అతనికి చేరుకుంటాయి.

**ప్రశ్నకర్త :** మనం ఎవరినైనా కోప్పడినా కాని, అతని మంచి కోసమే ఒక చిన్న పిల్లవాడిని కోప్పడినట్లుగా కోప్పడినట్లయితే, దానికి కూడా పాపం అంటుకుంటుందా?

**దాదాశ్రీ :** లేదు అందుకు పుణ్యమే వస్తుంది. పిల్లవాడినైనా తిట్టినా కొట్టినా కూడా పుణ్యమే వస్తుంది. భగవాన్ ఇంట అన్యాయం ఉండనే ఉండదు. కొడుకు తప్పు చేస్తున్నాడు, అందుకే పిల్లవాని బాగుకోసమే మీకు ఆకులత కలిగింది, అతనికి రెండు తగిలించారు అనుకుందాం. అయినా అందుకు పుణ్యమే కలుగుతుంది. దాన్ని పాపమని అనుకుంటే, క్రమిక మార్గంలోని ఈ సాధు-ఆచార్యులెవరికీ మోక్షమే

కలుగకూడదు. రోజంతా శిష్యుల గురించి ఆకులత చెందుతుంటారు. అయినా అందుకు పుణ్యమే వస్తుంది. ఎందుకంటే, మరో వ్యక్తి బాగు కోసం అతను క్రోధిస్తున్నాడు. తన బాగు కోసం క్రోధం చూపిస్తే అది పాపం అవుతుంది. ఎంత చక్కని న్యాయం! ఎంతటి న్యాయపూర్ణమైంది! భగవాన్ మహావీర్ న్యాయం ఎంత చక్కనిది! ఈ న్యాయం ధర్మకాంటాయే కదా!!

కనుక, పిల్లలను వాళ్ళ మంచి కోసమే కోప్పడండి, కొట్టండి పుణ్యమే వస్తుంది. కాని, 'నేను తండ్రిని కాబట్టి వాడిని కాస్త కొట్టాలి కదా!' అనే భావన లోపల పెట్టుకున్నట్లయితే పాపం తగులుతుంది. అలా సరిగ్గా అర్థం చేసుకోకపోతేనే అందులో అలాంటి విభజన ఉంటుంది.

కనుక తండ్రి తన కొడుకు బాగు కోసం అకులిత పడటం వలన ఏం ఫలం లభిస్తుంది? పుణ్యం వస్తుంది.

**ప్రశ్నకర్త :** కొడుకు కోసం తండ్రి అకులిత పడతాడు సరే, మరి కొడుకు కూడా అకులిత మనస్కుడైతే ఏం జరుగుతుంది?

**దాదాశ్రీ :** కొడుకుకి పాపం తగులుతుంది. క్రమిక మార్గంలో 'జ్ఞాని పురుష్' తన శిష్యుడి గురించి వ్యథచెందితే అందుకు చాల పుణ్యమే లభిస్తుంది. పుణ్యానుబంధమైన పుణ్యం లభిస్తుంది. అతని ఆకులత వ్యర్థమవదు. వాళ్ళు శిష్యులు కారు అతని పిల్లలే అన్నట్లు. వాళ్ళ నుంచి తిరిగి ఆశించేదేమి ఉండదు. అయినా శిష్యుల గురించి వ్యథచెందుతారు.

ఇక్కడ నా దగ్గర కొట్టటం తిట్టటం లాంటివేమీ ఉండవు. కోప్పడినప్పుడు మనుషులు స్పష్టంగా మాట్లాడరు, కపటం ఉంటుంది. అందుకే ఈ ప్రపంచంలో అంతా అలా కపటులు జన్మించారు. ఈ ప్రపంచంలో ఎవరినీ కోప్పడవలసిన అవసరమే లేదు. కొడుకు సినిమా చూసి వచ్చినపుడు మనం అతని కోప్పడినట్లయితే, అతను రెండవరోజు వంకపెట్టుకుని, 'స్కూల్ లో ఏదో కార్యక్రమం ఉంది' అని చెప్పి సినిమా చూడటానికి పోతాడు! ఏ ఇంట్లో అయినా తల్లి కఠినంగా ఉంటే, ఆమె కొడుకుకి వ్యవహారం రాదు.

**ప్రశ్నకర్త :** కోల్డ్ డ్రింక్స్ బాగా తాగటం, చాక్లెట్లు ఎక్కువగా తింటున్నట్లయితే నేను కోప్పడుతాను.

**దాదాశ్రీ :** అందులో కోప్పడవలసిన పనేముంది? ఎక్కువ తింటే జరిగే నష్టమేమిటో అతనికి అర్థమయేటట్లుగా చెప్పాలి. మిమ్మల్ని ఎవరు కోప్పడుతున్నారు మరి? ఇదంతా కేవలం పెద్దవాళ్ళనే అహంకారమే. 'అమ్మ' అయి కూర్చున్నారు పెద్ద! తల్లిగా వ్యవహరించటం రాదుగాని రోజంతా పిల్లలను కోప్పడుతుంటారు. మిమ్మల్ని మీ అత్తగారు కోప్పడుతూవుంటే అప్పుడు తెలిసివస్తుంది. పిల్లలను కోప్పడటం ఒక గొప్పా? పిల్లలకు ఏమనిపిస్తుందంటే, 'ఈమె నానమ్మ కంటే కూడా చెడ్డది' అని అందువలన పిల్లను కోప్పడటం మానెయ్యండి. నెమ్మదిగా నచ్చచెప్పండి, ఇవన్నీ తినగూడదు, వాటి వలన మీ శరీరానికి నష్టం కలుగుతుంది అని.

అతను తప్పులు చేస్తున్నప్పటికీ మళ్ళీ మళ్ళీ కొట్టటం వద్దు. తప్పు చేస్తే మళ్ళీ మళ్ళీ కొడుతుంటే ఏమౌతుంది? ఒక మనిషి బట్టలు ఉతుకుతున్నట్లుగా అబ్బాయిని కొడుతున్నాడు. అరె, తండ్రి అయ్యుండి పిల్లవాడికి ఎలాంటి దశని కలుగజేస్తున్నారు? ఆ సమయంలో కొడుకు మనసులో ఏమని నిశ్చయించుకుంటాడో తెలుసా? అదంతా సహించలేక, 'పెద్దయిన తర్వాత నేను మిమ్మల్ని కొడతాను చూడండి' అని మనసులో అనుకుంటాడు. లోపల గట్టి నిర్ణయం తీసుకుంటాడు. పెద్దయిన తర్వాత అతన్ని కొడతాడు కూడా.

కొడితే జగత్తు బాగుపడదు. కోప్పడినా, కోపం తెచ్చుకున్నా సరే ఎవరూ బాగుపడరు. సరిగ్గా చేసి చూపిస్తే బాగుపడతారు. ఎంత అంటే అంత పిచ్చితనమే అవుతుంది.

ఒక భాయ్ ఉన్నాడు. రాత్రి రెండు గంటల వరకు ఏమేం చేసి ఇంటికి వస్తాడో! ఆ విషయం వర్ణనాయోగ్యం కాదు. మీరే అర్థం చేసుకోవచ్చు. ఇక ఇంట్లో వాళ్ళంతా అతన్ని బాగా తిట్టాలా లేకపోతే ఇంటికి రానివ్వద్దా, ఏమిటి ఉపాయం అని ఆలోచించారు. తర్వాత వాళ్ళందరికీ దాని అనుభవం ఎదురైంది. అతని పెద్దన్న చెప్పటానికి పోతే, 'మిమ్మల్ని కొట్టకుండా వదలను' అన్నాడు. తర్వాత కుటుంబ

సభ్యులంతా నన్ను అడగటానికి వచ్చారు, 'ఏం చెయ్యమంటారు. అతను ఇలా మాట్లాడుతున్నాడు' అని. అప్పుడు నేను వాళ్ళకి, 'ఎవరూ అతన్ని పల్లెత్తు మాట అనకండి. మీరేమైనా అంటే అతను ఉద్దండుడైపోతాడు. ఇంట్లోకి రానివ్వకపోతే ప్రతిఘటన చేస్తాడు. అతను ఇంటికి ఎప్పుడు వస్తాడో ఎప్పుడు పోతాడో అతనిష్టం. మనం అతన్ని రైట్ (ఒప్పు) అనవద్దు, రాంగ్ (తప్పు) అనవద్దు. రాగం చూపించవద్దు, ద్వేషం చూపించవద్దు. మమత, కరుణ చూపించండి' అని చెప్పాను. మూడు నాలుగు సంవత్సరాలకు ఆ భాయ్ సరైన దారికి వచ్చాడు! ఇప్పుడతను వాళ్ళ వ్యాపారంలో సాయపడుతున్నాడు. ప్రపంచంలో అంతా పనికిరానివారు కారు. కాకపోతే వాళ్ళతో పనిచేయించుకోవటం రావాలి. అందరిలోనూ భగవానుడున్నాడు. అందరూ విభిన్నమైన పనులను చేస్తుంటారు. కనుక ఎవరి మీదా అయిష్టత పెట్టుకోవద్దు.

ఒకతను మరుగుదొడ్డి తలుపు మీద కాలితో కొడుతున్నాడు. అతన్ని, 'ఎందుకలా కాలితో కొడుతున్నావు?' అని అడిగాను. దానికి అతను, 'ఎంతో శుభ్రం చేస్తాను కాని ఇంకా దుర్వాసనే వస్తూనేవుంది' అంటాడు. చెప్పండి ఇక! అతనిది ఎంత మూర్ఖత్వం అనుకోవాలి? మరుగుదొడ్డి తలుపుని కాలితో తన్నినప్పటికీ దుర్వాసన వస్తుంది. అందులో తప్పెవరిది?

ఎంతమంది పిల్లలను కొడుతుంటారు, వాళ్ళేమైనా తన్నటానికి ఉన్నవాళ్ళా? వీళ్ళు 'గ్లాస్‌వేర్' (గాజు వస్తువు) లాంటివాళ్ళు. 'గ్లాస్‌వేర్' ని జాగ్రత్తగా పెట్టాలి. 'గ్లాస్ వేర్' ని ఇలా విసిరేస్తే? 'హ్యాండిల్ విత్ కేర్' అంటే జాగ్రత్తగా పెట్టండి అని. ఇక అలా కొడుతూవుండకండి.

సరే, ఈ జన్మలో సంతానం గురించి చింతపడుతున్నారు. మరి పూర్వజన్మలోని సంతానం మాటేమిటి? ప్రతి జన్మలోను సంతానాన్ని వదిలేసే వస్తున్నావు. ఎక్కడెక్కడ జన్మ తీసుకుంటూ వస్తున్నావో అక్కడంతా సంతానాన్ని వదిలేసే వస్తున్నావు. ఇంతింత చిన్నచిన్న పిల్లలు దారితప్పి వుంటే, వాళ్ళని వదిలేసి వచ్చేసావు. అలా వచ్చివుండవలసింది కాదు. అయినా ఇక్కడకు వచ్చేసావు. తర్వాత మర్చిపోయావు, ఇక్కడ వేరే పిల్లలు కలిగారు! మరి పిల్లల గురించి ఎందుకు బాధపడతావు? వాళ్ళని ధర్మ మార్గంలోకి నడిపించు. వాళ్ళే బాగుపడతారు.

ఒక పిల్లవాడు ఎంత మొండివాడంటే, చేదు మందు ఇస్తే తాగడు. గొంతు లోనుంచి కిందికి జారనివ్వడు. కాని అతని తల్లి కూడా మొండిదే. పిల్లవాడు అంత మొండిగా ఉంటే తల్లి మొండిగా ఉండదా? తల్లి ఏం చేసిందో తెలుసా, వాడి ముక్కు మూసింది. మందు వెంటనే గొంతులోకి దిగింది. ఫలితంగా పిల్లవాడిలో మొండితనం ఇంకా పెరిగింది. రెండవరోజు ఆమె తాగిస్తున్నపుడు ముక్కు పట్టుకోబోతే, వాడు ఉఫ్ ఉఫ్ అని ఆమె కళ్ళల్లోకి పడేటట్లుగా ఉమ్మేసాడు! ఇది అదే క్వాలిటీ! అమ్మ కడుపులో తొమ్మిది నెలలు అద్దె లేకుండా ఉన్నాడు. ఇదీ వాడి వలన ప్రయోజనం, పైగా ఉఫ్ అని ఉమ్మేస్తాడు.

ఒక తండ్రి నాతో, 'నా మూడవ కొడుకు చాల చెడ్డవాడిగా తయారయ్యాడు, ఇద్దరు పిల్లలు మంచివాళ్ళు' అని చెప్పాడు. అందుకు నేను, 'అయ్యో చాల చెడు జరిగింది. మరి ఏం చేస్తున్నారు దానికి?' అని అంటే, 'ఏం చెయ్యను? ఇద్దరు కొడుకులకైతే ఏమీ చెప్పవలసిన అవసరం లేదు. కానీ మూడవవాడి వలన నా జీవితమే నాశనమౌతోంది' అన్నాడు. 'ఏం చేస్తాడు మీ అబ్బాయి?' అని అడిగితే, 'రాత్రి ఒంటిగంటన్నరకి వస్తాడు. తాగి వస్తాడు వాడు' అన్నాడు. 'మరి మీరేం చేస్తున్నారు?' అంటే, 'నేను దూరంగా ఉండి చూస్తాను వాడిని. నా ముఖం చూస్తే నన్ను తిట్టేస్తాడు. నేను దూరంగా కిటికీ లోంచి చూస్తుంటాను వాడు ఏమంటున్నాడా అని' అన్నాడు. అప్పుడు నేను అతన్ని, 'ఒంటిగంటన్నరకి ఇంటికి వచ్చిన తర్వాత ఏం చేస్తాడు?' అని అడిగితే, 'తినటం తాగటం అనేదైతే ఏమీ ఉండదు. వాడు వచ్చేసారికి వాడి పక్క వేసి వుంచాల్సివుంటుంది. రాగానే వెంటనే నిద్రపోయి, గుర్రు కొడుతుంటాడు' అన్నాడు. దానికి నేను, 'అయితే చింతపడుతున్నవారు ఎవరు?' అంటే 'అది కూడా నేనే' అన్నాడు.

తర్వాత అతను, 'వాడి పరిస్థితి చూసి నాకు రాత్రంతా నిద్రపట్టదు' అనగా నేను, 'ఇందులో తప్పంతా మీదే. అతను హాయిగా నిద్రపోతున్నాడు. మీ తప్పుకి మీరు అనుభవిస్తున్నారు. పూర్వ జన్మలో అలా తాగే అలవాటు చేసినవారు మీరే. అతనికి అది నేర్పి జారుకున్నారు. అతనికెందుకు ఆ అలవాటు చేసారు? మీ స్వార్థం కోసం. అంటే పూర్వజన్మలో అతన్ని చెడగొట్టారు, తప్పు మార్గంలోకి తీసుకెళ్ళారు.

అలా అతనికి అలవాటు చేసినదాని ఫలితం ఇప్పుడు మీకు వస్తోంది. ఇప్పుడు మీరు మీ ఫలితాన్ని అనుభవించండి! 'ఎవరైతే అనుభవిస్తారో, తప్పు వాళ్ళదే'. చూడండి, అతనైతే హాయిగా నిద్రపోతాడు కదా? ఇక తండ్రిగా రాత్రంతా చింతిస్తూ ఒంటిగంటన్నర వరకు మెలకువతో ఉంటాడు, ఎప్పుడొస్తాడా అని ఎదురుచూస్తూ. కానీ అతన్ని ఏమీ అనలేదు. తండ్రి అనుభవిస్తున్నాడు కనుక తప్పు తండ్రిదే.

మామగారు వేరే గదిలో ఉన్నారనుకుని కోడలు, 'మా మామ కాస్త బుద్ధి తక్కువవాడు' అని ఎవరితోనో అంటూవుంటుంది. ఆ సమయంలో నేను అక్కడ ఉండబట్టి నాకు వినిపిస్తుంది, దానితో నాకు లోపల దాని ప్రభావం పడుతుంది. అక్కడ ఏమనుకోవాలి? నేను వేరే చోట ఉండివుంటే ఏమయ్యేది అనుకోవాలి. అప్పుడైతే దాని ప్రభావం పడదు కదా. అంటే ఇక్కడకు వచ్చి చేసిన తప్పుకి ఫలితమిది! నేను ఈ తప్పుని సరిచేయాలి అనుకుని, నేను వేరే చోట కూర్చున్నాను, నేను అదంతా వినవే లేదు అనుకోవాలి. అలా ఆ తప్పుని సరిచేసుకోవాలి.

మహావీర్ భగవాన్ వెనక కూడా ఎందరో తప్పుగా మాట్లాడుతుండేవారు. మనుషులు అంటారలా. మనం మన తప్పులను అవగొట్టుకుంటుండాలి. వాళ్ళకి ఏది సరి అనిపిస్తే అది అన్నారు. మన కర్మలే అతను అలా అనేటట్లుగా చేస్తాయి.

పిల్లలలో అహంకారం ప్రారంభమైతే వాళ్ళని మనం ఏమీ అనలేం. మనమేం అనగలంగనక? వాళ్ళకి ఎదురుదెబ్బ తగిలితే వాళ్ళే తెలుసుకుంటారు. పిల్లలు ఐదు సంవత్సరాల వయసులోకి వచ్చేంత వరకు వాళ్ళని ఏమైనా అనటానికి మనకి స్వేచ్ఛ ఉంటుంది. ఐదు నుంచి పదహారు సంవత్సరాల వరకు ఎప్పుడైనా చెంపదెబ్బ వేయవలసిరావొచ్చు. కానీ ఇరవై సంవత్సరాలకు వచ్చిన యువకుడిని అలా చేయలేరు. అతన్ని ఒక్క మాట కూడా అనలేరు. అతన్ని ఏమైనా అంటే అది తప్పే అవుతుంది. లేకపోతే ఏదో ఒక రోజు మిమ్మల్ని తుపాకీతో కాలుస్తాడేమో కూడా.

'ఎదుటివారు అడక్కుండా సలహా కూడా ఇవ్వొద్దు' అని నేను రాసాను కూడా. ఎవరైనా మిమ్మల్ని ఏమైనా అడిగితే, అప్పుడే మీరు వాళ్ళకి సలహా ఇవ్వాలి, ఆ సమయంలో ఏది సరైనదో అది చెప్పాలి. సలహా ఇచ్చిన తర్వాత, 'నేనైతే చెప్పాను,

నీకు ఏది సరి అనిపిస్తే అది చెయ్యి' అని కూడా అనాలి. దానివలన అతనికి మీ మాట తప్పు అనిపించదు. కనుక, మనం చెప్పేదేమైనా, దాని వెనుక వినయం ఉండాలి.

ఈ కాలంలో తక్కువ మాట్లాడటం కంటే మంచి అనేదేమీ లేదు. ఈ కాలం మాటలు రాళ్ళు తగిలినట్లే అవుతాయి. అలా బయటకు వస్తాయి, అందరికీ అలాగే అనిపిస్తుంటుంది. అందుకనే, మితభాషిగా ఉండటం మంచిది. ఎవరికీ చెప్పగలిగేది ఏమీ లేదు. చెప్తే ఇంకా చెడిపోతుంది. 'బండి వేసుకుని త్వరగా రా' అని అంటే ఆలస్యంగా వస్తాడు, ఏమీ చెప్పకపోతే సమయంలో చేరుకుంటాడు. మనం లేకపోయినా అంతా సవ్యంగా జరుగుతుంటుంది. అలాంటిది. ఇది కేవలం మన దరుహంకారం. ఏ రోజైతే మీ పిల్లలతో మీ జగడం ఆగిపోతుందో, ఆ రోజు నుంచే పిల్లలు బాగుపడటం ఆరంభమౌతుంది. మీ మాటలు సరిగ్గా ఉండవు కనుకనే ఎదుటివారికి బాధ కలుగుతుంది. మీ మాటలను వాళ్ళు స్వీకరించరు, దానితో అవి తిరిగి వెనక్కి వచ్చేస్తాయి. మనం పిల్లలకు తినటానికి తాగటానికి ఇచ్చి మన బాధ్యతను పూర్తిచేసుకోవాలి. ఏమీ అనటానికి లేదు. అన్నా లాభం ఉండదు. మీకు అలా అనిపిస్తోందా? పిల్లలు పెద్దయ్యారు. వాళ్ళు మెట్ల మీది నుంచి ఎందుకు పడతారు? మీరు మీ స్వధర్మాన్ని ఎందుకు వదిలేస్తున్నారు? ఈ పిల్లలతో మీకున్నది రిలేటివ్ ధర్మం. అక్కడ మీరు తలబద్దలు కొట్టుకోవలసిందంటూ ఏమీ లేదు. బాధ పెట్టుకునేబదులు మౌనం వహించటం ఉత్తమం. బాధపడుతుంటే మనది, ఎదుటివారి మనసులు కూడా చెడిపోతాయి.

వాళ్ళు మీ గురించి తప్పుగా మాట్లాడితే మీరు కూడా తప్పుగా మాట్లాడుతారు. ఇక వాతావరణమంతా ప్రదూషిషమౌతుంది, విస్ఫోటం కలుగుతుంది. అందువలన మీరు వాళ్ళకి మంచిగా నచ్చచెప్పండి. ఏ దృష్టితో? 'ఆఫ్టరాల్, హి ఈజ్ ఎ గుడ్ మాన్' (అఖరికి అతను మంచివాడే) అన్న దృష్టిని మనసులో పెట్టుకుని.

**ప్రశ్నకర్త :** పిల్లలతో ఘర్షణ జరిగితే ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** రాగద్వేషాలేమీ ఉండగూడదు. అతనేమైనా పాడు చేస్తే, నష్టం కలిగిస్తే, అప్పుడు కూడా అతని మీద ద్వేషం పెట్టుకోవద్దు. అతన్ని 'శుద్ధాత్మ' గా చూడాలి. అంటే రాగద్వేషాలు లేకపోతే అంతా సమసిపోతుంది. మీ జ్ఞానాన్ని రాగద్వేషలతో ఉండనివ్వకండి.

మీ మనసులో ఏమాత్రం వేదన మొదలైనా అది ఇతరులది కాదు మీదే. కాబట్టి ఈ వేదనంతా నాదే అని అనుకోవాలి. ఎందుకా వేదన కలిగింది? మనకి అర్థం చేసుకోవటం రాలేదు కనుక. మనం 'శుద్ధాత్మ' నే చూడాలి. చిక్కులను ముగించాలి. 'నేను శుద్ధాత్మను' మిగతా అంతా 'వ్యవస్థితం'. అలాంటి సొల్యూషన్ (పరిష్కారం) ని ఇచ్చాను.

కొడుకు పెళ్ళయిన తర్వాత బాధలు పెట్టుకుంటే అది కుదరదు. దానికి ముందే అంతా సరిచేసుకోండి. మీతోపాటే ఉంటే తగవులు తప్పవు. అతని జీవితం చెడిపోతుంది, మన జీవితం కూడా చెడిపోతుంది. ప్రేమగా ఉండాలంటే అతన్ని విడిగా ఉంచే ప్రేమ కురిపించు. లేకపోతే జీవితాన్ని పాడుచేసుకున్నవారౌతారు, ప్రేమలు తగ్గిపోతాయి. అతని భార్య వచ్చిన తర్వాత కూడా అతన్ని మీ దగ్గర పెట్టుకోవాలని అనుకుంటే, అతను భార్య మాటే వింటాడు కచ్చితంగా. మీ మాటలు వినడు. అతని భార్య, 'ఈరోజు అమ్మ ఇలా అన్నది, అలా అన్నది' అంటే, మీ కొడుకు, 'ఔను మా అమ్మ అలాంటిదే' అంటాడు. ఇక మొదలౌతుంది తుఫాను. దూరం నుంచి అంతా బాగా కనిపిస్తుంది.

**ప్రశ్నకర్త :** విదేశాలలో ఉన్న పిల్లలు గుర్తుకొస్తారు, వాళ్ళ గురించి చింతన మొదలౌతుంది.

**దాదాశ్రీ :** మీ పిల్లలు అక్కడ మంచిగానే తింటారు, తాగుతారు, హాయిగానే ఉంటారు. అమ్మని గుర్తు కూడా చేసుకోకపోవచ్చు. కానీ అమ్మ ఇక్కడ చింతిస్తూవుంటుంది. ఇదేం సంగతి?

**ప్రశ్నకర్త :** పిల్లలు అక్కడి నుంచి రాస్తుంటారు, 'ఇక్కడకు వచ్చెయ్యి' అని.

**దాదాశ్రీ :** ఔను కానీ పోవటం మీ చేతిలో ఉందా? దాని బదులు మీరు ఎలా ఉన్నారో అలాగే ఉండిపోండి. అదేమైనా తప్పా? వాళ్ళు వాళ్ళ ఇంట్లో, మనం మన ఇంట్లో. మీ కడుపున పుట్టినంత మాత్రాన మీవాళ్ళయిపోయారా? మనవాళ్ళయితే మనతోపాటు రావాలి. అలా వస్తారా ఎవరైనా ఈ ప్రపంచంలో?

ఇంట్లో యాభై మంది ఉన్నా, మీరు వాళ్ళని సరిగ్గా గుర్తించకలేకపోయారు కనుకనే అంతా గడబిడ అవుతుంది. వాళ్ళని గుర్తించాలి కదా? ఈ గులాబీ మొక్కనా లేక వేరే ఏదైనా మొక్కా? దాన్ని అర్థం చేసుకోవద్దా?

పూర్వం ఎలా ఉండేది? సత్యయుగంలో ఒక ఇంట్లో అంతా గులాబీలు, రెండవ ఇంట్లో అంతా మోగ్రా, మూడవ ఇంట్లో చంపా! ఇప్పుడైమైంది, ఒకే ఇంట్లో గులాబి, మోగ్రా, చంపా! గులాబి అయితే ముళ్ళుంటాయి, మోగరా అయితే ముళ్ళు ఉండవు. మోగరా పువ్వు తెల్లగా ఉంటుంది, గులాబీ గులాబీ రంగులో లేక ఎర్ర రంగులో ఉంటుంది. ఈ కాలంలో అలా వేరు వేరు మొక్కలుంటున్నాయి. ఈ మాట మీకు అర్థమైందా?

సత్యయుగంలో పొలంలా ఉంటే ఈ కాలంలో తోటలా ఉంటోంది. కానీ అది కనిపెట్టలేకపోతున్నారు, దానికేం చెయ్యాలి? వాళ్ళకి సరిగ్గా కనిపెట్టటం తెలియకపోతే బాధే కలుగుతుంది కదా? జగత్తులో మనుషులకు ఇది చూసే దృష్టి లేదు. ఎవరూ చెడ్డవారు కారు. అభిప్రాయభేదమనేది వాళ్ళ అహంకారాలు. సరిగ్గా కనిపెట్టటం రాకపోవటం వలనే ఈ బాధంతా. సరిగ్గా గుర్తించటం వస్తే ఇక బాధనేదే ఉండదు. నాకు ఈ ప్రపంచంలో ఎవరితోనూ అభిప్రాయ భేదం కలుగదు. ఇది గులాబీ, ఇది మోగరా అని నేను గుర్తించగలుగుతాను. ఇది ధతూరా లేదా చేదుగా ఉండే తురాయి లాంటి పువ్వు. అలా అందరినీ గుర్తిస్తాను.

ప్రకృతిని గుర్తించనేలేరు కనుకనే నేను పుస్తకంలో రాసాను, 'ఈ కాలంలో ఇల్లు తోటలా అయింది. కనుక ఎలాగోలా పని జరిపించుకో ఈ కాలంలో' అని. స్వయంగా నోబుల్ (ఉదారుడు), కొడుకు లోభి అయినట్లయితే, 'నా కొడుకు బాగా లోభి' అంటాడు. అతన్ని తిట్టి, కొట్టి ఉదార స్వభావునిగా చేద్దామంటే అది అయ్యే

పని కాదు. ఆ సరుకే వేరు. తల్లిదండ్రులు అతన్ని తమలా చేద్దామని అనుకుంటారు. అరె, అతన్ని వికాసం చెందనీయండి. అతని శక్తులు ఏమిటి? అతన్ని వికాసం చెందనీయండి. ఎవరి స్వభావం ఎలాంటిదో చూడాలి. అరె, భాయ్, అతనితో ఎందుకు గొడవపెట్టుకుంటారు?

ఈ తోటని గుర్తించటం అవసరం. 'తోట' అని చెప్తే అందరికీ అర్థమౌతుంది, తమ సంతానాన్ని గుర్తిస్తారు. ప్రకృతిని గుర్తించండి. ఒకసారి పిల్లలను గుర్తించి, వాళ్ళకి అనుగుణంగా వ్యవహరించండి. అతని ప్రకృతిని గమనించి వ్యవహరిస్తే ఏమౌతుంది? మిత్రుడి ప్రకృతికి అడ్జస్ట్ అవుతారా లేదా? అలా ప్రకృతిని గమనించవలసి వుంటుంది. ప్రకృతిని గుర్తించవలసివుంటుంది. గుర్తించి నడుచుకుంటే ఇంట్లో గొడవలుండవు. కాని ఇక్కడ కొట్టి, తిట్టి, నాలా తయారవు అని అంటారు. అలా ఎలా అవుతారు?

ప్రపంచమంతా వ్యవహార జ్ఞానాన్ని శోధిస్తోంది. అలా వెతికేది ధర్మం గురించి కాదు. ఆ జ్ఞానమంతా ఈ లోకంలో బ్రతకేందుకు సాధనం. ప్రపంచంతో అడ్జస్ట్ అవటానికి ఉపాయం. వైఫ్‌తో ఎలా అడ్జస్ట్ అవాలి, కొడుకుతో ఎలా అడ్జస్ట్ అవాలి, వాటి ఉపాయం.

ఇంట్లో కీచులాటలు ఉంటే, ఈ వాణి నుంచి వచ్చింది అందరి ఇబ్బందులనూ తీర్చేది. ఈ వాణితో అంతా బాగుపడుతుంది. దేనితో బాధలు తొలగిపోతాయో, అటువంటి వాణి కోసం లోకులు వెతుకుతున్నారు. ఎందుకంటే, అలాంటి ఉపాయాన్ని ఎవరూ ఇవ్వలేదు కదా! నేరుగా పనిజరిగిపోయే ఉపాయమే లేదు కదా!

## 10. శంక అనే శూలం

ఒక వ్యక్తి నా దగ్గరకు వస్తుండేవాడు. అతనికి ఒక కూతురు ఉంది. అతనికి నేను ముందు నుంచి చెప్తూనేవున్నా, 'ఇది కలియుగం. కలియుగ ప్రభావం కూతుళ్ళ మీద కూడా పడుతుంది. అందువలన జాగ్రత్తగా ఉండు' అని. అతను అర్థం చేసుకున్నాడు. అతని కూతురు ఎవరితోనో పారిపోతే, అతను నన్ను గుర్తు చేసుకున్నాడు.

నా దగ్గరకు వచ్చి అడగసాగాడు, 'మీరు అన్న మాటలు నిజమయ్యాయి. మీరు ఆ మాట చెప్పివుండకపోతే నేను విషం తాగవలసివచ్చేది'. ఈ జగత్తు అలాంటిది. పోలంపోల్ (గడబిడ)! జరిగినదాన్ని సమ్మతించాలి. దానికోసం విషమేమిటి తాగేది? లేదు, నువ్వు పిచ్చివాడివని అనిపించుకుంటావు. వీళ్ళు పైన గుడ్డ వేసి మూసి మర్యాదను కాపాడుకుంటారు. మాది గొప్ప కుటుంబం అని చెప్పుకుంటారు.

ఒకతను మాకు దగ్గర బంధువుండేవాడు. అతనికి నలుగురు కూతుళ్ళుండేవారు. అతను చాల జాగ్రత్తగా ఉండేవాడు. నాతో, 'ఈ కూతుళ్ళు పెద్దయ్యారు. కాలేజ్‌కి వెళ్తున్నారు. కానీ నాకు వీళ్ళ మీద నమ్మకం లేదు' అని అంటుండేవాడు. అందుకు నేను, 'కాలేజ్‌కి వెంట వెళ్ళు. కాలేజ్ వదిలిపెట్టగానే వాళ్ళ వెనకనే రా' అన్నాను. అలా ఒకసారి పోతాడు. రెండవసారి ఏం చేస్తాడు? భార్యని పంపిస్తాడా? అరె, నమ్మకం ఎక్కడ పెట్టుకోవాలి, ఎక్కడ వద్దు అనేది కూడా తెలియదా? మనం కూతురితో, 'చూడమ్మా, మనం మంచి కుటుంబానికి చెందినవాళ్ళం. మనది గొప్ప కుటుంబం, ఉన్నతమైన కులం' అని చెప్పి ఆమెకు అవగాహన కల్పించాలి. ఆ తర్వాతా, ఏది జరిగితే అదే కరెక్ట్. ఆమెను శంకించగూడదు. ఎంతకనం శంకిస్తారు? ఈ విషయంలో జాగ్రత్తపడేవాళ్ళు శంకిస్తు ఉంటారు. అలా సంశయాన్ని పెట్టుకుంటే దానికి అంతం ఎప్పుడు వస్తుంది?

అందువలన ఎటువంటి శంకయినా, ఉత్పన్నమవటానికి ముందుగానే పెరికిపారేయాలి. ఈ కూతుళ్ళు బయట తిరిగివస్తారు, ఆడుకుంటారు, వాళ్ళని నమ్మకపోతే, అపనమ్మకం ఉత్పన్నమైతే మనకిక సుఖశాంతులుంటాయా? ఉండవు.

కనుక, ఎప్పుడూ కూతురు రాత్రి ఆలస్యంగా ఇంటికి వచ్చినా సరే, అనుమానపడవద్దు. అనుమానాన్ని తీసివేస్తే ఎంత లాభం కలుగుతుంది? కారణం లేకుండా భయపడుతూవుంటే ఏమిటి అర్థం? ఒక జన్మలో పరివర్తనైతే కలుగదు. ఆ ఆడపిల్లలకు అనవసరంగా బాధ కలిగించవద్దు. పిల్లలను బాధపెట్టవద్దు. కేవలం వాళ్ళకి, 'అమ్మా నువ్వు బయటకు పోతావు కదా అయితే ఆలస్యంగా రావొద్దు. మనం మంచి కుటుంబానికి చెందినవాళ్ళం. మనకి అది శోభనివ్వదు. అందువలన ఎక్కువ ఆలస్యం కానివ్వకు' అనైతే తప్పక చెప్పాలి. అలా మాట్లాడి అర్థం అయ్యేటట్టు చెప్పాలి.

కానీ, 'ఎవరితో తిరుగుతున్నావ్, ఏమేం చేస్తున్నావ్' అంటూ అనుమానపడటం మంచిది కాదు. ఎప్పుడైనా రాత్రి పన్నెండు గంటలకు వచ్చినా కూడా, రెండవ రోజు, 'అమ్మాయ్, అలా చెయ్యవద్దు' అనాలి. ఆమెని ఇంట్లోంచి పంపిచేస్తే ఎవరి దగ్గరికి పోతుంది? ఏం చెప్పలేము. లాభం ఎందులో ఉంది? తక్కువలో తక్కువ నష్టం రావటంలోనే లాభం ఉంది కదా. అందువలనే నేను, 'రాత్రిపూట ఆలస్యంగా వచ్చినా సరే కూతురుని ఇంట్లోకి రానివ్వండి. ఆమెని బయటకు పంపించకండి' అని అందరికీ చెప్తాను. లేకపోతే వీళ్ళు బయట నుంచి బయటకే పంపిచేస్తారు. అంత వేడిమీద ఉంటారు వీళ్ళు. కాలం ఎంత విచిత్రమైంది! ఎంత దుఃఖదాయకమైన కాలమిది!! దాని మీద ఇది కలియుగం. అందువలన వాళ్ళని ఇంట్లో కూర్చోబెట్టి మాట్లాడండి.

**ప్రశ్నకర్త :** ఎదుటివాళ్ళు ఎవరైనా మనలను సంశయిస్తే దాన్ని ఎలా నిరాకరించాలి?

**దాదాశ్రీ :** అతను సంశయిస్తున్నాడు అనే ఆలోచనే పెట్టుకోవద్దు. అటువంటిది మనకి తెలిస్తే దాన్ని మర్చిపోవాలి.

**ప్రశ్నకర్త :** అతనికి మన మీద సంశయం కలిగింది అంటే సంశయం ఎందుకు కలిగింది అని అడగాలి కదా?

**దాదాశ్రీ :** అడగటంలో మజా లేదు. అలా అడగనే వద్దు. మనం వెంటనే అర్థం చేసుకోవలసింది, మనదే ఏదో తప్పు ఉందేమో అని. లేకపోతే ఆ మనిషికి శంక ఎందుకు కలుగుతుంది?

'అనుభవించేవారిదే తప్పు' అన్న మాటని అర్థం చేసుకుంటే, దాన్ని నిరాకరించగలుగుతారు. శంకిస్తున్నవాడు అనుభవిస్తున్నాడా లేక ఎవరి మీదయితే శంక కలిగిందో అతను అనుభవిస్తున్నాడా? అది చూడండి!

## 11. వీలునామాలో పిల్లలకు ఎంత భాగం

**ప్రశ్నకర్త :** పుణ్యం ఫలించి అవసరమైనదానికంటే ఎక్కువ డబ్బు వచ్చినట్టయితే ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** అప్పుడు మంచి కార్యాలకు ఉపయోగించండి. పిల్లలకు ఎక్కువగా పెట్టవద్దు. వాళ్ళని బాగా చదివించి పనిలో పెట్టాలి. పనిలో పెట్టిన తర్వాత ఎక్కువ డబ్బుని పెట్టుకోవద్దు. మనతో ఎంతయితే వచ్చిందో అదే మనది అన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి.

**ప్రశ్నకర్త :** ఇక్కడి నుంచి తీసుకెళ్ళగలుగుతామా?

**దాదాశ్రీ :** ఇప్పుడింకేం తీసుకెళ్తారు? వెంట వచ్చిందంతా ఖర్చు పెట్టేసి అవగొట్టారు. ఇప్పుడు మోక్షానికి సంబంధించినవి ఇక్కడ గ్రహిస్తే రోజులు మారుతాయి. ఇంకా జీవితం మిగిలివుంది. ఇప్పటికీ జీవితాన్ని మార్చుకోవచ్చు. ఎప్పుడు లేస్తే అదే ఉదయం.

అక్కడ (మరుజన్మలో) తీసుకెళ్ళటానికి ఎందుకు పనికివస్తుంది? ఇక్కడ మీరు ఏదైతే ఖర్చు చేసారో, అదంతా మురికి కాలువలో పోయింది. మీ సరదాల కోసం, మీరు జీవించేందుకు చేసిందంతా మురికి కాలువలోకే పోయింది. కేవలం ఇతరుల కోసం చేసింది ఏదైతే ఉందో అదే మీ ఓవర్‌డ్రాఫ్ట్ (జమ) అవుతుంది.

ఒకతను నన్ను, పిల్లలకేమీ ఇవ్వొద్దా అని ప్రశ్నించాడు, 'పిల్లలకు ఇవ్వండి. కానీ మీ తండ్రిగారు మీకు ఎంతయితే ఇచ్చారో అంతే ఇవ్వండి. మధ్యలో మీరు సంపాదించినదాన్ని మనం ఏదైనా మంచి కార్యానికి ఖర్చుపెడదాం' అని అన్నాను.

**ప్రశ్నకర్త :** మా వకీళ్ళ చట్టాలలో కూడా, తండ్రి తాతల ప్రాపర్టీ (ఆస్తి) ఏదైతే ఉందో, దాన్ని పిల్లలకు తప్పక ఇవ్వాలి, స్వార్జితమైన ధనాన్ని తండ్రి ఏం చెయ్యాలని అనుకుంటే అది చేయవచ్చు అని ఉంది.

**దాదాశ్రీ :** ఔను. ఏం చెయ్యాలనుకుంటే అది చెయ్యండి. మీ చేతులతోనే చెయ్యాలి. నా మార్గం ఏం చెప్తుందంటే, నీ సొంత సొమ్ము ఉంటే దాన్ని విడదీసి ఖర్చు పెట్టాలి. అది నీ వెంట వస్తుంది. ఎందుకంటే, ఈ 'జ్ఞాన' ప్రాప్తి తర్వాత ఇక ఒకటి రెండు జన్మలే మిగిలివుంటాయి. కనుక వెంట ఉండే అవసరం పడుతుంది కదా? వేరే ఊరు వెళ్ళినపుడు వెంట కొన్ని రొట్టెలు తీసుకెళ్తారు. అలాంటప్పుడు అక్కడ కూడా ఏమైనా వెంట ఉండాలి కదా?

అందువలన కొడుకుకి కేవలం ఎంత ఇవ్వాలి అంటే, ఒక ఫ్లాట్ (ఇల్లు) ఇవ్వండి. మనం ఉంటామే అది. అది కూడా ఇవ్వండి. అతనితో, 'నాయనా, నేను పోయిన తర్వాత ఇదంతా నీదే. అంత వరకు నేనే యజమానిని! పిచ్చి వేషాలు వేస్తే, నిన్ను, నీ భార్యని బయటకు పంపించేస్తాను. నేను ఉన్నంత వరకు నీకు ఏమీ లేదు. నేను పోయిన తర్వాత అంతా నీదే' అనండి. వీలునామా రాయండి. మీ తండ్రి ఇచ్చినంత వరకు మీరు అతనికి ఇవ్వండి. ఆ హక్కు అతనికి ఉంది. ఆఖరి వరకు కొడుకు మనసులో, 'ఇప్పుడు నాన్న దగ్గర యాభై వేలు ఇంకా ఉన్నాయి' అనిపించేట్టుగా ఉండండి. మీ దగ్గరైతే లక్ష రూపాయలుంటాయి. అతన్ని, 40, 50 వేలుంటాయేమో అనుకోనీండి. అతన్ని చివరివరకు ఆ ఆశతో ఉంచండి. అతను తన భార్యతో, 'పో, నాన్నకి ఫస్ట్ క్లాస్ భోజనం పెట్టు, టీ టిఫిన్లు ఇస్తుండు' అనాలి. గర్వంగా బతకండి. అంటే, మీ నాన్నగారు ఏమైనా భవనం (ఇల్లు) ఇచ్చివుంటే దాన్ని అతనికి ఇవ్వండి.

ఎవరూ ఏదీ వెంట తీసుకునిపోవటం కుదరదు. చనిపోయిన తర్వాత శరీరాన్ని కాల్చేసారు. ఇక పిల్లల కోసం ఎక్కువ ఉంచి లాభమేమిటి? 'ఇక ఉద్యోగ వ్యాపారాలు ఏమీ చెయ్యవలసిన అవసరం లేదు' అని అనుకుంటారు వాళ్ళు. పిల్లలు తాగుబోతులు అవుతారు. ఎందుకంటే వాళ్ళకి మరి అలాంటి సహవాసాలే దొరుకుతాయి. అంతా అలా తాగుబోతులే అయ్యారు కదా! కనుక కొడుకుకి బాగా ఆలోచించి పద్ధతిగా ఇవ్వాలి. ఎక్కువగా ఇస్తే దురుపయోగమౌతుంది. ఎల్లప్పుడూ జాబ్ (ఉద్యోగం) చేసే విధంగానే ఉండేటట్లుగా ఇవ్వాలి. పనిలేకుండా ఉంటే తాగుతారు కదా.

ఏమైనా వృత్తి, వ్యాపారాలు ఇష్టముంటే పెట్టించండి. ఏ వ్యాపారమంటే ఇష్టం అని అడిగి, అతనికి ఏ వ్యాపారం సరైనదో దానిలో పెట్టించండి. ఇరవై ఐదు, ముప్పై వేల రూపాయలను బ్యాంక్ నుంచి ఇప్పించండి. దాన్ని తనంతట తాను కడుతుంటాడు. కాస్తో కూస్తో డబ్బు మీరు ఇవ్వండి. అతనికి అవసరమైనదానిలో సగం డబ్బు మనం ఇవ్వాలి, సగం బ్యాంక్ నుండి లోన్ ఇప్పించాలి. ఈ లోను కిస్తులు నువ్వు కట్టుకో అని చెప్పాలి. కిస్తులు కట్టుకుంటూ పోతుంటే కొడుకు ప్రయోజకుడౌతాడు.

కనుక, కొడుకుకి నియమానుసారం ఎంత ఇవ్వాలో అంత ఇచ్చి, మిగిలింది ఇతరుల సౌఖ్యం కోసం మంచి మార్గంలో ఖర్చు పెట్టాలి. ఇతరులకు సౌఖ్యం ఎలా కలుగుతుంది? వాళ్ళ హృదయాలు చల్లబడ్డప్పుడు. అప్పుడు ఆ సంపద మీతో వస్తుంది. నగదు రూపంలో కాదు కానీ, ఓవర్ డ్రాఫ్ట్ (జమా రాశి) రూపంలో వస్తుంది. డబ్బుని తీసుకునివెళ్ళనివ్వరు కదా! ఇక్కడ ఆ విధంగా ఓవర్‌డ్రాఫ్ట్ చేసుకో, లోకంలో ఇతరులకు పెట్టు, అందరి హృదయాలను చల్లబరచు. ఎవరికైనా కష్టం ఉంటే తొలగించు. ఇదే దారి ఓవర్‌డ్రాఫ్ట్‌ని ముందుకు పంపించటానికి. డబ్బుని సదుపయోగం చెయ్యి. చింతించకు. హాయిగా తిను, తాగు, తినటం తాగటంలో లోభం వద్దు. అందుకే చెప్తాను, 'ఖర్చు చెయ్యి, ఓవర్‌డ్రాఫ్ తీసుకో' అని.

నేను అతని కొడుకులతో, మీ తండ్రి ఈ సంపదనంతా మీ కోసం పోగుచేసాడు, ధోతీ కట్టుకుని (లోభిగా ఉంటూ), అన్నాను. అప్పుడు వాళ్ళు, 'మీకు మా నాన్న గురించి తెలియదు' అన్నారు. 'ఏం' అని అంటే, 'ఇక్కడి నుంచి డబ్బులు తీసుకునివెళ్ళగలిగితే, మా నాన్న అందరి దగ్గరా అప్పు తీసుకుని పది లక్షలన్నా తప్పక తీసుకునిపోతాడు. అందువలన ఈ మాట మనసులో పెట్టుకునేది కాదు' అని అన్నారు. ఆ అబ్బాయి అలా చెప్తే నేను, 'ఇప్పుడు నాకు అసలు సంగతేమిటో తెలిసింది. నేను తెలుసుకోదలచుకున్నది నాకు తెలిసింది' అన్నాను.

ఏకైక పుత్రుడు అవటం వలన అతనికే వారసుడిని చేసి అప్పజెప్పటం జరిగింది. 'నాయనా, ఇదంతా నీదే. ఇప్పుడు మనం ధర్మధ్యానం చేద్దాం' అన్నాడు. 'ఇప్పుడు ఈ సంపదంతా అతనిదే కదా' అంటే పరిస్థితి ఘోరంగా ఉంటుంది. ఎందుకంటే, అతనికి సంపదనంతా ఇచ్చేస్తే ఏమౌతుంది? తండ్రి తన సంపదనంతా తన ఏకైక కుమారుడికి ఇచ్చేస్తే, కొడుకు తల్లిదండ్రులను కొన్నాళ్ళు దగ్గర పెట్టుకుంటాడు. కానీ ఏదో ఒక రోజు, 'మీకు బుద్ధి లేదా, ఒక చోట కూర్చునివుండండి ఇక్కడ' అంటాడు. అప్పుడు తండ్రి మనసులో, 'వీడి చేతికి కళ్ళెం ఎందుకు ఇచ్చాను?' అని పశ్చాత్తాపం మొదలౌతుంది. దానికి బదులు కళ్ళేన్ని మనం మన చేతిలోనే పెట్టుకోవాలి.

ఒక తండ్రి తన కొడుకుతో, 'నా ఆస్తంతటినీ నీకు ఇస్తాను' అన్నాడు. దానికి అతను, 'మీ ఆస్తి మీద నేను ఆశ పెట్టుకోలేదు. దాన్ని మీరు ఎక్కడ కావాలంటే అక్కడ వాడుకోండి' అంటాడు. చివరకు ఏం జరుగుతుందన్నది వేరు. కాని అతని తన నిశ్చయాన్ని, తన అభిప్రాయాన్ని అలా చెప్పేసాడు కదా! అందుకే అతను సర్టిఫైడ్ అయ్యాడు. ఇక సరదాలు అనేవి ఏమీ లేవు.

## 12. మోహం దెబ్బకి అనేకసార్లు చస్తారు

**ప్రశ్నకర్త :** పిల్లలు పెద్దవుతారు, ఆ తర్వాత మనవాళ్ళుగానే ఉంటారా లేదా అన్నది ఎవరికి తెలుసు?

**దాదాశ్రీ :** ఔను. మన అనేది ఏదీ ఉండదు. ఈ శరీరమే మనది కాదు! ఈ శరీరాన్ని కూడా తర్వాత తీసేసుకుంటారు. ఎందుకంటే పరాయి వస్తువు మన దగ్గర ఎంత కాలం ఉంటుంది?

పిల్లలు మోహంతో 'నాన్న నాన్న' అంటే తండ్రి చాల సంతోషపడిపోతాడు. 'అమ్మ, అమ్మ' అంటే అమ్మ చాల సంతోషపడి గాలిలో తేలియాడుతుంటుంది. తండ్రి మీసాలను పట్టుకుని లాగినా కూడా తండ్రి ఏమీ అనడు. ఈ చిన్న పిల్లలు చాల పని చేస్తారు. తల్లిదండ్రుల మధ్య ఏమైనా గొడవ జరిగితే, పిల్లవాడు మధ్యవర్తిగా వాళ్ళని సమాధానపరుస్తాడు. జగడాలు ఎప్పుడూ జరుగుతూనేవుంటాయి కదా! భార్యా భర్తల మధ్య నువ్వెంత, నేనెంత అనేది ఉంటూనేవుంటుంది. అప్పుడు కొడుకు వాళ్ళని ఎలా సమాధానపరుస్తాడు? ఉదయాన్నే వాళ్ళు టీ తాగకుండా, ఎడముఖం పెడముఖంగా ఉన్నపుడు, ఆమె పిల్లవాడితో, 'నాయనా, నాన్నకి చెప్పు, మా అమ్మ టీకి పిలుస్తోంది పదండి నాన్నా' అని చెప్పు అంటుంది. ఇక కొడుకు తండ్రి దగ్గరకు పోయి, 'నాన్నా నాన్నా' అనగానే అతను అన్నీ మర్చిపోయి టీ తాగటానికి పోతాడు. అలా అంతా నడిచిపోతుంటుంది. కొడుకు 'నాన్నా' అని పిలవాగానే ఓహెూహెూ! ఏదో మంత్రం వేసినట్లే అవుతుంది. అరె, అంతకు ముందే అంటాడు నేను టీ తాగను అని! ఇలాగే ఉంది లోకం!

ఈ ప్రపంచంలో ఎవరూ ఎవరికీ కొడుకు అవలేదు. ప్రపంచం మొత్తంలో, తండ్రితో మూడు గంటల సేపు జగడం పెట్టుకుని, ఆ తర్వాత, 'నాన్నగారండీ, మీరు నన్ను ఎంతైనా తిట్టండి కాని మీరు నేను ఒకటే' అనే కొడుకుని ఒక్కడిని వెతికి చూపించండి. అలా మాట్లాడేవాడిని వెతికి తెస్తారా? వీళ్ళు అరగంట సేపు టెస్ట్ కోసం తీసుకొస్తేనే చాలు ఢాం అని పేలుతుంది. తుపాకీ గుండు పేలటంలో ఆలస్యం కావొచ్చు కాని ఇది వెంటనే పేలుతుంది. కాస్త ఏమైనా గట్టిగా అనటం మొదలుపెడుతుంటేనే దానికంటే ముందుగానే పేలిపోతారా లేదా?

కొడుకు 'నాన్నగారు నాన్నగారు' అన్నప్పుడే చేదుగా అనిపించాలి. తియ్యగా అనిపిస్తే ఆ సుఖాన్ని అరువు తీసుకున్నట్లు అనాలి. తిరిగి దాన్ని దు:ఖం రూపంలో తిరిగి చెల్లించాల్సివుంటుంది. కొడుకు పెద్దవుతాడు కదా అప్పుడు మిమ్మల్ని, 'మీకు బుద్ధి లేదు' అంటాడు. అప్పుడు మనకి అనిపిస్తుంది అలా ఎందుకు జరిగింది అని. మీరు అప్పుగా తీసుకున్నది ఇప్పుడు వసూలు చేసుకుంటున్నాడు. అందువలన మొదటి నుంచే అప్రమత్తంగా ఉండు. నేనైతే అప్పుగా సుఖాన్ని పొందే పనినే మానేసాను. ఆహా. మన ఆత్మలోనే అనంతమైన సుఖం ఉంది. దాన్ని వదిలి ఈ భయంకరమైన బురదలో ఎందుకు పడాలి?

70 సంవత్సరాల ఆడమనిషి ఉంది. ఒక రోజు ఇంట్లోంచి బయటకు వచ్చి అరవటం మొదలుపెట్టింది, 'ఈ ప్రపంచమంతా తగలబడిపోవాలి. చేదు విషంలా ఈ ప్రపంచం నాకు ఎంతమాత్రం బాగోలేదు. హే భగవాన్! నన్ను తీసుకునిపో' అంటూ. అప్పుడు ఎవరో ఒక కొడుకు అక్కడి నుండి పోతున్నవాడు అడిగాడు, 'ఏమైందమ్మా, రోజూ చాల బాగా మాట్లాడేదానివి. మీ మాటలు రోజూ తియ్యని ద్రాక్షలా ఉండేవి, ఈ రోజు చేదుగా ఎందుకు మారాయి?' అని. అందుకు ఆమె, 'నా కొడుకు నాతో దెబ్బలాడుతాడు. ఈ ముసలితనంలో నన్ను, ఇక్కడి నుండి వెళ్ళిపో అంటాడు' అంది.

ఇంతకు ముందు ఉపకారం చేసేవారి కోసం బయటకు వెళ్ళవలసివచ్చేది. కానీ ఈ రోజుల్లో ఉపకారం చేసేవారు ఇంట్లోనే ఉన్నారు. అందువలన ప్రశాంతంగా కొడుకు ఏ సుఖదు:ఖాన్ని అందించినా దాన్ని స్వీకరించు.

మహవీర్ భగవాన్‌కి కూడా ఉపకారం చేసేవారు దొరికేవారు కారు. ఆర్య దేశంలో ఉపకారి దొరకక ఆయన అరవై మైళ్ళ దూరంలో అనార్య ప్రాంతంలోకి వెళ్ళవలసివచ్చింది. కానీ మనకి ఇంట్లోనే ఉపకారి ఉన్నాడు. కొడుకు, 'మాకు ఒకవేళ ఆలస్యమైతే మీరు గొడవపెట్టకండి. మీరు పడుకోవలనుకుంటే మాట్లాడకుండా పడుకోండి' అంటే, తండ్రి, 'ఇక నేను మాట్లాడకుండా పడుకుంటాను. ఇదంతా నేను ఊహించలేదు. లేకపోతే నేను కుటుంబాన్ని తయారుచేసేవాడినే కాను. ఇక జరిగిందేదో జరిగిపోయింది. మనకి ముందుగా ఇదంతా తెలియదు కదా అందుకే మొదలుపెట్టేసి, తర్వాత ఇరుక్కుంటాం.

**ప్రశ్నకర్త :** అయిష్టమైనవారు లభించినపుడు, ఆత్మ కోసం ఉపయోగం లోకి తెచ్చుకోండి అనే అర్థం వస్తుందా?

**దాదాశ్రీ :** అయిష్టమైనది ఆత్మకి హితవు చేసేదే అవుతుంది. అది ఆత్మకి విటమిన్‌లాంటిది. ఒత్తిడి కలుగగానే వెంటనే ఆత్మలోకి వెళ్ళిపోతారు కదా. ఎవరైనా తిట్టినట్లయితే, అతను తన ఆత్మలోనే ఐక్యమైపోతాడు. కానీ ఎవరికైతే జ్ఞానం కలిగిందో వాళ్ళే అలా చెయ్యగలుగుతారు.

**ప్రశ్నకర్త :** వృద్ధాప్యంలో మనకి ఎవరు సేవ చేస్తారు?

**దాదాశ్రీ :** సేవ చెయ్యాలనే ఆశ ఎందుకు పెట్టుకోవటం? మనల్ని వేధించకపోతే చాలు. సేవను ఆశించకండి. కేవలం ఐదు శాతం మంది మంచివారు ఉండవచ్చు. మిగతా తొంభై ఐదు శాతం గాలి తీసేసేవాళ్ళే ఉంటారు.

అరె, కొడుకులు ఏం చేస్తారు? ఒకడు తన తండ్రితో, 'మీరు నాకు నా భాగాన్ని ఇచ్చేయండి. ప్రతిరోజు జగడం పెడుతుంటారు అదంతా కుదరదు' అంటాడు. అప్పుడు అతని తండ్రి, 'నువ్వు నన్ను ఇంతగా వేధించావు కదా, నేను నీకు ఏమీ ఇవ్వను' అంటాడు.

'ఇది నా స్వార్జితం. కనుక నేను నీకు నా ఆస్తిలో ఏమీ ఇవ్వను' అని అంటే కొడుకు, 'ఇదంతా నా తాతగారిది. కాబట్టి నేను కోర్టులో దావా వేస్తాను' అంటాడు.

నేను కోర్టులో పోరాడుతాను అంటే అర్థం ఏమిటి? నిజానికి ఈ సంతానం నాది కాదు అని.

మీరు ఒకవేళ కొడుకుతో ఒక గంటసేపు దెబ్బలాడి, పెద్ద పెద్ద తిట్లు కూడా తిట్టిన తర్వాత కొడుకు ఏమంటాడు? 'మీరేమనుకుంటున్నారు? ఆస్తిలో వాటా కోసం కోర్టులో దావా కూడా వేస్తారు. అటువంటి కొడుకు కోసం బాధ ఎందుకు? మమత పోతే చింత కూడా పోతుంది. ఇక నాకా కొడుకు వద్దు. మమతానురాగాలు ఉన్నవాళ్ళకే చింత ఉంటుంది.

తోడల్లుడికి జబ్బు చేస్తే చూడటానికి హాస్పిటల్‌కి పన్నెండుసార్లు వెళ్తాడు. అదే తండ్రి అయితే కలవటానికి ఏ మూడుసార్లో వెళ్తాడు. అలా నువ్వు దేనివలన చేస్తావు? ఇంట్లో భార్య కీ ఇచ్చి పంపుతుంది, 'బావగారిని చూసిరా' అని. భార్య చెప్పింది కనుక వెంటనే తయారు. అలా భార్య చేతుల్లోనే ఆడుతోంది జగత్తంతా.

కొడుకు మంచివాడే కానీ అతను గురువు (భార్య) కలవనివ్వకపోతే ఏం అప్పుడేం చేస్తాడు? కాని గురు కలవకుండా ఉండదు కదా! నేను అనేదేమిటంటే, గురువు పరదేశంది అయినా లేక ఇండియన్ అయినా, నియంత్రణ మన చేతిలో ఉండదు. అందువలన కళ్ళెం పద్ధతి ప్రకారం మన చేతుల్లో పెట్టుకోవాలి.

**ప్రశ్నకర్త :** పూర్వ జన్మలో ఎవరితోనైనా వైరబంధంలో ఉంటే, అతను ఏదో ఒక జన్మలో అతనితో కలిసి దాన్ని తిరిగి చెల్లించవలసివుంటుంది కదా?

**దాదాశ్రీ :** లేదు. అలాగేమీ లేదు. అలా ప్రతీకారం తీర్చుకోవటం ఉండదు. వైరం వలన లోపల రాగద్వేషాలు కలుగుతాయి. పోయిన జన్మలో కొడుకుతో వైరం వస్తే అది ఏ జన్మలో పూర్తవుతుందా అని మనం ఆలోచిస్తే, ఆ విధంగా అన్నీ కూడాలి కదా? ఆ కొడుకు ఈ జన్మలో పిల్లిగా వస్తే, మీరు పాలు పోసినా సరే మీ ముఖం మీద గోళ్ళతో గీరటం జరుగుతుంది! అలాగే ఉంటుంది అంతా! అలా అతని వైరం తీరిపోతుంది. పరిపక్వమవటం కాల నియమం. కనుక కొంత కాలానికి

బాకీ తీరిపోతుంది. కొందరు వైర భావంతో కలుస్తారు. అటువంటి కొడుకు వస్తే మన నుంచి నూనె పిండుతాడు. అర్థమైందా? శత్రుభావంతో వస్తే అలా జరుగుతుందా లేదా?

**ప్రశ్నకర్త :** నాకు ముగ్గురు కూతుళ్ళు. నాకు వాళ్ళ భవిష్యత్తు గురించే చింత అంతా.

**దాదాశ్రీ :** భవిష్యత్తు గురించి మనం చింతించే బదులు ఈ రోజు సేఫ్‌సైడ్ (క్షేమం) గురించి చూడాలి. ప్రతిరోజు సేఫ్‌సైడ్ చూసుకోవటం మంచిది. ముందు రాబోయే కాలం గురించి ఆలోచిస్తావు కదా, ఆ ఆలోచన ఏ విధంగానూ హెల్పింగ్ (సహాయకారి) కాదు సరికదా, నష్టం కలిగిస్తుంది. దానిబదులు, మనం ప్రతిరోజు సేఫ్‌సైడ్ లో ఉంటే, అదే పెద్ద మందు.

మీరు కొడుకులు, కూతుళ్ళకు సంరక్షకునిగా వ్యవహరిస్తూ, వాళ్ళకి ట్రస్టీగా ఉండాలి. వాళ్ళ పెళ్ళిళ్ళ గురించి చింత పెట్టుకోవద్దు. కూతురు తన ఖాతా తాను వెంట తెచ్చుకునేవుంటుంది. కూతురు గురించి ఎటువంటి చింతా మీకు అవసరం లేదు. కూతురుకి మీరు పోషకుడు. కూతురు తన కోసం ఒక అబ్బాయిని కూడా వెంట తెచ్చుకునే వుంటుంది. నాకో కూతురుంది దాని కోసం ఒక అబ్బాయిని కనమని చెప్పటానికి మనం ఎవరి దగ్గరకూ పోనక్కర్లేదు. ఏమిటి అలా చెప్పవలసివుంటుందా? అంటే అర్థం, తన కోసం అన్నీ తెచ్చుకునేవుంటుంది. తండ్రి అప్పుడు, 'ఈమె ఇరవై ఐదు సంవత్సరాలకు వచ్చింది కాని ఇప్పటికీ ఎక్కడా ఏమీ అవటం లేదు, అదీ ఇదీ' అంటూ రోజంతా అదే పాట పాడుతుంటాడు. అరె, అక్కడ అబ్బాయి ఇరవై ఏడు సంవత్సరాలకు వచ్చాడు కానీ నీకు దొరకలేదు అంతే. ఎందుకు గగ్గోలు పెడతావు? పడుకో మాట్లాడకుండా! మీ కూతురు తన టైమింగ్ (సమయం) అంతా సెట్ చేసుకుని వచ్చింది.

చింత పడటం వలన అంతరాయ కర్మ అంటుకుంటుంది. అది జరగాల్సిన పనిలో ఆలస్యం కలిగిస్తుంది. ఫలానా చోట ఒక అబ్బాయి ఉన్నాడు అని ఎవరైనా చెప్తే మనం ప్రయత్నం చేయాలి. చింతించే పని 'వద్దు' అని భగవాన్ చెప్పారు.

చింత పెట్టుకోవటం వలన మరొక అంతరాయం పడుతుంది. వీతరాగ భగవానుడు, 'మీరు చింతిస్తున్నారంటే, మీరే యజమానులా? మీరే ఈ ప్రపంచాన్ని నడుపుతున్నారా?' అన్నారు. దీన్ని ఇలా చూస్తే అర్థమౌతుంది– మనకి మరుగుదొడ్డికి పోవటానికి కూడా స్వతంత్ర శక్తి లేదు. ఆగిపోతే డాక్టర్‌ని పిలిపించవలసివస్తుంది. అప్పటి వరకు ఆ శక్తి మనదేనని అనిపిస్తుంది. కానీ ఆ శక్తి మనది కాదు. ఆ శక్తి ఎవరి ఆధీనంలో ఉంటుందనేది అందరూ తెలుసుకోవాలి.

అంత్యకాలంలో మంచం మీద పడివున్నపుడు కూడా చిన్న కూతురు గురించి చింత మొదలౌతుంది, దాని పెళ్ళి చేయటం మిగిలిపోయింది అని. ఆలా చింతిస్తూ చింతిస్తూ మరణిస్తే పశు యోనిలో నిందాజనకంగా జన్మిస్తారు. మరి మనిషి జన్మ తీసుకుని కూడా సరైన పద్ధతిలో లేకపోతే ఏమనాలి?

## 13. జంఝాటమేమీ పెట్టుకోకపోవటం మంచిదైంది

**దాదాశ్రీ :** ఏ రోజైనా చింతిస్తావా?

**ప్రశ్నకర్త :** ఎక్కువగా కాదు కాని, అంతా ఉంది కాని పిల్లలే లేరని ఎప్పుడైనా అనిపిస్తుంది.

**దాదాశ్రీ :** ఓహోహో! అంటే తినేవాళ్ళు ఎవరూ లేరు. ఇంత ఉంది కాని, తినటానికి ఎంతో ఉంది కాని, తినేవాళ్ళు లేరు అంటే అది చింతా (ఉపాధి) జనకమేగా మరి?

ఏదో జన్మలో చాల పుణ్యం చేసుకునివుంటేనే పిల్లలు లేకుండా ఉంటారు. ఎందుకంటే, పిల్లలు కలగటం, కలగకపోవటం అనేది అంతా మన కర్మల బైఖాతాలోని లెక్కకి అనుగుణంగా ఉంటుంది. ఈ జన్మలో ఎక్కువ పుణ్యవంతుడు పిల్లలు కలుగలేదు. అలాంటివాళ్ళు పుణ్యమూర్తులనే అనిపించుకుంటారు. భాయ్! మీకు ఎవరు అలా బోధించారు అని అడిగితే, 'నా భార్య రోజూ కీచులాట పెట్టుకుంటుంది!' అన్నాడు. అప్పుడు 'నేను వస్తాను అక్కడికి' అన్నాను. ఆ తర్వాత అతని భార్యకి నచ్చచెప్తే ఆమె అర్థం చేసుకుంది. నేను ఆమెతో, ఈయనకైతే ఏ సమస్యా లేదు. నీ బైఖాతాలో నీ

పేరు మీద ఖాతాయే లేదు. అది మంచిదే కదా? అందువలన మీరు పరమ సుఖవంతులు.

సంతానమే లేకుండా ఒకడే కొడుకు పుడితే అతను తండ్రిని చాల సంతోషపెడతాడు. అతనికి ఎంతో ఆనందాన్ని కలుగజేస్తాడు. కానీ అతను పోయినప్పుడు అంత ఏడిపిస్తాడు కూడా. అందువలన మనం తెలుసుకోవలసింది ఏమిటంటే, అతను వచ్చి, మళ్ళీ వెళ్ళిపోయాడంటే ఏమౌతుంది? అందువలన ఈ రోజు నుంచే నవ్వటం మానెయ్యండి. అప్పుడు తర్వాత కష్టం కూడా అనిపించదు కదా!

పిల్లలు మన రాగద్వేషాల లెక్కలు. డబ్బుల లెక్కలు కావు. రాగద్వేషాల ఋణానుబంధమది. రాగద్వేషాల బాకీ తీర్చేందుకు ఈ పిల్లలు తండ్రి నుండి నూనె పిండుతారు, కుంపట్లో వేపుతారు. శ్రేణిక రాజుకి కూడా కొడుకు ఉండేవాడు. అతను రోజూ కొట్టేవాడు, జైల్లో కూడా వేసాడు.

నాకు పిల్లలు లేరు అని అంటారు. పిల్లలను ఏం చేసుకోవాలి? కష్టాలు కలిగించే పిల్లలు ఎందుకు? దాని బదులు, శేరు మట్టి లేకపోవటమే మంచిది. ఏ జన్మలోనైనా మీకు శేరు మట్టి కూడా లేదు. ఇప్పుడీ మానవ జన్మ ఎంతో కష్టపడి లభించింది. కాబట్టి భాయ్, తిన్నగా చావండి! మోక్షమార్గాన్ని వెతికి పట్టుకోండి, మీ పనిని నెరవేర్చుకోండి.

**ప్రశ్నకర్త :** పోయిన సంవత్సరం ఇతని కొడుకు చనిపోయాడు కదా, అప్పుడు ఇతను, తనకి చాల దుఃఖం కలిగిందని, మానసికంగా ఎంతో అనుభవించవలసి వచ్చిందని అన్నాడు. దానివలన నాకు ఇది తెలుసుకోవాలని అనిపిస్తోంది- పూర్వ జన్మలో ఏం చేసివుండవచ్చు ఇప్పుడిలా జరగటానికి?

**దాదాశ్రీ :** అసలేమిటంటే, ఎవరి ఖాతాలో ఎంత ఉంటుందో వాళ్ళు అంతే మన వెంట వస్తుంది. తర్వాత ఆ లెక్క పూర్తవగానే మన బైఖాతా లోంచి వెళ్ళిపోతుంది. దాని నియమం అంతే.

**ప్రశ్నకర్త :** పిల్లలు పుట్టిన తర్వాత వెంటనే చనిపోతే, అతనితో ఇచ్చిపుచ్చుకునే లెక్క అంతేనా?

**దాదాశ్రీ :** తల్లిదండ్రులతో రాగద్వేషాల లెక్క ఎంత ఉందో, అది పూర్తయిపోయింది. ఫలితంగా తల్లిదండ్రులను ఏడిపించి వెళ్ళిపోతాడు. బాగా ఏడిపిస్తాడు. తల కూడా బద్దలు కొట్టుకునేటట్టు చేస్తాడు. కొడుకు డాక్టర్ ఖర్చుని కూడా చెల్లింపజేస్తాడు. అంతా చేయించి వెళ్ళిపోతాడు.

పిల్లలు చనిపోయిన తర్వాత వాళ్ళ గురించి చింతించటం వలన ఆ దు:ఖాన్ని భరించవలసివస్తుంది. మనవాళ్ళు అజ్ఞానంతోనే అదంతా చేస్తారు. అందుకే మీరు యదార్థమేమిటి అన్నది తెలుసుకుని శాంతంగా ఉండాలి. అనవసరంగా తలబాదుకోవటంలో అర్థమేమిటి? పిల్లలు ఎక్కడ మరణించరు? ఇది ప్రాపంచిక ఋణానుబంధం. ఖాతాలోని ఇచ్చిపుచ్చుకునే వ్యవహారం. నాకు కూడా కొడుకూ కూతురూ ఉండేవారు. వాళ్ళు చనిపోయారు. అతిథులు వచ్చారు, అతిథులు వెళ్ళిపోయారు. వాళ్ళు మనవాళ్ళెక్కడి నుంచి అయ్యారు? మనం మాత్రం ఒక రోజు వెళ్ళిపోమా? మనం జీవించివున్నవాళ్ళకి శాంతినివ్వాలి. వెళ్ళిపోయినవారు వెళ్ళిపోయారు. వాళ్ళని గుర్తు చేసుకోవటం కూడా మానెయ్యి. ఇక్కడ ఇంకా జీవించి ఉన్నవాళ్ళు, మన మీద ఆధారపడి బ్రతుకుతున్నవాళ్ళకి శాంతిని కలుగజేయి. అంతవరకే మన బాధ్యత. వీళ్ళు పోయినవాళ్ళని గుర్తుచేసుకుంటూవుంటారు. ఇక్కడ ఉన్నవాళ్ళని ప్రశాంతంగా జీవించనివ్వరు. అదేమి పని? అంటే, మీరంతా మీ బాధ్యతలను మర్చిపోతున్నారు. మీకు అలా అనిపిస్తోందా? పోయినవాళ్ళు పోయారు. జేబులోంచి ఒక లక్ష రూపాయలు ఎక్కడో పడిపోయాయి, మళ్ళీ చేతికి చిక్కలేదు. అప్పుడు మనమేం చెయ్యాలి? తలబాదుకోవాలా ఏమిటి?

**ప్రశ్నకర్త :** దాన్ని మర్చిపోవాలి.

**దాదాశ్రీ :** ఔను. కనుక, అదంతా అర్థం చేసుకోకపోవటం. వాస్తవానికి ఎవరూ తండ్రి కొడుకులు కారు. కొడుకు చనిపోతే చింతించవలసిన పనే లేదు. నిజానికి ఈ ప్రపంచంలో చింతించవలసిన అవసరం ఏమైనా ఉంటే అది తల్లిదండ్రుల మరణం. అప్పుడు మనసులో బాధపడాలి. కొడుకు చనిపోతే కొడుకుతో మనకి

పనేముంది? తల్లిదండ్రులైతే మనకి ఉపకారం చేసారు. తల్లి మనలను తొమ్మిది నెలలు కడుపులో పెట్టుకుంది, ఆ తర్వాత పెద్ద చేసింది. తండ్రి చదువు కోసం ఫీజు కట్టాడు, ఇంకా ఎంతో చేసాడు.

నా మాటలు మీకు అర్థమౌతున్నాయా? అందువలన ఎప్పుడైనా గుర్తుకొస్తే, 'హే దాదా భగవాన్, ఈ కొడుకుని మీకు అప్పగించాను' అని అనుకోండి. మీరు సమాధానపడతారు. మీ కొడుకుని గుర్తుచేసుకుని, అతని ఆత్మకి మేలు జరగాలని మనసులో తలచుకోండి కాని, కళ్ళల్లో నీరు రానివ్వకండి. మీరు జైన్ థీరీ (సిద్ధాంతం) ని అర్థం చేసుకునే వ్యక్తి. మీకు తెలుసుకదా, ఎవరైనా మరణించిన తర్వాత, 'వాళ్ళ ఆత్మకి మేలు కలగాలి. హే కృపాలు దేవా, అతని ఆత్మకి మేలు చెయ్యి' అనే భావనలో ఉండాలి. అలా కాకుండా మనం మనసులో ఢీలాపడిపోవటం సరి కాదు. మన స్వజనులకు దు:ఖాన్ని కలిగించటం మన పని కాదు. మీరు అంతా అర్థం చేసుకోగలరు, బాగా ఆలోచించగలరు, సంస్కారవంతులు కనుక, ఎప్పుడెప్పుడు చనిపోయిన కుమారుడు గుర్తుకి వచ్చినా, 'అతని ఆత్మకి మేలు కలిగించు. హే వీతరాగ భగవాన్, అతని ఆత్మకి మేలు కలిగించు' అని అనుకోండి. అలా అనుకుంటూనేవుండండి. కృపాలదేవుని పేరెత్తి, దాదా భగవాన్ అని తలచుకుంటే మీ పని నెరవేరుతుంది. ఎందుకంటే, కృపాలదేవ్, దాదా భగవాన్, ఇద్దరూ ఆత్మస్వరూపులుగా ఒకరే. భౌతికంగా వేరువేరుగా కనిపిస్తారు. కళ్ళకి వేరువేరుగా కనిపిస్తారు కానీ వాస్తవానికి ఒకరే. అందువలన మహవీర్ భగవాన్ పేరు ఎత్తినా అంతే. 'అతని ఆత్మకి మేలు కలిగించు' మనం నిరంతరం ఉంచుకోవలసిన భావన అదే. మనం దేనితోనైతే నిరంతరం ఉంటూ, కలిసి తింటామో, వాళ్ళకి ఏ విధంగానైనా మంచి జరగాలనే భావనలోనే ఉండాలి. మనం ఇతరుల గురించి కూడా మంచి భావనతోనే ఉంటాము కదా, వీళ్ళయితే మనవాళ్ళు అయినప్పుడు వాళ్ళ గురించి మంచి భావనలో ఎందుకు ఉండగూడదు?

నేను పుస్తకంలో రాసాను, కల్పం ఆఖరివరకు నువ్విలా తిరుగుతూవుండాల్సి వస్తుంది అని. దాని పేరు 'కల్పాంతం'. కల్పాంతమన్నదానికి అర్థం ఎవరైనా చెప్పారా, లేదు కదా? మీరు ఈ రోజు మొదటిసారిగా వింటున్నారు కదా?

**ప్రశ్నకర్త :** ఔను. మొదటిసారి వింటున్నాం.

**దాదాశ్రీ :** కనుక, ఈ కల్పం చివరి వరకూ అలా దారితప్పి తిరుగుతూనే ఉండాల్సివస్తుంది. మనుషులేం చేస్తారు మరి? చాల కల్పాంతం చేస్తుంటారు. అరె, భాయ్, కల్పాంతం అంటే అర్థం ఏమిటని అడిగితే బాగానే ఉంది కాని, ఈ కల్పాంతం ఏమిటి? కల్పాంతాన్ని ఒకరిద్దరు మనుషులే చేస్తారు. కల్పాంతం ఎవరికైనా ఏకైక పుత్రుడు అయ్యుండి, అకస్మాత్తుగా చనిపోతే కల్పాంతం అయిపోతుంది.

**ప్రశ్నకర్త :** దాదాజీకి పిల్లలు ఎంతమంది?

**దాదాశ్రీ :** ఒక అబ్బాయి, ఒక అమ్మాయి ఉండేవారు. 1928లో పుత్రుడు జన్మించాడు, నేను అప్పుడు మిత్రులకు పేడా (మిఠాయి) తినిపించాను. తర్వాత 1931లో చనిపోయాడు. అప్పుడు నేను మళ్ళీ అందరికీ పేడా తినిపించాను. ముందు అందరూ మళ్ళీ కొడుకు పుట్టాడేమోనని అనుకున్నారు. పేడా పంచినపుడు నేను స్పష్టీకరణం చేయలేదు. మిఠాయి పంచిన తర్వాత చెప్పాను, 'ఆ గెస్ట్ వచ్చాడే అతను వెళ్ళిపోయాడు' అని. వాళ్ళు గౌరవంగా వచ్చారు, మనం వాళ్ళని గౌరవంగానే సాగనంపాలి. అందుకే వాళ్ళకి గౌరవమిచ్చాను. అది విని అంతా నన్ను తిట్టారు. అరె, తిట్టకండి. మర్యాదపూర్వకంగా పంపించేయాలి కదా.

తర్వాత కూతురు పుట్టింది. ఆమెని కూడా గౌరవంగా ఆహ్వానించాను, గౌరవంగానే పంపించేసాను. ఈ ప్రపంచంలోకి ఎవరైతే వస్తారో, వాళ్ళంతా వెళ్ళిపోతారు. ఆ తర్వాత మరెవరూ ఇంటికి రాలేదు. నేను, హీరాబా (దాదాజీ ధర్మపత్ని) ఇద్దరమే ఉన్నాం.

(1958లో) జ్ఞానోదయం కలగటానికి ముందు హీరాబా, 'పిల్లలు చనిపోయారు కదా, మనం ఇప్పుడేం చెయ్యాలి? వృద్ధాప్యంలో మనకి సేవ ఎవరు చేస్తారు?' అన్నది. ఆమెకి వేదన కలిగింది! వేదన కలగదా మరి? అప్పుడు నేను ఆమెతో, 'ఈ కాలపు పిల్లలు నిన్ను వేధిస్తారు. అప్పుడు బాగుండదు కదా?' అంటే, 'లేదు అలా ఉంటే బాగుండదు' అంది. 'వాళ్ళు వచ్చారు, పోయారు కనుకనే పేడా పంచిపెట్టాను. ఆ తర్వాత ఆమెకి అనుభవంలోకి వచ్చిన తర్వాత నాతో, 'అందరి

పిల్లలూ చాల సతాయిస్తుంటారు' అనటం మొదలుపెట్టింది. అప్పుడు నేను, 'నేను ముందు నుంచి చెప్తూనేవున్నాను. కానీ మీరే ఒప్పులేదు' అన్నాను.

పరాయివాళ్ళు ఎప్పటికైనా మనవాళ్ళవుతారా? అనవసరంగా అయ్యో అయ్యో అని బాధపడటం. ఈ శరీరం పరాయిది. ఈ శరీరానికే వాళ్ళు సంబంధం కలిగివుంటారు! ఈ దేహమే పరాయిది, పరాయి దేహానికి చెందిందే ఆ సంపదంతా. మనది ఎప్పటికైనా అవుతుందా?

**ప్రశ్నకర్త :** ఏం చేస్తారు మరి, ఏకైక కుమారుడు. వాడు మమ్మల్ని విడిచి పోయాడు.

**దాదాశ్రీ :** ముగ్గురైనా సరే విడిచి వెళ్ళిపోతారు. వాళ్ళు వదిలిపోకపేతే మనం పోవలసివుంటుంది. అందరితోనూ కలిసివున్నప్పటికీ, ఒక రోజు అంతా వదిలేసి వెళ్ళిపోవలసివుంటుంది. వదిలిపెట్టి పోవలసిరాదా? మరి ఎందుకు విచారించటం? పోయిన జన్మలోని పిల్లలు ఎక్కడికి పోయారు? పోయిన జన్మలోని పిల్లలు ఎక్కడుంటారు?

**ప్రశ్నకర్త :** దేవుడికే తెలియాలి అది!

**దాదాశ్రీ :** చూడు! పోయిన జన్మలోని పిల్లల సంగతే తెలియదు కానీ, ఈ జన్మలోని పిల్లల కోసం ఇలా అయ్యారు. వీటన్నిటికి సమాధానం ఎప్పుడు వస్తుంది? మోక్షానికి పోయే విషయం మాట్లాడండి. లేకపోతే అనవసరంగా అధోగతికి పోతారు. వేదనలతో విసుగుచెందినపుడు అతని గతేమౌతుంది? ఇక్కడి నుండి మనిషి జన్మ నుంచి మరే జన్మలోకి వెళ్తాడు? జంతు జన్మ కాని లేకపోతే చాల నిందనీయమైన పని చేసుంటే నరకంలోకి కూడా పోవలసివుంటుంది. నరకగతి, పశుగతి మీకు ఇష్టమేనా?

ఒక్కో జన్మలో భయంకరంగా దెబ్బతిని ఉన్నారు. కానీ పాత జన్మలోని దెబ్బలను మరచిపోయి, కొత్తగా మళ్ళీ దెబ్బతింటారు. పూర్వజన్మలో పిల్లలను వదిలేసి వస్తాడు, ఈ జన్మలో పిల్లలను దగ్గరకు తీసుకుంటాడు.

## 14. సంబంధం రిలేటివా లేక రియలా?

ఇది రిలేటివ్ సంబంధం. అతి జాగ్రత్తగా పని జరిపించుకోవాలి. ఇది రిలేటివ్ సంబంధం కనుక మీరు ఎంత రిలేటివ్‌గా ఉంచుకుంటే అంత ఉంటుంది. మీరు ఎలా పెట్టుకుంటే అలా ఉంటుంది. దాని పేరే వ్యవహారం.

కొడుకు నావాడు అని మీరు అనుకుంటారు. ఇక ఎక్కడికి పోతాడు? అరె, మీ కొడుకే కానీ, క్షణంలో విరోధి అయిపోతాడు. ఏ ఆత్మ కూడా తండ్రి లేక కొడుకు అవదు. ఇది పరస్పరం ఇచ్చిపుచ్చుకోవలసిన వ్యవహారం. ఇంటికి పోయి నువ్వు నా తండ్రివి కావు అని అనకండి. వ్యావహారికంగానైతే అతను మీ తండ్రే కదా!

ప్రపంచంలో డ్రామేటిక్‌గా ఉండాల్సివుంటుంది. ‘అక్కా రాండి, అమ్మాయీ రా అంటూ సూపర్‌ఫ్లువస్ (పైపైకి) అనాల్సివుంటుంది. అప్పుడు అజ్ఞాని ఏం చేస్తాడు? కొడుకుని ఒళ్ళో కూర్చోబెట్టుకుంటాడు, కూతురు అది చూసి సహించదు. కానీ జ్ఞానిపురుష్ వ్యవహారంలో సూపర్‌ఫ్లువస్‌గా ఉంటారు. అందుకే అందరూ అతన్ని చూసి సంతోషపడుతుంటారు. ఎందుకంటే, లోకులు సూపర్‌ఫ్లువస్ వ్యవహారాన్ని కోరుకుంటారు. ఎక్కువ ఆసక్తి మనుషులకు ఇష్టం ఉండదు. అందువలన మనం కూడా సూపర్‌ఫ్లువస్‌గా ఉండాలి. మనం జంఝాటంలో పడవద్దు.

జ్ఞాని ఏమని తలుస్తాడు? కూతురు పెళ్ళి జరిగిపోయింది. అదీ వ్యవహారమే, కూతురు పాపం విధవరాలయింది. అదీ వ్యవహారమే. ఇది ‘రియల్’ కాదు. ఆ రెండూ వ్యవహారమే. రిలేటివ్ మాత్రమే కాదు మార్చలేనిది కూడా. ఇక వీళ్ళు ఏం చేస్తారు? అల్లుడు చనిపోతే అతని వెనక తల బాదుకుంటారు. ఇక డాక్టర్‌ని పిలిపించాల్సివస్తుంది, అతను రాగద్వేషాల ఆధీనంలో ఉన్నాడు కదా! వ్యవహారం వ్యవహారమే. మీకు అర్థం కాలేదు అందుకే ఇదంతా.

కొడుకుని గద్దించవలసివచ్చి, భార్యను రెండు మాటలు అనవలసివస్తే, నాటకీయ భాషలో నెమ్మదిగా ఉంటూనే కోపాన్ని ప్రదర్శించాలి. నాటకీయ భాష అంటే ఏమిటి? మెదడుని ప్రశాంతంగా పెట్టుకునే కోపం చూపించటం. దాన్నే నాటకం అంటారు!

# 15. అది ఇచ్చిపుచ్చుకునే వ్యవహారమే కాని సంబంధం కాదు

భార్యా-పిల్లలు నిజంగా మనవాళ్ళే అయ్యుంటే, ఈ శరీరానికి ఎంత బాధ కలుగుతుందో అందులో కొంత వైఫ్ తీసేసుకోగలుగుతుంది- అర్ధాంగిని అంటారు కదా! పక్షపాతం వస్తే కొడుకు దాన్ని తీసుకుంటాడా? లేదు కదా, ఎవ్వరూ తీసుకోలేరు. ఇదంతా ఒక లెక్క. తండ్రి దగ్గరి నుంచి ఎంత అడిగి తీసుకోవాలని లెక్కలో ఉందో, మీకు అంతే దొరుకుతుంది.

ఒక కొడుకుని అతని తల్లి, ఏ తప్పు చేయకపోయినా సరే కొడుతూ వుంటుంది. మరోపక్క ఒక మరో కొడుకు పేచీలు పెడుతుంటాడు కానీ అతన్ని గారాబం చేస్తుంది. ఐదుగురు కొడుకులూ ఆ తల్లి బిడ్డలే కాని, వాళ్ళ పట్ల ఆమె ప్రవర్తన వేరు వేరుగా ఉంటుంది. ఏమిటి దానికి కారణం?

**ప్రశ్నకర్త :** వాళ్ళ కర్మ ఫలాలు వేరువారుగా ఉండవచ్చునేమో?

**దాదాశ్రీ :** ఆ లెక్క కూడా తీర్చుకుంటున్నారు. కొడుకులందరి మీద తల్లి సమాన భావం కలిగివుండాలి. కాని అది ఎలా జరుగుతుంది? మా అమ్మ వీడి వైపు మాట్లాడుతుంది అని కొడుకులు అంటారు. అలా అని గగ్గోలు పెడతారు. ఈ ప్రపంచంలో ఉండేవి ఇలాంటి జగడాలే.

**ప్రశ్నకర్త :** అయితే మరి ఆ అబ్బాయి పట్ల తల్లికి అలా వైర భావం ఎందుకు కలుగుతుంది?

**దాదాశ్రీ :** అది పూర్వజన్మలోని వైరం. ఇతర పిల్లల పట్ల పూర్వజన్మలోని రాగం. అందువలనే రాగం చూపిస్తుంది. ఆమెకి కొడుకులంతా సమానంగా ఎందుకు లేరు అని మనుషులు అందులో న్యాయాన్ని శోధిస్తుంటారు.

కొందరు పిల్లలు తల్లిదండ్రులకు సేవచేస్తుంటారు. అలా చేసే సేవలో తాము తినటం కూడా మర్చిపోతుంటారు. అందరూ అలా ఉండరు. మనకి ఏదైతే లభిస్తుందో

అదంతా మన ఖాతాలో ఉన్నదే. మన పాపల కారణంగా మనం ఒక దగ్గర కూడాము. ఈ కలియుగంలో మనం ఎందుకు వచ్చాము? సత్యయుగం లేదా? సత్యయుగంలో అందరూ మంచివాళ్ళే. కలియుగంలో అందరూ వంకరవాళ్ళే కలిసి వస్తారు. కొడుకు మంచివాడైతే వియ్యంకుడు వంకరవాడౌతాడు, అతను గొడవలు పెడుతుంటాడు. కోడలు జగడాలమారి అవుతుంది. జగడాలు పెడుతూనేవుంటుంది. జగడాలు జరుగుతుండటానికి అలా ఎవరో ఒకరుంటారు ఇంట్లో.

**ప్రశ్నకర్త :** 'మొక్కలలో కూడా ప్రాణం ఉంటుంది' అంటారు. మరి మామిడి చెట్టుంటే, దాని మీద ఎన్ని మామిడి కాయలున్నాయో, వాటన్నిటి రుచి ఒకేలా ఉంటుంది. కానీ ఈ మనుషులలో ఐదుగురు సంతానం ఉంటే, వాళ్ళ ఆలోచన, మాటలు, ప్రవర్తన వేరువేరుగా ఉంటుంది ఎందుకని?

**దాదాశ్రీ :** మామిడి పండ్లలో కూడా వేరు వేరు రుచులుంటాయి. వాటిని అర్థం చేసుకునే శక్తి మీకు లేదు కానీ ప్రతి మామిడి పండు రుచి భిన్నంగా ఉంటుంది, ఆకులు కూడా వేరు వేరుగా ఉంటాయి. ఒక్కలా కనిపిస్తాయి, ఒకే వాసన ఉన్నట్లు అనిపిస్తుంది. కానీ ఏదో ఒక తేడా ఉంటుంది. ఎందుకంటే, 'స్పేస్' (జాగా) మారితే ఈ లోకం నియమం ప్రకారం తేడా ఉంటుంది.

**ప్రశ్నకర్త :** వంశపారంపర్యంగానే ఈ మనుషులు కలుస్తుంటారని సామాన్యంగా అందరూ అంటూవుంటారు.

**దాదాశ్రీ :** ఔను. వాళ్ళంతా మనకి తెలిసినవాళ్ళే అయ్యుంటారు. మన సర్కిల్‌లోని వాళ్ళే. మనతోపాటు జీవించినవాళ్ళే. ఒకే గుణం కలిగినవాళ్ళే. అందుకే రాగద్వేషాల కారణంగా ఒక దగ్గర జన్మిస్తారు, తమ తమ లెక్కలు తీర్చుకోవటానికే ఒక దగ్గర కూడుతారు. వాస్తవానికి చూడటానికి అలా కనిపిస్తారు కానీ అంతా భ్రాంతి. జ్ఞానంతో చూస్తే అలా ఉండదు.

**ప్రశ్నకర్త :** జన్మ తీసుకునేవాళ్ళు తమ కర్మల వలనే జన్మతీసుకుంటారు కదా.

**దాదాశ్రీ :** తప్పకుండా. తెల్లగా ఉన్నా, నల్లగా ఉన్నా, పొట్టిగా ఉన్నా, పొడుగ్గా ఉన్నా, అదంతా వాళ్ళ వాళ్ళ కర్మలనుబట్టే. దీన్ని అంతా తమ కళ్ళతో చూసినప్పుడు, కొడుకు ముక్కు తండ్రి ముక్కులాగే వచ్చింది కాబట్టి గుణాలు కూడా అలాగే కలుస్తాయని అనుకుంటారు. అలా అయితే తండ్రి కృష్ణ భగవానుడైతే కొడకు కూడా కృష్ణ భగవానుడౌతాడా? అలా అయితే ఎందరో కృష్ణ భగవానులు పుట్టుండేవారు. పుట్టిన ప్రతివాడూ కృష్ణ భగవానుడే అనిపించుకుంటాడు. కానీ ఆయన పుత్రులు ఎవరైనా కృష్ణ భగవానుడయ్యారా? కనుక ఇవన్నీ అజ్ఞానపు మాటలే.

ఒకవేళ తండ్రి గుణాలు కొడుకుకి వచ్చేటట్లయితే, కొడుకులందరికీ సమానంగా రావాలి. కానీ వీళ్ళలో తండ్రికి పూర్వజన్మలో పరిచయస్తులు ఎవరైతే ఉన్నారో, వాళ్ళ గుణాలే వస్తాయి. మీకు తెలిసినవాళ్ళంతా ఎలా ఉంటారు? మీ గుణాలతో కలుస్తారు. వాళ్ళు తిరిగి ఈ జన్మలో మీ కొడుకులు అవుతారు. అంటే, వాళ్ళ గుణం మీతో కలుస్తుంది కానీ, నిజానికి వాళ్ళు తమ గుణాలనే పుణికిపుచ్చుకుని వస్తారు. సైంటిస్ట్ (వైజ్ఞానికుల)కు, గుణాలు పరమాణువుల వలన వస్తాయని అనిపిస్తుంది. కాని, వాళ్ళ గుణాలను వాళ్ళే తెచ్చుకుంటారు. ఎవరైనా చెడ్డవాళ్ళు, పనికిరానివాళ్ళుంటే, తాగుబోతులు కూడా అవుతారు. ఎందుకంటే, వాళ్ళు ఎలాంటి సందర్భాలను పోగుచేసుకున్నారో, అలాగే ఔతుంది. ఎవరికీ వంశపారంపర్యంగా ఏదీ రాదు. వంశపారంపర్యమనేది కేవలం పైకి కనిపించేదే అన్నమాట. ఇకపోతే పూర్వజన్మలో వాళ్ళ పరిచయస్తులే తిరిగి వచ్చారు.

**ప్రశ్నకర్త:** అంటే దాని అర్థం లెక్కలు తీర్చుకోవటం ఋణానుబంధాలను నెరవేర్చుకోవటం జరిగిన తర్వాత అంతా పూర్తయిపోతుందా?

**దాదాశ్రీ :** ఔను అవన్నీ తీరిపోతాయి. అందుకే నేను ఇక్కడ ఈ విజ్ఞానాన్ని తెరవాల్సివచ్చింది, అరె, అందులో తండ్రి తప్పేముంది? నీవు కోపిష్టివి, నీ తండ్రి కోపిష్టి. కానీ నీ తమ్ముడు శాంతమూర్తి ఎందుకని? మీలో మీ తండ్రి గుణాలే ఉత్పన్నమైతే, మీ ఈ తమ్ముడు ఎందుకలా శాంతంగా ఉంటాడు? ఇది అర్థం చేసుకోక జనం అనవసరంగా గొడవపడతారు, పైకి కనిపించేదాన్నే సత్యమని

అనుకుంటారు. ఈ విషయాన్ని లోతుగా అర్థం చేసుకోవలసివుంది. నేను చెప్పినంత వరకే కాదు. ఇది ఇంకా లోతైన విషయం. లెక్క ప్రకారమే వస్తారు, తీర్చుకుని పోతారు.

ఆత్మ ఎవరికీ కొడుకు కాదు, ఎవరికీ తండ్రి కాదు. ఆత్మ ఎవరి భార్య కాదు, ఎవరికీ భర్త కాదు. ఇదంతా ఋణానుబంధం. కర్మ ఫలంగా ఒక చోట కూడారు. ఇప్పుడు (ఈ జన్మలో) మనుషులకు ఇది అర్థమౌతోంది. నాకు కూడా అలాగే అర్థమయింది కానీ, ఇది కేవలం అర్థమవటం మాత్రమే. నిజానికి దృశ్యమానం కూడా కాదు. వాస్తవం అయినట్లయితే ఎవరూ గొడవలేపడరు. ఒక గంటలోనే అంతా తారుమారు అవుతుంది. అభిప్రాయ భేదాలు వచ్చేస్తాయి. అలాంటప్పుడు మరి దెబ్బలాడుతారా దెబ్బలాడరా? నువ్వా నేనా అనుకుంటారు కదా, అలా అవదా?

**ప్రశ్నకర్త :** ఔతుంది.

**దాదాశ్రీ :** అందుకే అది కేవలం అనిపిస్తుంది అంతే కాని 'ఎగ్జాక్ట్' (వాస్తవం) కాదు. కలియుగంలో ఏమీ ఆశించవద్దు. కలియుగంలో ఆత్మకి మేలు జరిగితే చాలు. లేకపోతే చాల విచిత్రమైనా సమయం వస్తోంది. రాబోయేది భయంకరమైన విచిత్ర సమయం. ఇప్పటి నుంచి ఒక వెయ్యి సంవత్సరాలు బాగానే ఉంటాయి. కానీ, ఆ తర్వాత భయంకరమైన రోజులు వస్తాయి. ఇక అవకాశం ఎక్కడ దొరుకుతుంది? అందువలన మనం ఆత్మ ఉన్నతి కోసం ఏమైనా చేయాలి.

# తల్లిదండ్రుల పట్ల పిల్లల వ్యవహారం

## (ఉత్తర భాగం)

## 16. 'టీనేజర్స్' (యువత) తో 'దాదాజీ'

**ప్రశ్నకర్త :** ఆదర్శ విద్యార్థుల జీవితంలో ఉండవలసిన లక్షణాలు ఏమిటి?

**దాదాశ్రీ :** ఇంట్లో ఎంతమంది వ్యక్తులుంటారో వాళ్ళందరినీ ఆనందంగా ఉంచవలసిన అవసరం విద్యార్థులకు ఉంటుంది. ఆలాగే, స్కూల్‌లో ఎంతమందితో కలిసి ఉంటారో, మీ టీచర్లు ఎవరైతే ఉంటారో, వాళ్ళందరినీ సంతోషపెట్టటం అవసరం. మనం ఎక్కడికి వెళ్తే అక్కడ అందరినీ సంతోషపెట్టాలి, చదువులో కూడా ధ్యాస పెట్టుకోవాలి.

**దాదాశ్రీ :** మీరు ఎప్పుడైనా ఏ ప్రాణులనైనా చంపారా?

**ప్రశ్నకర్త :** ఆ.

**దాదాశ్రీ :** ఎక్కడ చంపారు?

**ప్రశ్నకర్త :** తోటలో, ఇంటి వెనక పెరట్లో.

**దాదాశ్రీ :** ఏ జంతువది? బొదింక అలాంటిదా?

**ప్రశ్నకర్త :** అన్నిటినీ చంపేసాను.

**దాదాశ్రీ :** మనిషి పిల్లలను కూడా చంపేసారా?

**ప్రశ్నకర్త :** లేదు.

**దాదాశ్రీ :** ఎవరి పిల్లలనూ చంపరా? ఎవరి పిల్లయినట్లయితే చంపలేరా?

**ప్రశ్నకర్త :** లేదు.

**దాదాశ్రీ :** ఎందుకు? నువ్వు ఏ ప్రాణినైతే చంపావో, అలాంటిది నువ్వు ఒకదాన్ని తయారుచేసి చూపించగలవా? లక్ష రూపాయల బహుమతి ఇస్తాను ఒకవేళ ఎవరైనా ఒక్క జీవిని తయారు చేసి చూపిస్తే, వాళ్ళకి లక్ష రూపాయలు బహుమానం ఇస్తాను. నువ్వు తయారు చేస్తావా? చెయ్యలేవు కదా?

**ప్రశ్నకర్త :** లేదు.

**దాదాశ్రీ :** మరి అలాంటప్పుడు ఎలా చంపగలం? ఈ ప్రపంచంలో ఎవరైనా ఏ ఒక్క జీవినైనా తయారుచేయగలరా? ఈ సైంటిస్ట్‌లు తయారు చేస్తారా?

**ప్రశ్నకర్త :** లేదు.

**దాదాశ్రీ :** మరి దేన్నయితే తయారుచేయలేరో, దాన్ని చంప గూడదు కూడా. ఈ కుర్చీని తయారుచేయవచ్చు. ఈ వస్తువులన్నిటినీ తయారుచేయవచ్చు. వీటిని నాశనం చెయ్యవచ్చు. నీకు అర్థమౌతోందా?

**ప్రశ్నకర్త :** ఆ.

**దాదాశ్రీ :** ఇప్పుడు ఏం చేస్తావు?

**ప్రశ్నకర్త :** దేన్నీ చంపను.

**దాదాశ్రీ :** ఆ జీవికి ప్రాణ భయం ఉంటుందా? మనం చంపటానికి పోతే అది పారిపోతుంటుందా?

**ప్రశ్నకర్త :** ఔను.

**దాదాశ్రీ :** మరి ఎలా చంపగలవు? ఈ గోధుమలు, జొన్నలు వీటికి భయమనేది ఉండదు. వాటికి ఏం పరవాలేదు. గోధుమలు, జొన్నలు, కందులు ఇవి పారిపోతాయా? మనం చాకు తీసుకుని వెంటబడితే కందులు పారిపోతాయా?

**ప్రశ్నకర్త :** లేదు.

**దాదాశ్రీ :** కనుక, వాటిని వండుకుని తినవచ్చు. నీకు ప్రాణ భయం ఉంటుందా లేదా?

**ప్రశ్నకర్త :** ఉంటుంది.

**దాదాశ్రీ :** ఆ. అలాగే దానికి కూడా ఉంటుంది.

*అణ్‌హక్* (హక్కు లేనిది) చాల లోతైన గొయ్యి. అందులోంచి బయటకు రాలేరు. అందుకే జాగ్రత్తగా చూసుకుంటూ నడవాల్సివుంటుంది. అందుకే నువ్వు జాగ్రత్తగా ఉండు. ఇప్పుడు యుక్త వయసు. ముసలితనం వచ్చేవారికి నేను ఏమీ చెప్పను. ఈ భయం సిగ్నల్ నీకే చూపిస్తాను.

**ప్రశ్నకర్త :** ఔనౌను. పరాయివాని భార్యను నేను తీసుకెళ్ళను.

**దాదాశ్రీ :** ఔను. తీసుకెళ్ళాలనే ఆలోచనే వద్దు. పరాయి స్త్రీ మీద ఆకర్షణ కలిగితేనే, 'హే దాదా భగవాన్, నన్ను క్షమించండి' అనాలి.

తల్లిదండ్రులు ఏం చెయ్యాలి? పిల్లలు గౌరవం కోసం బయట వెతుక్కోగూడదు, అలా పెంచాలి. వాళ్ళు గౌరవమర్యాదల ఆకలితో లేరు బయట గౌరవమర్యాదల హోటల్‌కి వెళ్ళి భోజనం చేసి రావటానికి. దానికోసం ఏం చెయ్యాలి? ఇంటికి వచ్చినపుడు, 'నాయనా నువ్వు చాల తెలివైనవాడవు, అలా ఇలా' అని అనాలి. అతనికి కాస్త గౌరవం ఇవ్వాలి. అంటే, అతనితో ఫ్రెండ్‌షిప్ (స్నేహం) చేస్తున్నట్లుగా ఉండాలి. దగ్గర కూర్చోబెట్టుకుని తల మీద నిమురుతూ, 'బాబూ రా మనం ఏమైనా

తిందాం' అనాలి. అలా చేస్తే వాళ్ళు బయట ప్రేమ కోసం వెతుక్కోరు. నేను ఐదు సంవత్సరాల పిల్లవాడితో కూడా ప్రేమగా ఉంటాను. అతనితో ఫ్రెండ్‌షిప్ చేస్తాను.

**ప్రశ్నకర్త :** నాన్నకాని లేక అమ్మ కాని, కోప్పడితే నేను ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** 'జయ్ సచ్చిదానంద, జయ్ సచ్చిదానంద' అనాలి. అలా అంటే వాళ్ళు శాంతపడతారు.

తండ్రితల్లితో గొడవపడుతుంటే పిల్లలు, 'సచ్చిదానంద, సచ్చిదానంద' అంటే అంతా ఆగిపోతుంది. ఇద్దరూ పాపం సిగ్గుపడిపోతారు. భయమనే అలార్మ్‌ని లాగితే వెంటనే ఆగిపోతుంది.

ఇక ఇంట్లో ఉన్నవాళ్ళందరికీ నీ వలన సంతోషం కలిగేటట్లుగా ఉండాలి. వాళ్ళ వలన నీకేమైనా బాధ కలుగుతుంటే దాన్ని సమభావంతో స్వీకరించాలి, నీ వలన వాళ్ళందరికీ ఆనందం కలిగేటట్లుగా ఉండాలి. ఇక వాళ్ళ ప్రేమ చూడు ఎలా ఉంటుందో, ఏం ప్రేమ అది? ప్రేమని నువ్వే బ్రేక్‌డౌన్ (పగలగొట్టటం) చేస్తావు. వాళ్ళకి ప్రేమ ఉన్నా, నువ్వు దాని మీద రాయి వేస్తే అది పగిలిపోతుంది.

**ప్రశ్నకర్త :** ముసలివాళ్ళే ఎందుకు ఎక్కువగా కోపం తెచ్చుకుంటారు?

**దాదాశ్రీ :** బండి శిథిలమైపోతుంటే, బండి పాతపడిపోతుంటే, రోజూ వేడెక్కుతుంటుంది. కొత్త బండి అయితే అంతగా వేడెక్కదు. అందువలన ముసలివాళ్ళకి పాపం ఏమిటంటే.... (వయసు మీద పడేటప్పటికి కొత్త తరం వారితో అడ్జస్ట్ అవలేరు, దానితో ఘర్షణ జరుగుతుంది)

బండి వేడెక్కినపుడు మనం దాన్ని చల్లబరచవద్దా? బయట ఎవరితోనైనా ఘర్షణ జరిగితే, దారిలో పోలీసతనితో, అలాంటప్పుడు ముఖం ఇమోషనల్ (భావుకం) అవుతుంది. అప్పుడు ఆ ముఖం చూస్తే ఏమంటారు? 'నీ ముఖం ఎప్పుడూ మాడ్చుకునే వుంటావు, ఎప్పుడూ ముఖం వేలాడేసుకునివుంటావు.' కానీ అలా అనగూడదు. అతనేదో చికాకులో ఉన్నాడని మనం అర్థం చేసుకోవాలి. అందువలన మనం బండిని చల్లగా చెయ్యటానికి దాన్ని ఆపుతాము కదా?

పెద్దవాళ్ళకి సేవ చేయటం పరమ ధర్మం. యువకుల ధర్మమేమిటి? అంటే పెద్దలకు సేవచేయటం అంటాము. పాత బండిని తోసుకుంటూ పోవాలి. మనం ముసలివాళ్ళమైనపుడు మనకి సేవ చేసే యువత వస్తుంది. మనం వృద్ధులను విసుక్కుంటూవుంటే, మనలను విసుక్కునేవారు మనకి దొరుకుతారు. మీకు ఏది చెయ్యాలంటే అది చేసే స్వేచ్ఛ ఉంది.

## 17. భార్య ఎంపిక

తయారైన యోజనలో మార్పులేమీ జరగవు. పెళ్ళి కోసం యోజన జరిగిపోయింది. ఇప్పుడు పెళ్ళి చేసుకోను అని నిర్ణయం తీసుకోవటం అర్థరహితం. అందులో మీదేమీ నడవదు. పెళ్ళి చేసుకోవలసిందే.

**ప్రశ్నకర్త :** ఈ జన్మలో మనం చేసుకున్న సంకల్పం వచ్చే జన్మలో ఫలిస్తుంది కదా?

**దాదాశ్రీ :** ఔను. ఈ జన్మలో చేసుకున్న సంకల్పం వచ్చే జన్మలో ఫలిస్తుంది. కాని ఇప్పుడైతే దాన్నుంచి తప్పించుకోలేవు. వర్తమానంలో ఎవరిదీ నడవదు కదా! పెళ్ళి చేసుకోవద్దు అని భగవాన్ స్వయంగా అడ్డుకున్నా, భగవాన్‌ది కూడా అక్కడ ఏమీ చెల్లదు. పూర్వ జన్మలో పెళ్ళి చేసుకునే యోజనే చేసుకోకపోతే, పెళ్ళి చేసుకునే సందర్భమే రాదు. ఎటువంటి యోజన చేసుకుంటే అలాగే జరుగుతుంది.

మరుగుదొడ్డికి పోకుండా ఉండటం ఎవరికైనా ఎలాగైతే కుదరదో, అలాగే పెళ్ళి చేసుకోకుండా కూడా కుదరదు. మానసికంగా బ్రహ్మచారి అయినట్లయితే ఏం పర్వాలేదు. కానీ మానసికంగా వైవాహితులైతే, అలాంటప్పుడు వివాహం చేసుకోకుండా ఉండటం వీలుకాదు. పైగా ఎవరో ఒకరి తోడు లేకుండా మనిషి జీవించలేడు. కేవలం జ్ఞానిపురుష్ తప్ప. రెండవ మనిషి లేనప్పుడు కూడా. ఎందుకంటే అక్కడ స్వయంగా ఒంటరి (నిరాలంబ) స్థితిలో ఉంటారు కనుక జంటతో (అవలంబన) తో పని లేదు.

మనుషులు పాపం తోడు లేకుండా బ్రతకలేరు. ఇరవై లక్షల రూపాయల ఖరీదు చేసే బంగ్లా ఉండి, రాత్రికి ఒంటరిగా పడుకోమని అంటే? తోడు కావాలి. మనుషులకు తోడు అవసరం. అందుకే కదా పెళ్ళి చేసుకుంటారు! వివాహ వ్యవస్థ తప్పు కాదు. ఇది ప్రకృతి నియమమే.

అందువలన పెళ్ళి చేసుకునేందుకు సహజ ప్రయత్నం చేయాలి. మంచి చోట పెళ్ళి చేసుకోవాలని కోరుకోవాలి, ఆ స్టేషన్ వచ్చినపుడు దిగిపోవాలి. స్టేషన్ రాకముందే ఆరాటపడిపోతే ఏమన్నట్లు? నువ్వు ముందుగానే ఆరాటపడతావా?

**ప్రశ్నకర్త :** లేదు. స్టేషన్ వచ్చిన తర్వాతనే.

**దాదాశ్రీ :** ఔను. స్టేషన్‌కి మనతో పని, మనకి స్టేషన్‌తో పని. నాకు (దాదాజీకి) మాత్రమే స్టేషన్‌తో పనేమీ లేదు. స్టేషన్‌కి కూడా మన అవసరం ఉంటుందా లేదా?

**ప్రశ్నకర్త :** మీ సంఘంలోకి వచ్చే యువతీ యువకులలో ఎవరైనా పెళ్ళి చేసుకోను అంటే, వాళ్ళకి మీరు విడిగా కూర్చోబెట్టి ఏం ఉపదేశమిస్తారు?

**దాదాశ్రీ :** వాళ్ళతో ఒంటరిగా, పెళ్ళి చేసుకోండి అని చెప్తాను. బాబూ మీరు పెళ్ళి చేసుకుంటే కొందరైనా యువతులకు ఒక ఆశ్రయం దొరుకుతుంది. మీరు పెళ్ళి చేసుకుని ఇక్కడికి వచ్చినా నాకేమీ అభ్యంతరం లేదు. నా ఈ మోక్షమార్గం వైవాహితులకే. నేను వాళ్ళకి, పెళ్ళి చేసుకుంటే ఆడపిల్లలు తగ్గిపోతారు. ఇక్కడేమో పెళ్ళి చేసుకుంటే మోక్షం ఆగిపోతుందనేమీ లేదు.

కానీ వాళ్ళంతా విచారణలో తెలుసుకుందేమిటంటే, పెళ్ళి చేసుకుంటే చికాకులు ఎక్కువగా ఉంటాయని. వాళ్ళు అనేదేమిటంటే, 'మేము మా తల్లిదండ్రులు పొందే సుఖాన్ని (!) చూసాము. అందువలన ఆ సుఖం (!) మాకు నచ్చదు' అంటే, వాళ్ళే తల్లిదండ్రుల సౌఖ్యాన్ని ప్రమాణంగా తీసుకున్నారు. ఈ కాలంలో తల్లిదండ్రుల మధ్య జరిగే జగడాలను పిల్లలు చూసి, దానితో వాళ్ళు విసుగుచెందుతారు.

పిల్లవాడి మీద ఒత్తిడి చేయకండి. లేకుంటే మా నాన్నే చెడగొట్టాడని మీ తల మీద పడుతుందంతా. వాళ్ళకి నడపటం రాదు కనుక చెడగొట్టుకుంటారు, పేరు మీకొస్తుంది.

అతన్ని పిలిచి, 'నాకైతే పిల్ల నచ్చింది. ఇక నీకు నచ్చితే చెప్పు. నీకు నచ్చకపోతే మానేద్దాం' అని చెప్పండి. 'నాకు ఇష్టం లేదు' అని అతను అంటే, వదిలెయ్యండి. పిల్లవాడు ఇష్టపడటం అవసరం. లేకపోతే పిల్లవాడు కూడా విరోధి అవుతాడు.

**ప్రశ్నకర్త :** లవ్ మ్యారేజ్ పాపం అవుతుందా?

**దాదాశ్రీ :** లేదు. టెంపరరీ లవ్ మ్యారేజ్ అయితే పాపం అవుతుంది. పర్మనెంట్ లవ్ మ్యారేజ్ అయితే కాదు. అంటే, లైఫ్‌లాంగ్ లవ్‌మ్యారేజ్ అయితే పరవాలేదు. టెంపరరీ లవ్ మ్యారేజ్ అంటే ఒకటి రెండు సంవత్సరాలకి. పెళ్ళంటూ చేసుకుంటే ఒకరినే చేసుకోవాలి. భార్యని తప్ప మరెవరితోనూ ఎక్కువగా ఫ్రెండ్‌షిప్ చేయగూడదు. లేదంటే నరకంలోకి వెళ్ళవలసివుంటుంది.

ముందుగా తండ్రి, 'ఎందుకీ గొడవల్లో పడతావు' అని అన్నప్పుడు పిల్లవాడు నోటికి వచ్చినట్లు మాట్లాడాడు. దానితో తండ్రి, 'వాడికే అనుభవంలోకి వస్తుందిలే. మన అనుభవాన్ని ఉపయోగించుకోవటానికి సిద్ధంగాలేడు. వాడికే అనుభవంలోకి వస్తుంది' అనుకున్నాడు. అతను ఇతరులకు జరగటం చూసినప్పుడు తెలుస్తుంది. అప్పుడు పశ్చాత్తాపపడుతూ, నాన్నగారు చెప్పింది నిజమే, ఇదంతా అనవసరమైన గొడవే అనుకుంటాడు.

**ప్రశ్నకర్త :** మోహం, ప్రేమల మధ్య భేదం ఏమిటి?

**దాదాశ్రీ :** ఈ కీటకం ఉంది కదా! ఈ పురుగు దీపం వెనక మాడిపోతుంది. తన జీవితాన్ని అంతం చేసుకుంటుంది. దీన్ని 'మోహం' అంటారు. ప్రేమ శాశ్వతమైనది. అయినా అందులో కూడా కాస్తోకూస్తో ఆసక్తి అనేది ఉంటుంది. మోహం నిలవదు.

పన్నెండు నెలల వరకు ముఖం మీద చిన్న కురుపు వచ్చివున్నా సరే, ముఖాన్నే చూడరు. మోహం వీడిపోతుంది. నిజమైన ప్రేమ అంటూ వుంటే ఒక కురుపు ఏమిటి, రెండు కురుపులు అయినా ప్రేమ వీడిపోదు. కనుక, అటువంటి ప్రేమని వెతుక్కోవాలి. లేదంటే పెళ్ళే చేసుకోవద్దు. లేకుంటే ఇరుక్కుపోతావు. ఆమె ముఖం చిట్లించి, 'ఇతని ముఖమే చూడబుద్ధి కావటం లేదు' అంటుంది. చూసినప్పుడు బావుంది కనుక అప్పుడు మీకు నచ్చింది కాని ఇప్పుడు నచ్చలేదా? తియ్యగా మాట్లాడినంతవరకు బాగానే వుంటుంది. కాస్త కటువుగా మాట్లాడితే, 'నీతో నాకు నచ్చలేదు' అంటారు.

**ప్రశ్నకర్త :** డేటింగ్ మొదలైతే దాన్ని ఎలా ఆపాలి?

**దాదాశ్రీ :** ఆపివేయి. దాన్ని ఇక ఆపివేయాలి అని ఈ క్షణమే నిర్ణయించుకో. నువ్వు మోసపోతున్నావు అని అంటాను నేను. మోసపోవటం మానెయ్యి. ఇప్పటి నుంచి మోసంలో పడకుండా ఉండు. నువ్వు లేచినప్పుడే ఉదయించినట్లు. తప్పు జరుగుతోంది అని అర్థమైనపుడు దాన్ని నిలిపివేయాలి.

వైల్డ్ లైఫ్ (సంస్కారహీనమైన జీవనం) వద్దు. ఇండియన్ లైఫ్ (సంస్కార వంతమైన జీవితం) సాగించాలి.

మీరు బాగా నడుచుకుంటే మీ భార్య కూడా మంచిదే లభిస్తుంది. అదే 'వ్యవస్థితం', అదే ఎగ్జాక్ట్‌గా జరుగుతుంది.

**ప్రశ్నకర్త :** ఎలాంటి అమ్మాయైనా పర్వాలేదు. నేను కలర్ గిలర్ పట్టించుకోను. మంచి అమ్మాయి, అమెరికన్ అయినా, ఇండియన్ అయినా కూడా పర్వాలేదు.

**దాదాశ్రీ :** కాకపోతే, ఈ అమెరికన్ మామిడి పండ్లకి మన భారతీయ మామిడి పండ్లకి తేడా ఉంది. అది నీకు తెలియదా? ఏం తేడా ఉంటుంది మన మామిడి పండ్లలో?

**ప్రశ్నకర్త :** మనవి తియ్యగా ఉంటాయి.

**దాదాశ్రీ :** ఔను. చూడు మరి! ఆ తియ్యదనాన్ని చవిచూడు, మన భారతదేశానిది.

**ప్రశ్నకర్త :** ఇప్పటివరకు చవిచూడలేదు.

**దాదాశ్రీ :** లేదా, కానీ ఇందులో ఇరుక్కుపోవొద్దు. అమెరికన్‌లలో ఇరుక్కుపోవటం తగదు. చూడు మీ అమ్మ నాన్నలను, చూసావా? వారిద్దరిలో అభిప్రాయభేదాలు వస్తుంటాయా లేదా?

**ప్రశ్నకర్త :** అభిప్రాయ భేదాలైతే వస్తుంటాయి.

**దాదాశ్రీ :** అలాంటప్పుడు మీ మమ్మీ ఇల్లు వదిలి వెళ్ళిపోతుందా ఎప్పుడైనా?

**ప్రశ్నకర్త :** లేదు లేదు.

**దాదాశ్రీ :** ఈ అమెరికన్ అయితే ఇట్లా 'యు యు' చేసి, అట్లా తుపాకీ చూపించి వెళ్ళిపోతుంది, ఈమె (ఇండియన్) జీవితాంతం ఉంటుంది. అందువలన నేను నీకు చెప్పదలచుకుంది ఏమిటంటే, 'భాయ్, అలా చెయ్యకు. ఇటువైపు తిరిగితే తర్వాత పశ్చాత్తాపపడతావు. ఇండియన్ అయితే చివరి వరకూ తోడుగానే ఉంటుంది. ఆ, రాత్రి జగడం పెట్టినా ఉదయానికల్లా రిపేర్ అయిపోతుంది.

**ప్రశ్నకర్త :** ఆ మాట నిజమే.

**దాదాశ్రీ :** అందువలన ఇప్పుడు నిర్ణయించుకో, భారతీయ అమ్మాయినే పెళ్లిచేసుకోవాలి. ఇండియన్‌లో నీకు ఇష్టమైన అమ్మాయి ఎవరైనా సరే, బ్రాహ్మణ కులమైనా లేక వైశ్య కులమైనా, నీకు ఇష్టమైతే పరవాలేదు.

**ప్రశ్నకర్త :** నా జాతివాళ్ళలోనే పెళ్ళి చేసుకోవటం వలన లాభమేమిటో కాస్త చెప్పండి.

**దాదాశ్రీ :** నీ జాతివాళ్ళలోని భార్య అయితే, నీ స్వభావానికి అనుకూలంగా ఉంటుంది. భోజనం వడ్డించినపుడు నీకు అందులో నెయ్యి ఎక్కువగా కావాలి. ఒకవేళ అటువంటి జాతి అమ్మాయిని తీసుకునివస్తే, ఆమె వడ్డించదు. అలా చెయ్యి కిందికి విదిలించటానికి కూడా ఆమె చెయ్యి నొప్పి లేస్తుంది. అందువలన అటువంటి భిన్న మనస్తత్వం ఉన్నవాళ్ళతో రోజంతా ఘర్షణే ఉంటుంది. నీ జాతివాళ్ళతో అలా జరగదు. అర్థమైందా? ఆమె భాష మాట్లాడినా, నీ తప్పులెంచుతూ ఎంతో సులభంగా అనేస్తుంది, 'నీకు మాట్లాడటం రాదు' అని. వాళ్ళతో పోలిస్తే మన అమ్మాయి ఏమీ అనదు, తిట్టనయితే తిట్టదు కదా.

**ప్రశ్నకర్త :** మన జాతివాళ్ళయితే జగడాలు జరగవు అంటున్నారు మీరు. కానీ అక్కడ స్వజాతిలో కూడా జగడాలు జరుగుతుంటాయి. ఎందువలనంటారు?

**దాదాశ్రీ :** దెబ్బలాటలు జరుగుతుంటాయి కాని వాటికి సమాధానం కూడా వస్తుంటుంది. వాళ్ళతో రోజంతా బావుంటుంది కానీ ఈ రెండవవారితో అలా బావుండదు, ఒక గంట బాగుంటుంది, పైగా విసుగు వచ్చేస్తుంది. వాళ్ళతోపాటే జంఝాటం కూడా వచ్చేస్తుంది. స్వజాతికైతే నచ్చుతుంది, లేదా అసలే నచ్చదు. ఇవన్నీ అనుభవించినవారున్నారు. వాళ్ళ ఉదాహరణ తీసుకుని చెప్తున్నాను. వీళ్ళంతా ఎంతగానో ఇరుక్కుపోయివున్నారు. ఇప్పుడు అంతర్జాతీయ వివాహాలు చేసుకోవటంలో తప్పు లేదు. ఇంతకు ముందు కాస్త ఇబ్బందులు ఉండేవి.

**ప్రశ్నకర్త :** మన చేతుల్లో ఏముంది? మన చేతుల్లో ఏమీ లేదు కదా అమెరికన్ భార్య వస్తుందో లేదో అన్నది?

**దాదాశ్రీ :** చేతుల్లో లేదు కాని అలా కళ్ళు మూసుకునైతే చెయ్యం కదా ఏదైనా? ఏయ్, ఆ అమెరికన్ అమ్మాయితో నువ్వు తిరగొద్దు. నువ్వు చేయాల్సిన పని కాదది' అనైతే చెప్పవలసివుంటుంది కదా. అలా చెప్పగా చెప్పగా దాని ప్రభావం పడుతుంది. లేకపోతే, ఈమెతో తిరుగుతున్నా కదా, అలాగే ఆమెతో కూడా తిరుగుతాను అనిపిస్తుంది. చెప్పటంలో తప్పేముంది? బస్తీలో పరిస్థితి బాగోలేకపోతే, 'బివేర్ ఆఫ్

థీవ్స్' (దొంగలున్నారు జాగ్రత్త) అని బోర్డ్ పెడతారు. ఎందుకు చేస్తారలా? ఎందుకంటే, ఎవరు జాగ్రత్తపడతారో వాళ్ళు జాగ్రత్తపడతారు. ఈ హెచ్చరికలు పనిచేస్తాయా లేదా?

తండ్రివైపు కులం అని అంటారు, తల్లివైపు జాతి అని అంటారు. జాతి, కులాల మిశ్రమం వలన సంస్కారం వస్తుంది. కేవలం జాతి మాత్రమే కాని కులం కాకపోతే సంస్కారం రాదు. జాతి, కులాల మిశ్రమం ఎగ్జాట్‌నెస్ ఉంటేనే సంస్కారవంతులు జన్మిస్తారు. ఈ ఇరు పక్షాలవారు సరిగ్గా కలిసి మాటలు ముందుకెళ్తే, వేరే ఇతర మాటలలో ఏ మజా ఉండదు.

కనుక, తల్లి మంచి జాతిది, తండ్రి కులవంతుడు అయ్యుండాలి. వాళ్ళ సంతానం చాల గొప్పది అవుతుంది. జాతిలో విరుద్ధ గుణాలుండవు. తండ్రిలో కులవంతుడైన గుణం ఉంటుంది. కులంవారు సులభంగా ఇతరుల కోసం పాటుపడతారు. ప్రజలకోసం పాటుపడతారు. ఎక్కువ కులవంతులు ఎవరు? రెండు వైపుల నుంచి నష్టాలను భరించేవారు. వచ్చేటప్పుడూ ఖర్చుపెడతారు, వెళ్ళేటప్పుడూ ఖర్చుపెడతారు. లేకపోతే ప్రపంచంలో మనుషులు ఎటువంటి కులవంతులు? తీసుకునేటప్పుడు పూర్తిగా తీసుకుంటారు కానీ, ఇచ్చేటప్పుడు కాస్త ఎక్కువగా ఇస్తారు. మొగ్గ వేస్తారు. లోకంలో మనుషులు నలభై తులాలు ఇస్తే, వీళ్ళు నలభై ఒక్క తులాలు ఇస్తారు. డబల్ కులవంతులెవరు? తీసుకునేటప్పుడు ముప్పై తొమ్మిది తులాలు, ఒక తులం తక్కువగా తీసుకుంటారు, ఇచ్చేటప్పుడు ఒక తులం ఎక్కువ మొగ్గ వెస్తారు. వాళ్ళని డబల్ కులవంతులంటారు. రెండు వైపుల నుంచీ నష్టాన్ని తలెత్తుకుంటారు. అంటే, అక్కడ తక్కువ ఎందుకు తీసుకుంటారు? ఎందుకంటే వాళ్ళ జాతివాళ్ళు బాధల్లో ఉన్నారు కనుక, వాళ్ళ బాధలను తొలగించేందుకు. ఇక్కడా మంచి భావన, అక్కడా మంచి భావన. ఇలాంటి వాళ్ళని చూసినప్పుడు నేను, ద్వాపరయుగం వచ్చింది అంటాను.

ఇక ఉత్తమ కులంవారైయ్యుండి, అహంకారం చూపిస్తే, మరోసారి అతనికి లభించేది తక్కువ కులమే. నమ్రతగా ఉంటే ఉత్తమ కులంలో పుడతారు. ఇక్కడ నేర్చుకునేది మనమే, ఫలితం మనదే. గుణాలను ప్రాప్తించుకోవలసిన అవసరం

లేదు. సహజంగా ప్రాప్తిస్తాయి. అక్కడ ఉత్తమ కులంలో జన్మెత్తితే, జన్మతహానే సంస్కారం ప్రాప్తిస్తుంది.

ఇవన్నీ వ్యావహారికంగా పనికివచ్చే మాటలే కాని జ్ఞానానికి సంబంధించింది కాదు. వ్యవహారంలో ఇది అవసరం కదా1

**ప్రశ్నకర్త :** దాదాజీ మీరు చెప్పింది బావుంది. జ్ఞాన శిఖరాన్ని చేరుకోవటానికి ముందు మనం వ్యవహారంలో ఉన్నాం కాబట్టి ఈ జ్ఞానానికి సంబంధించిన విషయాలు కూడా పనికివస్తాయి కదా?

**దాదాశ్రీ :** ఔను పనికివస్తాయి! వ్యవహారంలో కూడా పనికివస్తుంది. 'జ్ఞానిపురుష్' లో విశేష లక్షణాలుంటాయి. 'జ్ఞాని పురుష్' కి బోధకళ, జ్ఞానకళ రెండు కళలూ ఉంటాయి. బోధకళ అవగాహనతో ఉత్పన్నమౌతుంది, జ్ఞానకళ జ్ఞానంతో ఉత్పన్నమౌతుంది. అందుకే అక్కడ (జ్ఞాని పురుష్ దగ్గర) మనకి స్పష్టత లభిస్తుంది. ఒకరోజు ఇలాంటి మాటలు మాట్లాడితే తప్పేమిటి? ఇందులో నాకు వచ్చే నష్టమేమిటి? 'దాదా' కూడా కూర్చునివుంటారు. ఆయనకి ఫీజు ఏమీ ఉండదు. ఫీజ్ ఉంటే కదా అభ్యంతరం!

**ప్రశ్నకర్త:** యువతీయువకులు వైవాహిక జీవితంలో అడుగుపెట్టే ముందు పురుషుడు లేక స్త్రీ ఏవిధంగా ఇష్టపడాలి, ఏం చెయ్యాలి? ఏం చూడాలి? గుణాన్ని ఎలా చూడాలి?

**దాదాశ్రీ :** అవన్నీ ఎక్కువగా చూడవలసిన పనేమీ లేదు. యువతీ యువకులు పెళ్ళి చూపులకు వెళ్ళినపుడు పరస్పరాకర్షణ లేకపోతే వదిలేయాలి. మరేమీ చూడవలసిన పని లేదు. ఆకర్షణ కలుగుతుందా లేదా- చూడవలసింది ఇంతే.

**ప్రశ్నకర్త:** ఎటువంటి ఆకర్షణ?

**దాదాశ్రీ :** కళ్ళతో చూసే ఆకర్షణ ఉంటుంది, లోపల ఆకర్షణ ఉంటుంది. బజారులో ఏదైనా వస్తువు కొనాలంటే, ఆ వస్తువుకి అట్రాక్షన్ (ఆకర్షణ)

లేకపోతే మీరు కొనలేరు. అంటే, అది ఖాతాలో ఉంటేనే ఆకర్షణ కలుగుతుంది. ప్రకృతి ఖాతాలో లేకుండా ఏ వివాహమూ జరగదు. కనుక ఆకర్షణ ఉండాల్సిందే.

ఇది సరదాగా గడిపే యుగం కాబట్టి స్త్రీని పరిహసిస్తున్నారు. అమ్మాయిని చూడటానికి పోయినపుడు కొడుకు, ఇటు తిరుగు, అటు తిరుగు అంటూ ఎంత పరిహాసం చేస్తారు!

ఈ కాలంలో అబ్బాయిలు అమ్మాయిలను ఇష్టపడే ముందు వాళ్ళలో అవగుణాలను ఎంచుతారు. 'చాల పొడువుగా ఉంది, చాల పొట్టిగా ఉంది, చాల లావుగా ఉంది, చాల సన్నగా ఉంది, కాస్త నల్లగా ఉంది' అలా ఒకతను అనేవాడు. అప్పుడు నేను అతన్ని బెదిరించాను. నేను అతనితో, 'మీ అమ్మ కూడా కోడలైంది కదా. ఏం మనిషివి నువ్వు?' స్త్రీలకు అంత ఘోర అవమానమా?

ఎవరైనా నన్ను వెళ్ళండి, మీకు పూర్తి స్వేచ్ఛ ఉంది. ఈ అబ్బాయిని ఏమనాలంటే అది అనండి అంటే, ఆ అబ్బాయి కూడా నన్ను ఏమనదలచుకుంటే అది అనండి అని అంటే నేను, 'భాయ్, ఈ అమ్మాయేమైనా గేదెనా అలా గుచ్చిగుచ్చి చూస్తున్నావు? గేదెని నాలుగు వైపుల నుంచి చూడవలసివుంటుంది. ఈ అమ్మాయిని కూడానా?' అంటాను.

ఇక స్త్రీలు దానికి ప్రతీకారం ఎప్పుడు తీర్చుకుంటారో తెలుసా? అలా పరిహాసం చేసిన అబ్బాయికి దాని పరిణామం తర్వాత ఎలా ఉంటుంది?

స్త్రీల సంఖ్య ఎక్కువగా ఉండటం వలన వాళ్ళ రేటు పడిపోయింది. ప్రకృతి చేసిన పని అది. ఇక దాని రియాక్షన్ ఎప్పుడు వస్తుంది? ప్రతీకారం ఎప్పుడు వస్తుంది? స్త్రీల సంఖ్య తగ్గిపోయి పురుషుల సంఖ్య పెరిగినప్పుడు, స్త్రీ ఏం చేస్తుంది? స్వయంవరం! అంటే అర్థం, పెళ్ళి చేసుకునేది ఒకామె అయితే పురుషులు నూట ఇరవై మంది! స్వయంవరానికి మంచి దుస్తులు వేసుకుని డాబుగా వస్తారు, మీసాల మీద ఇలా చెయ్యి వేసుకుని ఉంటారు. నాకు ఎప్పుడు వరమాల వేస్తుందా అని ఎదురుచూస్తుంటారు. ఆమె చూసుకుంటూ వస్తుంది. ఇతను అనుకుంటాడు నాకు

వేస్తుందేమో అని. మెడను కూడా కాస్త ముందుకు వంచుతాడు. కాని ఆమె గడ్డి కూడా వేయదు. ఆమె మనసులో ఎవరి మీదైనా ఇష్టం ఏర్పడితే, ఆకర్షణ కలిగితే, అతని మెడలో వరమాల వేస్తుంది- అతను మీసాలు మెలేస్తున్నా లేకపోయినా సరే! అక్కడ పరిహాసం జరుగుతుంది. మిగతావాళ్ళంతా మూర్ఖులై వెళ్ళిపోతారు, ఇలా ఇలా అంటూ. అలాంటి పరిహాసం, అటువంటి ప్రతీకారం జరుగుతుంది.

ఈ కాలంలో అయితే పూర్తిగా బేరమాడటమే జరుగుతోంది, బేరం! ప్రేమ అనేది ఎక్కడుంది, బేరమే జరిగిపోయింది! ఒక పక్క డబ్బులు పెట్టు, ఒక పక్క మా అబ్బాయి, అప్పుడే పెళ్ళవుతుంది అని అంటారు. త్రాసులో ఒక పక్క డబ్బులు పెట్టాల్సివస్తుంది. త్రాసుతో తూస్తారు.

## 18. భర్త ఎంపిక

పరవశం, శుద్ధ పరవశం! ఎక్కడ చూస్తే అక్కడ పరవశం! తండ్రి తన కూతురుని ఇంట్లో ఉంచుకోడు. 'ఆమె తన అత్తగారింట్లో ఉండటమే శోభనిస్తుంది' అంటాడు. అత్తగారింట్లో అంతా ఆమెని తిట్టటానికే సిద్ధంగా కూర్చునివుంటారు. నువ్వు అత్తగారితో, 'అత్తగారూ మిమ్మల్నేం చేసుకుంటాను? నాకు కావలిసింది భర్త' అంటావు. కానీ అలా జరగదు. భర్త మాత్రమే రాడు వెంట ఒక గుంపే వస్తుంది. జనాల గుంపుతో సహా.

పెళ్ళి చేసుకోవటంలో తప్పు లేదు. పెళ్ళి చేసుకో కానీ బాగా ఆలోచించి 'ఇలా జరగబోతోంది' అని అర్థం చేసుకుని పెళ్ళి చేసుకో. అర్థం చేసుకున్న తర్వాతనే పెళ్ళి చేసుకో.

ఎవరైనా, 'నేను దీక్ష తీసుకోవాలి లేదా బ్రహ్మచర్య పాలన చేయాలి' అనే భావంతో వస్తే అది వేరు. మిగతావాళ్ళకి పెళ్ళి చేసుకోక తప్పదు. కానీ ముందుగానే ఇలా జరగబోతోంది అని నిర్ణయించుకుని, తర్వాతనే పెళ్ళి చేసుకుంటే తర్వాత ఏ గొడవా ఉండదు, జరిగినదానికి ఆశ్చర్యపడటమూ ఉండదు. అంతా సుఖంగానే ఉంటుంది అని అనుకుని ప్రవేశించాలి. ఇక అప్పుడు కేవలం వేదనే అనుభవిస్తారు!

పెళ్ళి అంటే దుఃఖసాగరమే. అత్తవారింట్లో అడుగుపెట్టటం ఏమైనా సాధారణ విషయమా? ఇక కేవలం భర్త మాత్రమే దొరకటం అనేది ఒక సంయోగమే- అతని తల్లిదండ్రులు చనిపోయివుంటే.

సివిలైజ్డ్ (సంస్కారి) దెబ్బలాటలు పెట్టుకోరు. రాత్రి ఇద్దరూ నిద్రపోతారు. జగడం పెట్టుకోరు. అన్‌సివిలైజ్డ్ (అనాగరికులు) మాత్రమే జగడం పెట్టుకుంటారు, క్లేశాలు పెట్టుకుంటారు.

**ప్రశ్నకర్త :** ఇప్పుడు మేము అమెరికన్ ఆడపిల్లలతో పార్టీలకు పోము. ఎందుకంటే ఆ పార్టీలలో తాగటం, తినటం, అంతా జరుగుతుంది. అందువలన మేము వాళ్ళ పార్టీలకు పోము. కానీ ఇండియన్ అబ్బాయిలు ఏర్పాటుచేసే పార్టీలకు పోతాము, ఒకరికొకరి తల్లిదండ్రులను గుర్తుపడతాం.

**దాదాశ్రీ :** అయితే అందులో ఏమటి ప్రయోజనం?

**ప్రశ్నకర్త :** ఎంజాయ్‌మెంట్, మజా వస్తుంది.

**దాదాశ్రీ :** ఎంజాయ్‌మెంట్! తినటంలో ఎంతో ఎంజాయ్‌మెంట్ ఉంటుందిలే కానీ తినటంలో చేయవలసింది ఏమిటి? వాళ్ళని కంట్రోల్ చెయ్యాలి, 'భాయ్ నీకు ఇంతే లభిస్తుంది' అని. అప్పుడు అతను నెమ్మది నెమ్మదిగా ఎంజాయ్ చేసుకుంటూ తింటాడు. ఎక్కువ స్వేచ్ఛనిస్తారు కదా అందుకే ఎంజాయ్ చేయరు. వేరే చోట ఎంజాయ్‌మెంట్‌ని వెతుక్కుంటారు. అందుకే భోజనంలో ముందుగా కంట్రోల్ చెయ్యాలి, ఇప్పుడు ఇంతే నీకు, ఇంకా ఎక్కువ ఉండదు అని.

**ప్రశ్నకర్త :** మనం మన అబ్బాయిలు, అమ్మాయిలను అటువంటి పార్టీలలోకి వెళ్ళనివ్వవచ్చా? అటువంటి పార్టీలకు సంవత్సరంలో ఎన్ని సార్లు వెళ్ళనివ్వాలి?

**దాదాశ్రీ :** విషయమేమిటంటే, ఆడపిల్లలు తల్లిదండ్రులు చెప్పినట్లుగా చెయ్యాలి. నా అనుభవంలో నేను చెప్పేది ఏమిటంటే, ఆడపిల్లలు ఎల్లప్పుడూ వాళ్ళ

తల్లిదండ్రులు చెప్పినట్లుగా నడుచుకోవాలి. పెళ్ళి తర్వాత భర్త చెప్పినట్లుగా నడుచుకోవాలి. తన ఇష్టమొచ్చినట్లుగా ఉండగూడదు. ఇది నాకు తెలిసినవాళ్ళు చెప్పింది.

**ప్రశ్నకర్త :** అబ్బాయిలకు వాళ్ళ తల్లిదండ్రులు చెప్పినట్లుగా చెయ్యవలసిన అవసరం ఉందా లేదా?

**దాదాశ్రీ :** అబ్బాయిలు కూడా తల్లిదండ్రులు చెప్పినట్లుగా నడుచుకోవాలి. కానీ అబ్బాయిల విషయంలో కాస్త వదులుగా ఉంచినా పరవాలేదు. ఎందుకంటే రాత్రి పన్నెండు గంటలకు వెళ్ళమన్నా ఒంటరిగా పోగలుగుతాడు పరవాలేదు. కానీ నిన్ను రాత్రి పదకొండు గంటలకు వెళ్ళమని అంటే ఒంటరిగా పోతావా?

**ప్రశ్నకర్త :** పోను. భయమేస్తుంది.

**దాదాశ్రీ :** కాని, అబ్బాయైతే పరవాలేదు. కొడుకులకు ఎక్కువ స్వేచ్ఛ ఉండాలి, కూతుళ్ళకు తక్కువ స్వేచ్ఛ ఉండాలి. ఎందుకంటే, మీరు పన్నెండు గంటలకు బయటకు వెళ్ళలేరు కనుక.

ఇది కేవలం మీ భవిష్యత్తు బాగుండేందుకే చెప్పటం జరుగుతోంది. భవిష్యత్తులో మీ మంచి కోసమే ఈ నిబంధన పెట్టటం. ఇప్పుడు మీరీ గొడవలో పడితే, భవిష్యత్తును పాడుచేసుకుంటారు. భవిష్యత్తులో మీకు జరగాల్సిన మంచిని పోగొట్టుకుంటారు. అలా మీ భవిష్యత్తు పాడవగూడదనే 'బివేర్, బివేర్, బివేర్' (జాగ్రత్త, జాగ్రత్త, జాగ్రత్త) అని చెప్పటం.

**ప్రశ్నకర్త :** మన హిందూ ఫ్యామిలీ (కుటుంబా) లలో, 'కూతురు పరాయి ఇంటికి పోతుంది, కొడుకు సంపాదించి మమ్మల్ని పోషిస్తాడు, మాకు తోడుగా ఉంటాడు' అంటారు. అటువంటి ఆశ పెట్టుకుని, అటువంటి దృష్టితో కుటుంబ సభ్యులు ప్రేమగా చూడకపోతే అది మంచిదా?

**దాదాశ్రీ :** ప్రేమ చూపించరు అన్న ఫిర్యాదు చేసేవారిదే తప్పు. అలా విరోధ భావనే తప్పు. అదే అవగాహనా లోపం. ప్రేమగా చూడని తల్లిదండ్రులే ఉండరు. ఇది వాళ్ళకి అర్థం కాకపోతే ఏం చేస్తాం? ప్రేమగా చూడరు అని అంటే తల్లిదండ్రులకు ఎంత బాధ కలుగుతుందో. ప్రేమగా చూడకపోతే చిన్నప్పటి నుంచి నిన్ను ఎందుకు పెంచి పెద్దచేసారు?

**ప్రశ్నకర్త :** మరి నాకు ఎందుకలాంటి తల్లిదండ్రులు ప్రేమగా చూడటం లేదు అనే ఫీలింగ్ (భావన) కలిగింది? నాకు అలాంటి దృష్టి ఎందుకు కలిగింది?

**దాదాశ్రీ :** లేదు. అందరూ ఇలాంటి ప్రశ్నే వేస్తారు. దానికేం చెయ్యాలి? చిన్నపిల్లవైతే మడమతో నొక్కేవారు కాని పెద్దదానివయ్యావు కదా ఏం చేస్తారు మరి?

నాకు కనిపించినంత వరకు, ఆమెకి వచ్చిన ఈ బుద్ధి, బయటి నుంచి వచ్చిన బుద్ధి, వ్యతిరేకమైన బుద్ధి. దీనివలన ఆమె బాధపడుతుంది, ఇతరులకీ బాధ కలిగిస్తుంది.

**ప్రశ్నకర్త :** ఔను. ఈ కాలం ఆడపిల్లలు కూడా త్వరగా పెళ్ళికి సిద్ధమవరు!

**దాదాశ్రీ :** ఆడపిల్లలు సిద్ధపడరు. వీలైతే పెళ్ళి త్వరగా చేస్తే మంచిది. చదువు పూర్తవగానే పెళ్ళి అయిపోవటం జరిగితే మంచిది. రెండు వెంటవెంటనే జరగాలి. పెళ్ళి తర్వాత ఒకటి రెండు సంవత్సరాలకు చదువు అయిపోతున్నట్లయితే కూడా మంచిదే. కానీ పెళ్ళితో ముడిపడితే' లైఫ్' (జీవితం) బాగా గడుస్తుంది. లేకపోతే లైఫ్ దుఖమయం అవుతుంది.

ఫ్రెండ్ మీద మోహం అంటే, స్నేహితురాలి గురించి చెప్తున్నావా లేక స్నేహితుడా?

**ప్రశ్నకర్త :** లేదు. ఇద్దరూ.

**దాదాశ్రీ :** (అమ్మాయి) స్నేహితురాలు, మీసాలాయన (అబ్బాయి) కూడానా?

**ప్రశ్నకర్త :** ఇద్దరూ.

**దాదాశ్రీ :** సరే. అయితే వాళ్ళతో సమభావంతో ఉండాలి. ఆ సమయంలో నీవు జాగృతిలో ఉండాలి. ఆ సమయంలో ఎరుక వీడవద్దు. బ్రహ్మచర్య పాలన చేయదలచుకున్నవారు, మోక్షానికి పోదలచుకున్నవారైన స్త్రీలు పురుషులతో పరిచయాన్ని తక్కువలో తక్కువగా పెట్టుకోవాలి. అనివార్యమైతేనే తప్ప. మోక్షానికి పోదలచుకున్నవారు ఈ మాత్రం తెలుసుకునివుండాలి. అలా నీకు అనిపిస్తోందా లేదా? నీకేమనిపిస్తోంది?

**ప్రశ్నకర్త :** ఔను. అలాగే చేయాలి.

**దాదాశ్రీ :** మోక్షానికి వెళ్ళాలా లేకపోతే ఇప్పటికి అంతేనా?

**ప్రశ్నకర్త :** లేదు, మోక్షానికి పోవాలి.

**దాదాశ్రీ :** అయితే ఈ మిత్రులతో ఎందుకా మైత్రి ఇది శుద్ధ అబద్ధం.

(ఆ అమ్మాయితో) స్త్రీలతో తిరుగు, తిను, తాగు, సరదాగా ఉండు కాని పురుషులతో వద్దు.

**ప్రశ్నకర్త :** దాదాజీ, ఒక అమ్మాయి అడుగుతోంది, అబ్బాయిలతో 'ఫ్రెండ్లీ రిలేషన్' (మైత్రీ సంబంధం) పెట్టుకున్నప్పటికీ తల్లిదండ్రులు శంకిస్తారు ఎందుకని?

**దాదాశ్రీ :** లేదు. పురుషులతో ఫ్రెండ్లీ రిలేషన్ పెట్టుకోనే కూడదు. అబ్బాయిలతో ఫ్రెండ్లీ రిలేషన్ తప్పు.

**ప్రశ్నకర్త :** అందులో తప్పేముంది?

**దాదాశ్రీ :** పెట్రోల్, నిప్పు, రెండూ పక్కపక్కనే ఉండగూడదు కదా? వాళ్ళిద్దరూ (అబ్బాయి, అమ్మాయి) అవకాశం కోసం చూస్తుంటారు. ఆమె ఎప్పుడు పడుతుందా అని ఇతను, అతను ఎప్పుడు పడతాడా అని ఆమె చూస్తుంటారు. ఇద్దరూ వేట పడటం కోసం చూస్తుంటారు. ఇద్దరూ వేటగాళ్ళే.

**ప్రశ్నకర్త :** అబ్బాయిలు, అమ్మాయిలు స్నేహం చేయగూడదని మీరు అన్నారు కదా.

**దాదాశ్రీ :** అస్సలు చెయ్య వద్దు.

**ప్రశ్నకర్త :** అస్సలు చెయ్యవద్దు అని చెప్తే, వాళ్ళకి నచ్చలేదు.

**దాదాశ్రీ :** ఆ ఫ్రెండ్‌షిఫ్ చివరకు పాయిజన్ (విషం) తో సమానం. చివరకు విషంగానే మారుతుంది. ఆడపిల్ల చనిపోయే సమయం వస్తుంది. అబ్బాయికి ఏమీ కాదు. అందువలన అబ్బాయిలతో కలిసి నిలబడనుకూడా వద్దు. అబ్బాయిలతో ఫ్రెండ్‌షిప్ చేయకండి. లేదంటే అది పాయిజనే. లక్ష రూపాయలు ఇచ్చినా సరే ఫ్రెండ్‌షిప్ చెయ్యవద్దు. చివరకు విషం తాగి చనిపోవలసివస్తుంది. ఎంతోమంది ఆడపిల్లలు అలా విషం తాగి చనిపోయారు.

అందువలన, వయసుకి రాగానే అమ్మనాన్నలతో, 'ఎవరైనా మంచి వ్యక్తిని చూసి సంబంధం కలుపుకోండి, అది మళ్ళీ ఎన్నటికీ తెగని బంధమయేటట్లుగా కలుపుకోండి. నా పెళ్ళి కోసం ఒక అబ్బాయిని వెతకండి. మీకు ఈ మాట చెప్పమని దాదా భగవాన్ నాతో అన్నారు' అని అనండి. అలా చెప్పాలి కాని సిగ్గుపడి ఉండిపోగూడదు. అప్పుడు వాళ్ళకి అర్థమౌతుంది పిల్లలకు ఏం చేస్తే సంతోషపడతారో. సరే ఇక పెళ్ళి చేద్దాం అనుకుంటారు. తర్వాత రెండు సంవత్సరాలలో పెళ్ళి చేసుకో. ఎదురెదురుగా కూర్చుని ఇష్టపడి సంబంధం కుదుర్చుకోండి. పెళ్ళి అయినట్లయితే ఎవరూ మనవైపు కన్నెత్తి చూడరు. ఆమెది నిర్ణయించబడింది అని చెప్తారు.

ఈ స్నేహం అనేది మంచిది కాదు. మోసకారులు ఉంటారు. ఆడ స్నేహితులతో మైత్రి చెయ్యవచ్చు కానీ మగవాళ్ళతో మైత్రి వద్దు. మోసం చేసి వెళ్ళిపోతారు. ఎవరూ నమ్మదగ్గవారు కారు, అందరూ దగాచేసేవారే. ఒక్కరూ అసలైనవాళ్ళు లేరు. బయట ఎవరినీ నమ్మవద్దు.

పెళ్ళి చేసుకోవటం మంచిది కాని ఇక్కడ అక్కడ తిరగటం మంచిది కాదు. మీ అమ్మానాన్నలు వివాహితులు కదా ఏమైనా సమస్య ఉందా? అదేవిధంగా వివాహ

బంధంలోకి వెళ్ళటం నీకు బాగనిపించలేదూ? గుంజకి కట్టుబడివుండటం (వివాహ బంధంలో ఒదిగిపోవటం) నీకు ఇష్టమనిపించటం లేదా? స్వేచ్ఛగా ఉండటం ఇష్టమా?

పెళ్ళి ఎందుకు చేసుకోరు అని ఆడపిల్లలను అడుగుతాను. అందుకు, 'ఏమిటి దాదాజీ, మీరు కూడా అలాగే అంటారు? మమ్మల్ని పెళ్ళి చేసుకోమని అంటున్నారా!" అంటారు వాళ్ళు. అప్పుడు నేను, 'ఈ ప్రపంచంలో పెళ్ళి చేసుకోకుండా కుదరదు. బ్రహ్మచర్య పాలన చేయాలి అని డిసైడ్ చేసుకో. అది కూడా నిశ్చయంగా, ధృఢంగా చేసుకోవాలి. అలా చేయలేకపోతే పెళ్ళి చేసుకో కానీ రెండిటిలో ఏదో ఒక దానిలోకి రా' అంటాను. 'పెళ్ళి చేసుకోమని ఎందుకు అంటున్నారు?' అని ఆమె అంటే, 'ఏం ఏమిటి అందులో కష్టం? మంచి అబ్బాయి దొరకటం లేదా?' అని అడుగుతాను. అందుకామె, 'మంచి అబ్బాయిలు ఎక్కడున్నారు? అంతా బుద్ధి తక్కువ వాళ్ళు. భాయ్, బుద్ధి తక్కువవాళ్ళతో పెళ్ళి చేసుకోవాలా?' అన్నది. అది విని నేను ఆశ్చర్యపోయాను. "ఈ ఆడపిల్లలు ఎలా ఉన్నారో చూడండి. ఇప్పటి నుంచే వీళ్ళకి ఇంత పవర్. ఇక ముందు ముందు వాళ్ళని ఎలా బ్రతకనిస్తారు పాపం?' అనుకున్నాను. అందుకే చాలమంది అబ్బాయిలు నాతో, 'మేము పెళ్ళి చేసుకోము' అంటారు. అమ్మాయిలు ఏమంటారు, 'తెలివిలేనివాడిని నేను పెళ్ళి ఎందుకు చేసుకుంటాను' అంటారు. 'అలా అనకండి. ఇతను బుద్ధి తక్కువవాడు అనేది మీ మనసులోంచి తీసేయండి. ఎందుకంటే పెళ్ళి చేసుకోక వేరే మార్గం లేదు. ఇలా నడవదు.' తెలివి లేనివాడు అనేది మనసులో ఇరుక్కుపోయి కూర్చుంటే ఇక ఎప్పుడూ జగడాలే జరుగుతుంటాయి. ఇక అతను ఎప్పటికీ బుద్ధిలేనివాడిగానే కనిపిస్తుంటాడు.

ప్రపంచమంతా మోక్షం వైపే నడుస్తోంది. కానీ మోక్షానికి ఇవన్నీ హెల్పింగ్ (సహాయకారి) కావు. పైగా వీళ్ళు లడాయి జగడాలలో బ్రేకులు వేసుకుంటూవుంటారు. లేకపోతే వేసవి స్వభావం ఎలాంటిదంటే దాన్ని వర్షం వెనక్కి లాక్కొస్తుంది. ఎక్కడుంటుందో అక్కడి నుంచి లాక్కునివస్తుంది. వేసవి స్వభావం పెరిగిపోవటం, వర్షం స్వభావం, దాన్ని వెనక్కి తగ్గించటం. ఈ ప్రపంచంలో గాభరాపడాల్సిందంటూ ఏమీ లేదు.

ఈ ప్రపంచం స్వభావం ఎలాంటిదంటే, మనల్ని మోక్షం వైపు లాక్కుని వెళ్తుంది. మోక్షాన్ని లాక్కునివస్తుంది. ప్రపంచం ఎంత కఠినంగా ఉంటే, మోక్షం అంత త్వరగా వస్తుంది. కానీ కఠినంగా ఉందని మనం దిగాలు పడిపోకూడదు, స్థిరంగా నిలబడాలి. సరైన ఉపాయాన్ని ఆలోచించాలి. తప్పు ఉపాయాన్ని ఆలోచిస్తే తిరిగి కింద పడిపోతారు. దుఃఖం కలిగిందంటే, నా ఆత్మకి విటమిన్లు దొరికాయి అనుకోవాలి, సుఖప్రాప్తిలో శరీరానికి విటమిన్లు దొరుకుతాయి. నేను చిన్నప్పటి నుంచీ అలా టేస్ట్ చేసుకుంటూ ముందుకు సాగాను. మీరైతే ఒకే రకమైన విటమిన్లను విటమిన్లు అంటారు. అది బుద్ధి విటమిన్. కానీ జ్ఞానం రెండిటికీ విటమిన్. ఈ విటమిన్ ఎక్కువగా తీసుకోవటం మంచిది. అయినా మనుషులు తపస్సు చేస్తారు. రుచికరమైన ఆకుకూరలు, కూరగాయలు ఉన్నాసరే మనుషులు తపస్సు చేస్తారు. తపస్సు చేయటమంటే దుఃఖాన్ని సహించటం. దానివలన ఆత్మకి విటమిన్లు దొరుకుతాయి. ఇవన్నీ మీరు వినలేదా?

**ప్రశ్నకర్త :** ఆ విన్నాం దాదాజీ!

**దాదాశ్రీ :** మరి ఈ తపం ఇంట్లో కూర్చునే పొందవచ్చు.

లవ్ మ్యారేజ్ అనేది ఇష్టపడి చేసుకోతగదు. రేపొద్దున్న దాని పరిణామం ఎలా ఉంటుందో ఎవరికి తెలుసు? అమ్మా నాన్నలు ఇష్టపడినతన్ని చూడు. పిల్లవాడు మూర్ఖుడు లేక డిఫెక్ట్ ఉన్నవాడు కాదుకదా? మూర్ఖుడైవుండకూడదు! ఏమిటి మూర్ఖుడౌతాడా?

మనం ఇష్టపడేటట్టుగా ఉండాలి. కాస్త మన మనసుకి నచ్చేటట్లుగా ఉండాలి. బుద్ధి లిమిట్స్‌లో ఉండాలి. అహంకారాన్ని యాక్సెప్ట్ చేసేటట్టుగాను, చిత్తానికి బాగా అనిపించేటట్టుగా ఉండాలా? చిత్తానికి నచ్చినట్లు ఉండాలి కదా. కనుక, అమ్మా నాన్నలు వెతికిన వారు పరవాలేదు కానీ, మనం కూడా వాళ్ళని స్వయంగా చూడాలి.

**ప్రశ్నకర్త :** అప్పుడప్పుడు తల్లిదండ్రులు కూడా అబ్బాయిని ఎంపిక చేయటంలో తప్పు చేస్తారు కదా?

**దాదాశ్రీ :** వాళ్ళ ఉద్దేశ్యం అది అవదు. వాళ్ళ ఉద్దేశ్యం మంచి కోసమే ఉంటుంది. తప్పయితే అది మన ప్రారబ్ధం ఆడిన ఆటే అవుతుంది. ఏం చెయ్యగలం? ఒకవేళ మీ అంతట మీరే వెతికి చూసుకుంటే, అందులో తప్పు జరగటానికి ఇంకా ఎక్కువ అవకాశం ఉంటుంది. ఫెయిల్ అవటానికి చాలా ఉదాహరణలు ఉన్నాయి.

మా దగ్గర ఒక మహాత్మా ఉండేవారు. ఆయనకి ఏకైక పుత్రుడు ఉండేవాడు. నేను అతన్ని, 'అరె, నీకు పెళ్ళిచేసుకోవాలని ఉందా లేదా?' అని అడిగాను. అతను, 'చేసుకుంటాను దాదాజీ' అన్నాడు. 'ఎలాంటి అమ్మాయైతే పాసవుతుంది?' అని అంటే, 'మీరు ఎలా చెప్తే అలా చేస్తాను' అని మళ్ళీ, 'మా అమ్మయితే పాస్ చేయటంలో తెలివైనది' అన్నాడు. వీళ్ళు ముందుగా డిసైడ్ చేసుకుంటారు, మమ్మీ ఎవరిని పాస్ చేస్తే వాళ్ళే అని. అలా ఉండాలి.

**ప్రశ్నకర్త :** మా చిన్న అమ్మాయి, 'అలా ఎలా పెళ్ళి చేసుకుంటాను? అలా చేస్తే జీవితం మొత్తం పాడవుతుంది కదా? ముందుగా అబ్బాయిని బాగా చూసి మంచివాడా కాదా అని విచారించి, ఆ తర్వాత పెళ్ళి చేసుకోవచ్చు కదా!' అంటుంది. నన్ను ఇలా ప్రశ్నిస్తూవుంటుంది. మరి దీనికి సొల్యూషన్ ఏమిటి దాదాజీ?

**దాదాశ్రీ :** అందరూ చూసే పెళ్ళి చేసుకుంటారు. తర్వాతేమో గొడవలు, కొట్లాటలు జరుగుతాయి. చూడకుండా ఎవరైతే పెళ్ళి చేసుకున్నారో వాళ్ళ పని బాగుంది. ఎందుకంటే ప్రకృతి ఇచ్చింది కనుక. ఇక్కడేమో మన తెలివితేటలు ఉపయోగించాము కదా?

ఒక మహాత్మా కూతురు ఏం చేసింది? తన తండ్రితో, 'నాకు ఈ అబ్బాయి నచ్చలేదు' అన్నది. అబ్బాయి బాగా చదువుకున్నవాడు. ఆ అబ్బాయి, అమ్మాయి తల్లిదండ్రులకు, అందరికీ నచ్చాడు. అందువలన ఆమె తండ్రికి వ్యాకులత కలిగింది. చాల కష్టం మీద ఇంత మంచి అబ్బాయి దొరికితే అమ్మాయేమో వద్దంటుంది అని.

తర్వాత అతను నన్ను అడిగితే నేను, 'అమ్మాయిని నా దగ్గరకు పంపించు' అన్నాను. 'అమ్మా, నాకు చెప్పు నీ అభ్యంతరమేమిటో. పొడుగ్గా ఉన్నాడా, లావుగా

ఉన్నాడా, సన్నగా ఉన్నాడా?' అని అడిగాను. 'లేదు కాస్త బ్లాకిష్ (నల్లగా) ఉన్నాడు' అన్నదామె. నేను ఆమెతో, 'దాన్ని నేను తెల్లగా చేస్తాను, నీకు మరేమైనా ఇబ్బంది ఉందా?' అన్నాను. అందుకామె, 'లేదు మరేమీ లేదు' అంది. అప్పుడు నేను, 'నువ్వు సరేనను, నేను అతన్ని తెల్లగా చేస్తాను' అన్నాను. ఆమె తండ్రితో, 'దాదాజీ దగ్గరికి ఫిర్యాదు తీసుకునివెళ్ళావా?' అని అడిగింది. ఏం చేస్తాడు మరి?

పెళ్ళి తర్వాత, 'అమ్మాయ్, తెల్లగా చెయ్యటానికి సబ్బు తెప్పించనా?' అని అడిగితే, 'లేదు దాదాజీ, తెల్లగానే ఉన్నాడు' అంది. కారణం లేకుండా బ్లాకిష్ బ్లాకిష్ అన్నది. అదేమిటంటే, ఏమైనా నల్లటిది రాస్తే నల్లగా కనిపిస్తాడు, పచ్చటిది రాస్తే పచ్చగా కనిపిస్తాడు. నిజానికి అబ్బాయి మంచివాడు. నాకు కూడా నచ్చాడు. అతన్ని ఎలా వదులుకుంటాం? అమ్మాయి ఏమనుకుందంటే కాస్త ఢీలాగా ఉన్నాడు అని. సరిచెయ్యి మరి. కానీ అలాంటివాడు మరొకడు దొరకడు!

**ప్రశ్నకర్త :** డేటింగ్ చెయ్యటం పాపమా? డేటింగ్ అంటే అబ్బాయి, అమ్మాయిలు బయటకు వెళ్తారు. అది పాపమా? అందులో ఏమైనా తప్పుందా?

**దాదాశ్రీ :** ఔను. అబ్బాయితో తిరగాలనే కోరికే ఉంటే పెళ్ళిచేసుకో. అప్పుడు ఒకే అబ్బాయిని ఇష్టపడు. ఒకరినే నిశ్చయం చేసుకోవాలి. లేని పక్షంలో అటువంటి తప్పు చెయ్యవద్దు. పెళ్ళి అవనంత వరకు అబ్బాయితో తిరగ కూడదు.

**ప్రశ్నకర్త :** ఇక్కడ అమెరికాలో, అబ్బాయి, అమ్మాయిలు పధ్నాలుగు సంవత్సరాల ప్రాయం నుంచి బయట తిరగటానికి పోతారు. ఒకవేళ మనసుకి నచ్చితే ఇంకా ముందుకు పోతారు. వాళ్ళలో ఒకవేళ పొంతన కుదరకపోతే, వాళ్ళ మనసులు కలవకపోతే, వేరే వాళ్ళతో తిరుగుతారు. అతనితో కుదరకపోతే మూడవవాడు, అలా నడుస్తుంటి వ్యవహారం. ఇంకా, ఒకే సమయంలో ఇద్దరిద్దరు, నలుగురు నలుగురితో కూడా కలిసి తిరుగుతారు.

**దాదాశ్రీ :** దటీజ్ వైల్డ్‌నెస్, వైల్డ్ లైఫ్ (అది ఆటవికత. ఆటవిక జీవనం).

**ప్రశ్నకర్త :** మరి వాళ్ళేం చెయ్యాలి?

**దాదాశ్రీ :** అమ్మాయి ఒకే అబ్బాయి పట్ల సిన్సియర్‌గా (విశ్వాసంగా) ఉండాలి. అబ్బాయి అమ్మాయి పట్ల సిన్సియర్‌గా ఉండాలి. అలాంటి లైఫ్ (జీవనం) ఉండాలి. ఇన్‌సిన్సియర్ లైఫ్ ఉందే, అది రాంగ్ లైఫ్.

**ప్రశ్నకర్త :** ఇందులో సిన్సియర్‌గా ఎలా ఉండగలం? ఒకరితో మరొకరు కలిసి తిరుగుతాం, వాళ్ళలో అబ్బాయి కాని అమ్మాయి కాని ఇన్‌సిన్సియర్ అయిపోతారు.

**దాదాశ్రీ :** అలాంటప్పుడు తిరగటం మానెయ్యాలి. పెళ్ళి చేసుకోవాలి. ఆఫ్టరాల్ వియ్ ఆర్ ఇండియన్స్. నాట్ వైల్డ్ లైఫ్ (మనమైతే ఇండియన్స్‌మి. ఆటవికులం కాదు).

మన దగ్గర పెళ్ళి తర్వాత ఇద్దరూ సిన్సియర్‌గా (విశ్వాసంగా) కలిసి జీవిస్తారు. ఎవరైతే సిన్సియర్‌గా జీవించదలచుకున్నారో, వాళ్ళు ముందు నుంచే వేరే అబ్బాయితో ఫ్రెండ్‌షిప్ చెయ్యగూడదు. ఈ విషయంలో చాల నిబద్ధతతో మెలగాలి. ఆమె ఏ అబ్బాయితోను తిరగకూడదు. ఒకవేళ తిరగాలనుకుంటే ఒకే అబ్బాయిని నిశ్చయం చేసుకుని, అమ్మా నాన్నలతో, నేను అతన్నే పెళ్ళి చేసుకుంటే ఇతన్నే చేసుకుంటాను, వేరెవరినీ పెళ్ళి చేసుకోను అని చెప్పాలి. ఇన్సియర్ లైఫ్ ఈజ్ వైల్డ్ లైఫ్ (అవిశ్వాసపూరితమైన జీవితం ఆటవిక జీవితం).

గుణం మంచిది కాక, వ్యసనపరుడైతే చాల ఇబ్బందులు కలుగుతాయి. వ్యసనపరుడు ఇష్టమేనా కాదా?

**ప్రశ్నకర్త :** ఏమాత్రం కాదు.

**దాదాశ్రీ :** గుణం మంచిదైయ్యుండి వ్యసనపరుడైతే?

**ప్రశ్నకర్త :** సిగరెట్ వరకైతే భరించవచ్చు

**దాదాశ్రీ :** బాగ చెప్పావు. సిగరెట్ వరకైతే సహించవచ్చు. తర్వాత బ్రాండి పెగ్ తీసుకుంటే అతనితో ఎలా పొసగుతుంది? దానికో హద్దుంటుంది.

గుణమనేది పెద్ద విషయం. అమ్మాయ్ నువ్వు గుణాన్ని నమ్ముతావా? గుణాన్ని ఇష్టపడతావా?

**ప్రశ్నకర్త :** అది లేకుండా జీవించటం ఎలా సాధ్యం?

**దాదాశ్రీ :** ఆ చూడు మరి! భారతదేశంలో స్త్రీలు, అమ్మాయిలు ఈ మాత్రం అర్థం చేసుకుంటే అంతా సవ్యంగా సాగుతుంది. గుణాన్ని అర్థం చేసుకుంటే పని జరిగిపోతుంది.

**ప్రశ్నకర్త :** ఇలాంటి ఉన్నతమైన ఆలోచనలు, మంచి పఠనం వలన వచ్చాయి.

**దాదాశ్రీ :** ఎలాంటి పఠనంతో వచ్చినా సరే, ఇలాంటి మంచి ఆలోచనలు వచ్చే సంస్కారం లభించింది కదా!

నిజానికి ఇది దగా. మీ అందరికీ ఇది కనపడదు. నాకు అంతా కనిపిస్తుంది. కేవలం మోసం, కపటమే ఇది. కల్మషం ఉన్న చోట సౌఖ్యం ఎప్పటికీ ఉండదు. అందువలన పరస్పరం సిన్సియర్‌గా ఉండాలి. పెళ్ళికి ముందు ఇద్దరూ ఏమైనా తప్పులు చేసివుంటే, వాటిని యాక్సెప్ట్ చేయించి అగ్రిమెంట్ (ఒప్పందం) చేసుకోవాలి, సిన్సియర్‌గా ఉంటాము అని. మరోవైపు చూడనేవద్దు. జీవిత భాగస్వామి నచ్చినా నచ్చకపోయినా సరే, సిన్సియర్‌గా ఉండాలి. మీ అమ్మ మీకు నచ్చలేదనుకోండి, ఆమె స్వభావం మంచిది కాదనుకోండి, అయినా ఆమెతో సిన్సియర్‌గా ఉంటారు కదా!

**ప్రశ్నకర్త :** ప్రపంచ వ్యవహారంలో పూర్వజన్మలోని కర్మానుసారం అంతా జరుగుతుంది కదా, ఆ క్రమంలో మన మీద ఏమైనా దుమారం చెలరేగబోతున్నాయని తెలిస్తే, అప్పుడు అటువంటి స్థితిలో 'సమభావంతో చక్కదిద్దేందుకు' ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** భర్త వంకర మనిషైతే అతన్ని ఏవిధంగా నీ ఆధీనంలోకి తెచ్చుకుంటావు? ప్రారబ్ధంలో రాసిపెట్టి ఉన్నదైతే వదలదు కదా! సంసారం

అనుకూలంగా నడవటంలేదని అనిపిస్తే, నాతో చెప్పు, 'దాదాజీ, నాకు ఇటువంటి భర్త దొరికాడు' అని. అప్పుడు నేను నీ పరిస్థితినంతా రిపేర్ చేసి, నువ్వు హాయిగా జీవించేందుకు తాళం చెవిని కూడా నీకు ఇస్తాను.

ఔరంగాబాద్‌లో ఒక ముస్లిం అమ్మాయి వచ్చించి. 'నీ పేరేమిటి?' అని అడిగాను. 'దాదాజీ, నా పేరు మ(శూర్' అని చెప్పిందామె. 'రా అమ్మా, ఇక్కడకు వచ్చి కూర్చో నా దగ్గర. ఏ పని మీద వచ్చావు?' అని అడిగాను. ఆమె వచ్చి కూర్చుంది. ఇక్కడకు వచ్చినపుడు ఆమెకి చాల బాగ అనిపించింది. ఆమె లోపల ప్రశాంతత ఏర్పడి, ఈయనేదో దేవుడి అసిస్టెంటు (సహాయకుడు) లా ఉన్నాడు అనుకుంది, నేను అలా అనిపిస్తాను కూడా, అలా అనిపించి ఆమె కూర్చుంది. తర్వాత ఇక ఇతర విషయాలు బయటకు వచ్చాయి.

'ఏం చేస్తుంటావు నువ్వు?' అని అడిగాను. 'నేను లెక్చరర్‌ని' అని ఆమె చెప్పగా, 'పెళ్ళి– పెళ్ళి చేసుకున్నావా చేసుకోలేదా?' అని అడిగాను. 'లేదు. పెళ్ళి చేసుకోలేదు కాని నిశ్చితార్థం అయింది' అని చెప్పింది. 'ఎక్కడైంది, ముంబైలోనా?' అంటే, 'లేదు పాకిస్తాన్‌లో' అన్నదామె. 'ఎప్పుడు చేసుకుంటున్నావు?' అని అడిగినదానికి, 'ఆరు నెలల్లో' అని జవాబిచ్చింది. 'ఎవరితో? భర్తని ఎలా వెతికి పట్టుకున్నారు?' అని అడిగితే, 'లాయరు' అన్నదామె.

తర్వాత నేను ఆమెతో మాట్లాడుతూ, 'అతను నీకు భర్తయ్యి నీకు బాధేమీ కలిగించడా? ప్రస్తుతం నీకు ఎలాంటి బాధలూ లేవు. భర్త వస్తున్నాడు కదా ఆ భర్త నీకు బాధలు కలిగిస్తే? అతనితో పెళ్ళయిన తర్వాత నీవు ఏం చేద్దామనుకుంటున్నావు? అతనితో పెళ్ళి కాకముందు నీకు కొన్ని ప్రణాళికలు ఉండివుంటాయి, వాటి విషయంలో ఏం చేద్దామనుకుంటున్నావు? లేక అసలు ప్రణాళికలే లేవా? పెళ్ళయిన తర్వాత అక్కడ ఏం చెయ్యాలనుకుంటున్నావు, ఆ లాయర్ (వకీలు) తో నీకు సరిపడుతుందో లేదో, అందుకు తయారీలు ఏమైనా చేసుకునివుంటావు' అని అంటే, 'నేను అన్ని తయారీలు చేసుకున్నాను. అతను ఇలా అంటే నేను అలా జవాబిస్తాను. అతను ఇలా మాట్లాడితే నేను అలా మాట్లాడుతాను. అతను అనే ప్రతి మాటకీ నా దగ్గర జవాబు తయారుగా ఉంది' అన్నదామె.

అమెరికాతో యుద్ధం చెయ్యటానికి రష్యా ఎన్ని ప్రణాళికలు వేసుకుంటుందో అన్ని వేసుకుంది ఆమె. ఇరు వైపుల నుంచీ అంతా సిద్ధం. వాగ్యుద్ధం చెయ్యటానికి కూడా తయారీలు చేసుకునివుంది ఆమె. అతను జగడానికి రావటానికి ముందుగానే ఈమె బాంబు వేసేస్తుంది. అతను అలా అంటిస్తే ఈమె ఇలా అంటిస్తుంది. అంటే, ఆమె అక్కడికి పోవటానికి ముందుగానే జగడం చేయటానికి తయారుగా ఉంది. అతను అటు వైపు నుంచి బాణం వేస్తే, మనం ఇటు నుంచి రాకెట్‌ని వదులుతాం. 'నువ్వు కోల్డ్ వార్‌ని ప్రారంభిస్తున్నావు, అది ఎప్పుడు సమసిపోతుందో?' అన్నాను నేను. కోల్డ్ వార్ (క్లౌడ్ వార్) ఆగుతుందా? చూడండి, అగ్ర రాజ్యాలైన రష్యా, అమెరికా మధ్య ఆగుతోందా?

ఈ అమ్మాయిలు అలా అన్నీ ఆలోచిస్తారు. ఇలా అన్ని ఏర్పాట్లు చేసుకుంటారు. ఈ అబ్బాయిలైతే పాపం చాల అమాయకులు. అబ్బాయిలు ఇవన్నీ చెయ్యరు, ఆ సమయంలో దెబ్బతింటారు, అమాయకులు కదా!

మీరు అడుగుతున్నారు కదా, సంసారంలో దుమారం లేస్తే ఎలాంటి తయారీలు చేసుకోవాలి అని? కానీ ఆ అమ్మాయి అన్ని రకాల తయారీలు చేసి పెట్టుకుని ఉంది. బోంబార్డింగ్ ఎప్పుడు ఎలా చెయ్యాలి? అతను అలా అంటే అటాక్, ఇలా మాట్లాడితే ఇలా అటాక్ (ఎదురుదాడి). 'అన్ని రకాల తయ్యారీలు చేసి పెట్టుకున్నాను' అని చెప్తోంది. నేను మధ్యలో అడిగాను, 'ఇదంతా నీకు ఎవరు నేర్పించారు? బయటకు పంపిచేస్తాడు, విడాకులు ఇచ్చేస్తాడు కదా' అని. విడాకులు ఇస్తాడా లేదా? ఇలా చేస్తే ఆరు నెలల్లోనే విడాకులు ఇచ్చేస్తాడు అని నేను చెప్పేసాను. నీకు విడాకులు తీసుకోవాలనివుందా? అని అడిగాను. ఈ పద్ధతి తప్పు. 'నీకు అతను విడాకులు ఇవ్వగూడదనే నీకు ఇవన్నీ చెప్తున్నాను' అని ఆమెకి చెప్పాను.

అప్పుడు ఆమె, 'దాదాజీ, అలా చెయ్యకపోతే ఎలా చెయ్యాలి మరి? లేకపోతే అతను నన్ను లొంగదీసుకుంటాడు' అని అంటే, 'అతనేం లొంగదీసుకుంటాడు అమాయకుడు! అతను నీ మీద పెత్తనం చేస్తాడా?' అన్నాను.

ఆ తర్వాత నేను, 'అమ్మా, నేను చెప్పినట్లు వింటావా? నువ్వు అక్కడ సుఖపడాలా లేక దుఃఖపడాలా? ఆడవాళ్ళు ఎవరైతే అన్ని రకాలుగా తయారీలు చేసుకుని వెళ్ళారో, వాళ్ళంతా చివరకు దుఃఖాన్ని మూటగట్టుకున్నారు. నువ్వు నేను చెప్పినట్లుగా నడుచుకో. ఎటువంటి తయ్యారీలు లేకుండా వెళ్ళు' అని ఆమెకి అర్థమయేట్టుగా చెప్పాను.

ఇంట్లో ప్రతి రోజు గొడవలు జరుగుతుంటే వకీలు, 'దీన్ని పోనీ, మరో మంచిదాన్ని తెచ్చుకుంటాను' అంటాడు. అప్పుడు టిట్ ఫర్ టాట్ (దెబ్బకి దెబ్బ) అవుతుంది. ప్రేమగా సరిదిద్దుకోవలసిన చోట, ఇలాంటి వ్యవహారం ఎందుకు?

**ప్రశ్నకర్త :** ప్రేమ కోసం.

**దాదాశ్రీ :** ప్రేమ కోసమా? చాల ఆసక్తికరంగా ఉన్నావు. కానీ ఇందులో ప్రేమ ఎక్కడా లేదుగా! అతని మీద ద్వేషం కూడా లేదుగా! అంటే నేను, 'అలా చెయ్యగూడదు. నువ్వు చదువుకున్నదానివి కనుక ఇటువంటి తయారీలు చేసుకున్నావా? ఇది వార్ (యుద్ధం). ఇదేమైనా హిందుస్తాన్, పాకిస్తాన్ మధ్య యుద్ధమా? ప్రపంచంలో అంతా ఇలాగే చేస్తున్నారు. ఈ అబ్బాయిలు, అమ్మాయిలు, అంతా ఇలాగే చేస్తున్నారు. దీనివలన ఇద్దరి జీవితాలకు నష్టమే' ఆ విధంగా అన్ని రకాలుగా ఆమెకి నచ్చచెప్పాను.

భర్తతో మీ ప్రవర్తన ఎలా ఉండాలంటే, అతను వక్రంగా నడిస్తే నువ్వు తిన్నగా నడువు. సమాధానపరచాలి, పరిష్కారం వెతుక్కోవాలి. అతను దెబ్బలాటకి సిద్ధమైతే నువ్వు కలిసిపోయే ప్రయత్నం చేయాలి. అతను మళ్ళీ మళ్ళీ విడిపోయే మాటలు మాట్లాడితే, అలాంటి సమయంలో కూడా నువ్వు, 'మనం ఒకటే' అనాలి. ఎందుకంటే, ఇవన్నీ రిలేటివ్ సంబంధాలు. అతను సంబంధాన్ని తెంచితే, నువ్వు కూడా తెంచేస్తే, తెల్లవారికల్లా అంతా తెగిపోతుంది. అంటే విడాకులు ఇచ్చేస్తాడు. అప్పుడు ఆమె అడిగింది, 'అయితే ఏం చెయ్యాలి?' అని. అతని మూడ్ చూసి దాన్నిబట్టి వ్యవహరించమని చెప్పాను. అతని మూడ్ సరిగ్గా లేకపోతే నువ్వు మనసులో 'అల్లా' ని తలచుకుంటూ ఉండు, మూడ్ సరి అవగానే అతనితో మాట్లాడటం

ప్రారంభించు. అతని మూడ్ బాగోలేని సమయంలో నువ్వు అతన్ని రెచ్చగొడితే నిప్పు రాజుకుంటుంది అని చెప్పాను.

నువ్వు అతన్ని నిర్దోషిగా చూడాలి. అతను నిన్ను మంచిచెడు అన్నప్పటికీ శాంతంగా ఉండాలి. నిజమైన ప్రేమ ఉండాలి. ఆసక్తి అయితే ఆరు నెలలు, సంవత్సర కాలంలో తెగేపోతుంది. ప్రేమలో సహనశీలత ఉండాలి. అడ్జస్ట్‌మెంట్ (సర్దుబాటు) ఉండాలి.

మశ్రూర్‌కి నేను అలా బోధించాను. 'నువ్వు ఏమీ చెయ్యవద్దు. అతను అటు నుంచి బాణం వేసినా నీ స్థిరత్వాన్ని కోల్పోవద్దు. 'దాదా, దాదా' అనుకుంటూ వుండు. మళ్ళీ అటువైపు నుంచి బాణం వేసినప్పుడు కూడా 'దాదా, దాదా' అనుకో. నువ్వు మాత్రం ఏ బాణాన్ని వదలకు' అని చెప్పి ఆమెకి 'విధి' చేసాను.

తర్వాత అడిగాను, 'నీ అత్తవారింట్లో ఎవరెవరుంటారు?' అని. 'మా అత్త' అని చెప్పిందామె. నేను తిరిగి అడిగాను, 'మీ అత్తగారితో అడ్జస్ట్‌మెంట్ ఎలా చేసుకుంటావు?' అని. అప్పుడామె, 'ఆమెని కూడా ఎదుర్కొంటాను' అంది.

మళ్ళీ ఆమెకి అర్థమయ్యేటట్టుగా వివరించాను. ఆ తర్వాత ఆమె, 'ఔను దాదాజీ, నాకు మీ మాటలన్నీ బాగా నచ్చాయి' అంది. 'నువ్వు ఈ విధంగా ఉంటే విడాకులు ఇవ్వటం జరగదు, అత్తతో కూడా సంబంధం బాగుంటుంది'. అప్పుడామె ఒక చందన మాల నా మెడలో వేసింది. 'ఈ మాలను నువ్వే తీసుకెళ్ళి, ఎప్పుడూ నీ దగ్గరే ఉంచుకో. మాలను దర్శించుకుని, ఆ తర్వాత భర్తతో వ్యవహరించు. అప్పుడు ఎంతో సుందరమయం అవుతుంది.' ఆమె ఇప్పటికీ ఆ మాలను తనతో పాటు పెట్టుకునే ఉంది.

ఆమెకి గుణశీలత గురించి చెప్పాను. 'భర్త ఏమన్నా సరే, నిన్ను ఏమన్నా కాని, నువ్వు మౌనం వహించు. శాంతంగా ఉండు. అప్పుడు నీలో గుణశీలత ఉత్పన్నమౌతుంది, దాని ప్రభావం అతని మీద పడుతుంది. వకీలైనా సరే. అతను ఏమని తిట్టినా, 'దాదా' పేరు తలచుకుని స్థిరంగా ఉండు. అతని మనసులో

అనిపించవచ్చు, ఎలాంటి ఆడది ఈమె అని. ఈమె ఓటమిని కూడా స్వీకరించదు! ఆ తర్వాత అతను ఓడిపోతాడు.' తర్వాత ఆమె అలాగే చేసింది. ఆమె కూడా అలాంటిదే. అన్నీ నేర్పేందుకు దాదా లాంటివారు దొరికితే మరి ఇంకేం కావాలసివుంటుంది. లేకపోతే అంతకు ముందు అడ్జస్ట్‌మెంటు రష్యా అమెరికా మధ్య ఉండేటువంటిది. అక్కడ బటన్ నొక్కుతూనే అంతా కాలిపోతుంది, మటాష్. ఇదేమైనా మానవతా? ఎందుకు భయం? జీవితం ఉన్నది దేనికోసం? సంయోగం అలా ఉంటే ఇక చేసేది ఏముంటుంది?

వాళ్ళు ఎంత తయారీలు చేస్తే వాళ్ళ గుణశీలత అంత 'లూజ్' (బలహీనం) అవుతుంది. మనం అలాంటి తయారీలేమీ చేసుకోవద్దు. తయారీలు అని మీరు అనే గుణాన్ని ఉపయోగించే విధానంలో గుణశీలత 'లూజ్' అవుతుంది. గుణశీలత తగ్గిపోయినపుడు మీ భర్త ముందు నీకు విలువ అనేదే ఉండదు. అలా ఆ అమ్మాయి మనసులో పూర్తిగా నాటుకుపోయింది. తర్వాత నాతో, 'దాదాజీ, ఇక నేను ఏ రోజూ ఓడిపోను అని గ్యారెంటీ ఇస్తాను' అంది.

ఎవరైనా ప్రేరేపించినపుడు బదులుగా మనం కూడా అలగే చేస్తే, మన గుణశీలత నశిస్తుంది. ఎవరు ఎంత రెచ్చగొట్టినా సరే, తనలో ఉన్న ప్రేరణతోనే అందులో ఇరుక్కుపోవటం జరుగుతుంది. కానీ మీరు తయారీలు చేసుకోవటానికి పోతే, అప్పుడు అందులోకి స్వయంగా పోయి ఇరుక్కుంటావు. నా ముందు ఎందరో వచ్చి రెచ్చగొట్టే ప్రయత్నం చేసారు. కానీ ఆ రెచ్చగొట్టటానికి చూసినవారే అందులో ఇరుక్కుపోయారు. ఎందుకంటే నాకు క్షణమాత్రమైనా దాని గురించి ఆలోచనే రాదు. ఒకవేళ వాళ్ళని ఎదుర్కోవాలనే ఆలోచన వచ్చినా సరే, మన గుణశీలత అంతమౌతుంది. సౌశీల్యత అంతరిస్తుంది.

శీలవంతుడు అంటే ఎవరు? తిట్టిపోద్దామని వస్తాడు కాని, ఇక్కడకు వచ్చి మాట్లాడకుండా కూర్చుంటాడు. 'చెప్పండి చెప్పండి' అని నేను అన్నప్పటికి అతను చిన్న మాట కూడా మాట్లాడడు. అది 'శీల' ప్రభావం. ఒకవేళ మనం ఒక మాటైనా అనటానికి తయారీలు చేసుకునివుంటే, మన సౌశీల్యం నశిస్తుంది. అందువలన

తయారీలేమీ చేసుకోవద్దు. ఎవరు ఏమి అనదలచుకుంటే అది అననీ. 'సర్వత్ర నేనే ఉన్నాను' అనండి (ఆత్మ స్వరూపునిగా అందరితో అభేదంగా ఉన్నాను).

రెచ్చగొట్టేవారిని ఎదుర్కునే తయారీలో మనం ఒక కొత్త ప్రేరేపించే పనిలో పడతాం, స్లిప్ అవుతాం (జారిపడతాం). మన దగ్గర ఆ శస్త్రం కూడా లేదు కదా! అతని దగ్గర ఉంది ఆ శస్త్రం. కాబట్టి అతను దాన్ని ప్రయోగించనీ! కానీ అంతా 'వ్యవస్థితం' కదా! కనుక చివరకు అతని శస్త్రం అతనికే వెళ్ళి తగులుతుంది, అలాంటి 'వ్యవస్థితం'.

ఆమెకి బాగా అర్థమైంది. దాదాజీ డ్రాయింగ్ వేసారు. నాతో ఆమె, 'ఇలాంటి డ్రాయింగ్ చెప్పదలచుకున్నారా?' అంటే, 'ఔను. అలాంటి డ్రాయింగ్' అన్నాను.

తర్వాత ఆమె తన తల్లిదండ్రులకు చెప్పింది. ఆమె మాటలు విని, డాక్టర్ వృత్తిలో ఉన్న ఆమె తండ్రి దర్శనం చేసుకునేందుకు వచ్చాడు.

చూడు మరి, దాదాజీకి ఏమైనా ఆలస్యం అవుతుందా? మశ్రూర్ రావాలి ఇక్కడకి కాని, వస్తే ఆపరేషన్ జరిగిపోతుంది టకటకా! చూడుమరి, అక్కడ ఎప్పుడూ 'దాదాజీ, దాదాజీ' అని గుర్తుచేసుకుంటూనేవుంటుంది కదా!

అందరి పనులూ నెరవేరుతాయి. నేను చెప్పే ప్రతి మాటా సమాధానం తీసుకునివస్తుంది. చివరకు అది మోక్షానికి తీసుకునిపోతుంది! మీరు కేవలం 'అడ్జస్ట్ ఎవిరీవేర్' ని పాటించండి అంతే.

## 19. ప్రపంచంలో సుఖాన్ని పొందే సాధన సేవే

తల్లిదండ్రులలో తప్పులను వెతికే వ్యక్తికి అందులో ఎప్పటికీ సుఖమనేది ఉండదు. ధనం ఉండవచ్చేమో కాని ఆధ్యాత్మికత ఉత్పన్నమవదు ఎప్పటికీ. తల్లిదండ్రులలో దోషాలను చూడగూడదు. వాళ్ళ ఉపకారాన్ని ఎలా మర్చిపోతారు? ఎవరైనా టీ ఇచ్చినా వాళ్ళ ఉపకారాన్ని మర్చిపోము. అలాంటప్పుడు మనం తల్లిదండ్రుల ఉపకారాన్ని ఎలా మర్చిపోగలం?

నీకు అర్థమైందా? ఔను. నువ్వు వాళ్ళ ఉపకారాన్ని గుర్తించాలి. మాతాపితల సేవ చేయాలి. వాళ్ళేమైనా అన్నా, దాన్ని మనసులో పెట్టుకోగూడదు. వాళ్ళు నిన్నేమైనా అన్నా, వాళ్ళు పెద్దవాళ్ళు కదా! నువ్వు కూడా అలా ఏదిబడితే అది అనేస్తావా ఏమిటి?

**ప్రశ్నకర్త :** లేదు అనగూడదు. కానీ అనేస్తారు. దానికేమిటి? తప్పు జరిగింది, దానికేం చెయ్యాలి?

**దాదాశ్రీ :** ఔను ఎందుకు జారిపడరు? ఎందుకంటే అక్కడ జాగృతిలో ఉంటారు. ఒకవేళ జారిపడ్డా, తండ్రి అర్థం చేసుకుంటాడు పాపం ఈమె నోరుజారింది అని. కావాలనే అలా చేసినట్లయితే, నువ్వు అక్కడెందుకు జారావు? దీనికి నేను జవాబు అడుగుతున్నా. తప్పా ఒప్పా? సాధ్యమైనంత వరకు అలా జరగకూడదు. అయినా నీ వలన అలా ఏమైనా జరిగినట్లయితే, అందరూ అర్థం చేసుకుంటారు, 'అలా చేసే మనిషి కాదు' అని.

తల్లిదండ్రులను సంతోషంగా ఉంచాలి. వాళ్ళు నిన్ను సంతోషంగా ఉంచాలని చూస్తారా లేదా? వాళ్ళ సంతోషపెట్టాలని నీకు లేదా?

**ప్రశ్నకర్త :** ఔను కానీ దాదాజీ, వాళ్ళకి అలా కీచులాడే అలవాటయిందని మాకు అనిపిస్తుంది.

**దాదాశ్రీ :** ఔను. కానీ అందులో నీ తప్పు ఉంది. కనుక, తల్లిదండ్రుల పట్ల జరిగిన తప్పుకి ప్రతిక్రమణ చేయాలి. వాళ్ళని దుఃఖపెట్టగూడదు. 'నేను వాళ్ళని సుఖపెట్టటానికే వచ్చాను' అనే భావన మీ మనసులో ఉండాలి. 'తల్లిదండ్రులకు దుఃఖం కలిగేలా నేనేం తప్పు చేసాను' అనే అనుకోవాలి.

తండ్రి చెడ్డవానిగా కనపడతాడా? అలా కనిపిస్తే ఏం చేస్తావు? నిజానికి చెడు అనేది ఈ ప్రపంచంలో ఏదీ లేదు. మనకి ఏదైతే లభిస్తుందో, అవన్నీ మంచివే అవుతాయి. ఎందుకంటే అవి మన ప్రారబ్ధం నుంచి మనకి దొరికినవే కాబట్టి. అమ్మ లభించింది, ఆమె మంచిదే. నల్లగా ఉన్నా సరే మన అమ్మ మనకి మంచిదే. ఎందుకంటే మన ప్రారబ్ధం వలన మనకు లభించింది ఏదైనా మంచిదే కనుక. ఆమెని మార్చి రెండవామెను తెచ్చుకోగలమా?

**ప్రశ్నకర్త :** లేదు.

**దాదాశ్రీ :** బజారుకెళ్తే రెండవ అమ్మ దొరకదా? ఒకవేళ దొరికినా ఎందుకు పనికివస్తుంది? తెల్లని రంగులో ఉన్నా, మనకి ఎందుకు పనికొస్తుంది? ఎవరు ఉన్నారో ఆమే మంచిది. తెల్లగా ఉన్న ఇతరుల అమ్మని చూసి, 'నా అమ్మ బాగోలేదు' అనుకోగూడదు. 'నా అమ్మ చాల బావుంది' అనుకోవాలి.

**ప్రశ్నకర్త :** నాన్న విషయంలో ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** నాన్న విషయంలోనా? ఆయనకి ఎలా చేస్తే సంతోషమిస్తుందో ఆలాగే వ్యవహరించాలి. సంతోషపెట్టటం రాదా? ఆయన సంతోషపడేటట్టుగా చెయ్యి.

తల్లిదండ్రులంటే తల్లిదండ్రులే. ఈ ప్రపంచంలో ప్రప్రథమంగా సేవలందుకోవటానికి అర్హులెవరంటే వాళ్ళు తల్లిదండ్రులే. వాళ్ళకి సేవ చేస్తావా?

**ప్రశ్నకర్త :** ఆ. సేవ చేస్తూనేవున్నాను. ఇంటి పనులలో సాయం చేస్తుంటాను.

**దాదాశ్రీ :** శాంతి కోసం ఏం చేస్తావు? జీవితంలోకి శాంతిని తెచ్చుకోవాలా వద్దా?

**ప్రశ్నకర్త :** తెచ్చుకోవాలి.

**దాదాశ్రీ :** తెచ్చుకుందాం. కాని ఎప్పుడైనా తల్లిదండ్రులకు సేవ చేసావా? తల్లిదండ్రులకు సేవ చేస్తే శాంతి పోదు. కానీ ఈ కాలంలో తల్లిదండ్రులకు హృదయ పూర్వకంగా సేవ చేయరు. ఇరవై ఐదు, ముప్పై సంవత్సరాలకు వచ్చేసరికి 'గురు' (భార్య) వస్తుంది, 'నన్ను కొత్త ఇంటికి తీసుకుని వెళ్ళండి' అంటుంది. మీరు 'గురు' ని చూసారా? ఇరవై ఐదు ముప్పై సంవత్సరాల వయసులో 'గురు' దొరుకుతుంది, 'గురు' వచ్చేసరికి అంతా మారిపోతుంది. 'మీ అమ్మ గురించి మీకు తెలియదు' అని గురు అంటే, మొదటిసారి వినిపించుకోడు. మొదటిసారి విననట్లుగానే ఉంటాడు. కానీ, రెండు మూడు సార్లు చెప్పేటప్పటికి, నెమ్మది నెమ్మదిగా భ్రమలో పడిపోతాడు.

శుద్ధమైన భావనతో తల్లిదండ్రులకు సేవచేసేవారికి ఎప్పుడూ అశాంతి అనేదే ఉండదు. ఈ జగత్తు అలాంటిది. ఈ జగత్తుని చూడనట్లుగా ఉండకూడదు. అప్పుడు లోకమంతా అంటుంది, తప్పంతా కొడుకుదేనని. అబ్బాయిలు తల్లిదండ్రులకు సేవ చెయ్యకపోతే, అందులో తల్లిదండ్రుల తప్పేముంది? 'వాళ్ళు తల్లిదండ్రులకు సేవ చెయ్యలేదు కాబట్టి వాళ్ళకీ ప్రాప్తం లేదు' అంటాను నేను. ఈ పరంపరే తప్పు. ఇప్పుడు మనం కొత్త ఒరవడిలో ఈ పరంపరను వదిలేస్తే మంచిది.

పెద్దలకు సేవచేస్తే మన విజ్ఞానంలో అభివృద్ధి వస్తుంది. విగ్రహాలకు సేవ చెయ్యగలమా? విగ్రహాలకు కాళ్ళు నొప్పిలేస్తాయా? సేవైతే సంరక్షకులు, గురువులు, పెద్దవాళ్ళకు చేయాలి.

తల్లిదండ్రులకు సేవ చెయ్యటం మన ధర్మం. ఖాతాలో ఎలాగైనా ఉండనీ, వాళ్ళకి సేవచేయటం మన ధర్మం. తన ధర్మాన్ని ఎంత పాటిస్తే మనకి అంత సుఖం సంప్రాప్తమౌతుంది. పెద్దవాళ్ళకి సేవ ఎలాగూ జరుగుతుంది, దానితోపాటు మనకి సుఖం సంప్రాప్తమౌతుంది. తల్లిదండ్రులకు సుఖాన్ని కలిగిస్తే మనకీ సుఖం ప్రాప్తిస్తుంది. తల్లిదండ్రులకు సేవచేసే వ్యక్తికి దుఃఖమనేది ఎప్పటికీ ఉండదు.

ఒక పెద్ద ఆశ్రమంలో నాకు ఒక భాయ్ కనిపించాడు. 'మీరేమిటి ఇక్కడ?' అని అడిగాను. 'నేను ఈ ఆశ్రమంలో గత పది సంవత్సరాలుగా ఉంటున్నాను' అన్నాడతను. 'మీ తల్లిదండ్రులు ఊళ్ళో అవసాన దశలో ఎంతో దారిద్ర్యంలో అలమటిస్తున్నారు' అన్నాను. దానికి అతను, 'అందుకు నేనేం చెయ్యను? నేను వాళ్ళ మీద ధ్యాసపెట్టుకుంటే నా ధర్మం నిలిచిపోతుంది' అన్నాడు. దాన్ని ధర్మమని ఎలా అంటాం? కన్న తల్లిదండ్రులను చూసుకోవటం, అన్నదమ్ములతో కలివిడిగా ఉండటం, అందరితో బాగుండటం, ఇదీ ధర్మం. అందరితో వ్యవహారం ఆదర్శప్రాయంగా ఉండాలి. స్వధర్మాన్నే తిరస్కరిస్తూ, తల్లిదండ్రులతో సంబంధాన్ని తెంచుకుని, దాన్ని ధర్మమని ఎలా అంటారు?

నేనూ నా తల్లికి సేవచేసాను. ఇరవై సంవత్సరాల వయసు అప్పుడు. తల్లి సేవ చేసాను, తండ్రికి భుజం ఇచ్చాను. అంతే జరిగింది సేవ. నాకు లెక్క అర్థమైంది. ఇలా (పూర్వ జన్మలలో) ఎందరో తండ్రులు అయ్యారు. ఇప్పుడు చేసేదేముంది?

జవాబు వచ్చింది, 'ఇప్పుడు ఎవరున్నారో వాళ్ళకి సేవ చెయ్యి'. పోయినవాళ్ళు పోయారు. కానీ ఇప్పుడు ఎవరైతే ఉన్నారో, వాళ్ళకి సేవచెయ్యి. అలా ఎవరైనా ఉంటే సరి, లేదంటే అందుకు చింతించకు. అలా ఎందరో అయ్యారు. ఎక్కడైతే మర్చిపోయావో అక్కడి నుంచే లెక్క మొదలుపెట్టు. మాతాపితల సేవ ప్రత్యక్ష సేవ. భగవంతుడు ఎక్కడ కనిపిస్తాడు? భగవంతుడు కనిపించడు. మాతాపితలే కనిపిస్తారు.

అప్పుడు ఎవరైనా బాధపడుతుంటే 65 సంవత్సరాల వయసు లేక అంతకంటే ఎక్కువ వయసువాళ్ళే ఎక్కువ బాధపడుతున్నారు. కానీ వాళ్ళు ఎవరికి చెప్పుకుంటారు? పిల్లలు పట్టించుకోరు. పాత, కొత్త తరాల మధ్యలో అగాధం ఏర్పడింది. ముసలివారు పాత రోజులను వదిలిపెట్టరు, దెబ్బలు తింటున్నా సరే వదలరు.

**ప్రశ్నకర్త :** అరవై ఐదు సంవత్సరాలు వచ్చేసరికి అందరి పరిస్థితీ అలాగే ఉంటుంది కదా?

**దాదాశ్రీ :** ఔను. అదే పరిస్థితి. ఇక్కడ అదే పరిస్థితి ఉంటుంది. అందుకే ఈ కాలంలో వాస్తవంగా చెయ్యగలిగేది ఏముంటుంది? ఏదైనా ఒక చోట ఈ వృద్ధులకు ఉండటానికి ఒక స్థానం ఏర్పరచటం మంచిది. అలా నాకు అనిపించింది. మళ్ళీ అనుకున్నా, అలా ఏమైనా చేస్తే, ముందు వాళ్ళకి ఇక్కడ జ్ఞానం ఇచ్చి, వాళ్ళు తినటానికి తాగటానికి ఏర్పాట్లు చేసి, ఇతర సామాజిక సంస్థలకు అప్పజెప్పినా పరవాలేదు నడుస్తుంటుంది. కానీ, జ్ఞానం ఇచ్చి, దర్శనం చేయిస్తున్నా కూడా పని జరిగిపోతుంది. ఈ జ్ఞానాన్ని ఇస్తే పాపం వాళ్ళకి ప్రశాంతత లభిస్తుంది. లేకపోతే ఎవరి ఆసరాతో శాంతి లభిస్తుంది?

మీ ఇంట్లో పిల్లలకు సంస్కారం ఎలా వస్తుంది? మీరు మీ తల్లిదండ్రులకు నమస్కరించండి. ఇంత పెద్దయిన తర్వాత, వెంట్రుకలు తెల్లబడ్డ తర్వాత కూడా మీరు మీ తల్లిదండ్రులకు ప్రణామం చెయ్యటం చూసిన పిల్లలకు కూడా మనసులో, ఇలా తండ్రి లాభాన్ని పొందుతుంటే మనమెందుకు పొందగూడదు అనే ఆలోచన రాదా? ఇక మీ పాదాలను స్పృశిస్తారా లేదా?

**ప్రశ్నకర్త :** ఈ కాలపు పిల్లలు తల్లిదండ్రుల పాదాలను స్పృశించరు. వాళ్ళ సంకోచం ఉంటుంది.

**దాదాశ్రీ :** తల్లిదండ్రుల పాదాలను ఎందుకు స్పృశించరో తెలుసా? ఈ పిల్లలు తల్లిదండ్రులు చేసే తప్పులను చూస్తారు. అందువలన వాళ్ళు 'పాద నమస్కారం చేసేందుకు అర్హులు కారు' అనుకుంటారు కనుకనే, పాదాలు పట్టుకోరు. వాళ్ళలో ఆచార వ్యవహారాలు, ఆలోచనలు ఉన్నతంగా, బెస్ట్ అనిపిస్తే వాళ్ళు తప్పక కాళ్ళు పట్టుకుంటారు. కానీ ఈ కాలం తల్లిదండ్రులు పిల్లల ముందు కూడా దెబ్బలాడుకుంటూ వుంటారు. తల్లిదండ్రులు దెబ్బలాడుకుంటూవుంటారా లేదా? ఇక పిల్లలకు వాళ్ళ పట్ల ఆదర గౌరవాలు ఎంతవరకు ఉంటాయి?

ఈ ప్రపంచంలో ముగ్గురు వ్యక్తుల ఉపకారం ఉంటుంది. ఆ ఉపకారం మర్చిపోయేది కాదు. మాతా పిత, గురువులు. ఎవరైతే మనలను సరైన మార్గంలో పెట్టారో వాళ్ళ ఉపకారాన్ని మరువగూడదు.

**-జై సచ్చిదానంద**

# నవకలమ్

(తొమ్మిది ప్రగాఢ అంతరంగ భావనలు)

(ప్రతిరోజూ మూడుసార్లు చదవండి)

1. ఓ దాదా భగవాన్! దేహధారియైన ఎ జీవాత్మ యొక్క అహంకారము కించిత్ మాత్రము కూడా గాయపడటకు నేను కర్తను, కారాయితను, ప్రేరకుడను, అనుమోదకుడను కాకుండునట్లు నాకు పరమశక్తిని ప్రసాదించండి.

   ఏ దేహధారి జీవాత్మ యొక్క అహంకారమును ఏ మాత్రము గాయపరచకుండు నట్టి సాత్విక వాణి, వార్తన, విచారము కలిగి ఉండునట్లు నాకు పరమశక్తిని ప్రసాదించండి.

2. ఓ దాదా భగవాన్! ఎవరి ధర్మ ప్రమాణములు కించిత్ మాత్రము కూడా కించపడుటకు నేను కర్తను, కారాయితను, ప్రేరకుడను, అనుమోదకుడను కాకుండునట్లు నాకు పరమశక్తిని ప్రసాదించండి.

   ఎవరి ధర్మము యొక్క ప్రమాణమును అణుమాత్రమైన కించపరచ కుండుటకు తగిన, అందరికీ ఆమోద్యమైన సాత్విక వాణి, వార్తన, విచారము కలిగి ఉండునట్లు నాకు పరమశక్తిని ప్రసాదించండి.

3. ఓ దాదా భగవాన్! ఏ దేహధారి ఉపదేశక సాధు, సాధ్వీ, ఆచార్యుల పట్ల అవర్ణవాదం,అపరాధం, అవినయం చేయకుండ ఉండే పరమ శక్తిని ప్రసాదించండి.

4. ఓ దాదా భగవాన్! ఏ దేహధారి జీవాత్మ పట్ల ఏమాత్రమైనా అభావం, తిరస్కారం, నానుండి ఎప్పుడూ జరగకుండా, జరిగించకుండా, కర్తగా ఆమోదించకుండా ఉండగల పరమ శక్తిని ప్రసాదించండి.

5. ఓ దాదా భగవాన్! నేను ఏ దేహధారి జీవాత్మ పట్ల ఎప్పుడూ కఠోరమైన పదజాలంతో, జగడాలమారి పదజాలంతో మాట్లాడకుండా, మాట్లాడించకుండా, లేదా మాట్లాడటానికి ఆమోదించకుండా ఉండగల పరమ శక్తిని ప్రసాదించండి.

ఎవరైనా కఠోరంగా, తగవులాడే భాషలో మాట్లాడితే నేను మృదు సరళ భాషలో మాట్లాడేందుకు పరమ శక్తిని ప్రసాదించండి.

6. ఓ దాదా భగవాన్! నేను ఏ దేహధారి జీవాత్మ పట్ల, స్త్రీ పురుష నపుంసకులు ఏ లింగానికి చెందినవారైనా, వారిపట్ల ఏమాత్రమైనా విషయవికార సంబంధ దోషాలు, కోరికలు, చేష్టలు, లేక ఆలోచనల దోషాలు ఉండకుండా, అలా చేయించకుండా లేదా కర్తగా ఆమోదించకుండా ఉండే పరమ శక్తిని ప్రసాదించండి.

   నేను నిరంతరం నిర్వికారిగా ఉండగల పరమ శక్తిని ప్రసాదించండి.

7. ఓ దాదా భగవాన్! నేను ఏ విధమైన ప్రత్యేక రుచికీ అలవాటుపడకుండా ఉండే శక్తిని ప్రసాదించండి.

   సమరస ఆహారాన్ని తీసుకునే పరమ శక్తిని ప్రసాదించండి.

8. ఓ దాదా భగవాన్! ఏ దేహధారి జీవాత్మ యొక్క ప్రత్యక్ష లేదా పరోక్ష, జీవించివున్నా లేదా మరణించినా, ఎవరిపట్లనైనా ఏమాత్రమైనా అవర్ణవాదం, అపరాధం, అవినయానికి పాల్పడకుండా, అలా చేయించకుండా, లేక కర్తగా ఆమోదించకుండా ఉండగల పరమ శక్తిని ప్రసాదించండి.

9. ఓ దాదా భగవాన్! జగత్ కళ్యాణ కార్యములో సాధనముగా మారుటకు నాకు పరమ శక్తిని ప్రసాదించండి, శక్తిని ప్రసాదించండి, శక్తిని ప్రసాదించండి.

   (పై విధంగా దాదా భగవాన్ని అడుగుతూ ఉండండి. ఇది ప్రతిరోజూ యాంత్రికంగా చదవాల్సిన విషయం కాదు, హృదయంలో ఉంచుకోవలసిన విషయం. ఇది ప్రతిరోజూ ఉపయోగ పూర్వకముగా అనుభూతి చెందాల్సిన విషయం. ఈ సవరత్నాలలో సమస్త శాస్త్రాల సారము ఇమిడి ఉన్నది)

## శుద్ధాత్మకి ప్రార్థన

హే అంతర్యామీ పరమాత్మా! నీవు నాలో ఉన్నవిధంగానే జీవులందరిలో విరాజమానమై వున్నావు. నీ యొక్క దివ్య స్వరూపమే నా నిజ స్వరూపము. నా నిజ స్వరూపము పవిత్ర ఆత్మ.

హే శుద్ధాత్మ భగవాన్! నేను నీకు అభేదభావముతో అత్యంతభక్తి పూర్వకంగా నమస్కరించుచున్నాను.

అజ్ఞానవశాత్తు నేను చేసిన తప్పులనన్నింటిని ❖ నీ ముందు ఒప్పుకొనుచున్నాను. నేను ఈ తప్పులకు పశ్చాత్తాపం చెందుతూ నీ క్షమకై అర్థిస్తున్నాను. ప్రభూ! దయతో నన్ను క్షమించు, నన్ను క్షమించు, నన్ను క్షమించు. ఆ తప్పులను మరల చేయకుండునట్లు నాకు శక్తిని ప్రసాదించు.

హే శుద్ధాత్మ భగవాన్! మాకు నీతోగల భేద భావము తొలగిపోయి మేమందరము నీతో అభేదతను పొందునట్లు ఆశీర్వదించు. మేము సదా నీతో అభేదతతో తన్మయాకారతను చెందెదము గాక!

(❖ గతంలో నీవు చేసిన తప్పులను గుర్తు తెచ్చుకోవాలి)

## ప్రతిక్రమణ : దివ్యమైన క్షమాపణా విధానము

నేను దాదా భగవాన్ సాక్షిగా ❖...................... యొక్క మనోవచన కాయము కంటె పూర్తిగా వేరైన పవిత్రాత్మకు నమస్కరించుచున్నాను.

నేను నా తప్పులను జ్ఞప్తికి తెచ్చుకొన్నాను (ఆలోచన) ❖❖

ఆ తప్పులకై నేను క్షమాపణ కోరుచున్నాను (ప్రతిక్రమణ)

ఆ తప్పులను మరల చేయనని దృఢముగా నిశ్చయించుకొనుచున్నాను (ప్రత్యాఖ్యాన్)

ప్రియాతి ప్రియమైన దాదాభగవాన్! ఈ దృఢ నిశ్చయమును పాలించు శక్తిని నాకు అనుగ్రహించు.

❖ మీ వలన గాయపడిన వ్యక్తి పేరు

❖❖ ఆ వ్యక్తిపట్ల మీరు ఒనర్చిన దోషాలను గుర్తుచేసుకోవాలి.

## తెలుగులో దాదా భగవాన్ పుస్తకాలు

| | |
|---|---|
| 1. | అన్ని చోట్లా సర్దుబాటు |
| 2. | విభేదాలను తొలగించడానికి |
| 3. | ఎలాగైనా జస్టిస్ జరిగింది |
| 4. | బాధితుడు తప్పిదము |
| 5. | క్రోధం |
| 6. | చింత |
| 7. | నేను ఎవరు? |
| 8. | భావనతో మెరుగుపడతాయి జన్మ-జన్మలు |
| 9. | మృత్యు సమయం దానికి ముందు, దాని తర్వాత... |
| 10. | ఆత్మ సాక్షాత్కారం |
| 11. | మానవ ధర్మం |
| 12. | సేవ, పరోపకారం |
| 13. | ప్రతిక్రమణ |
| 14. | భార్యాభర్తల దివ్య వ్యవహారం |
| 15. | అంతఃకరణ స్వరూపం |
| 16. | పాప-పుణ్యం |
| 17. | తల్లి-తండ్రి, పిల్లల వ్యవహారం |

❖ తెలుగులో మరిన్ని పుస్తకాలు జోడించబడుతున్నాయి మరియు త్వరలో అందుబాటులోకి వస్తాయి.

❖ Dada Bhagwan books are available in different languages: Gujarati, Hindi, English, Marathi, Telugu, Kannada, Oriya, Malayalam, Bengali, Punjabi, Assamese, Tamil, German, Spanish, Russian, etc.

❖ 'Dadavani' Magazine is published every month in three languages: Gujarati, Hindi & English.

❖ All Dada Bhagwan books and magazines are also available on online book store : https://store.dadabhagwan.org

# దాదా భగవాన్ ఫౌండేషన్ తెలుగు యూట్యూబ్ ఛానల్




- ❖ ఇది అడాలజ్ దాదా భగవాన్ ఫౌండేషన్ యొక్క అధికారిక తెలుగు యూట్యూబ్ ఛానెల్.
- ❖ దిగువ లింక్ నుండి తెలుగు భాషలో సత్సంగ వీడియోలను చూడండి.

**'Dada Bhagwan Foundation Telugu' Channel:**

https://dbf.adalaj.org/yttelugu

*Open Link OR*

*Scan QR*

YouTube

---

*Dada Bhagwan Foundation Youtube video channels are available in other regional languages: Gujarati, Hindi, Marathi, Bengali, Tamil, Telugu, Kannada, Malayalam, Spanish, Portuguese, etc.*

# Persons to Contact

## Dada Bhagwan Foundation

**Adalaj** : **Trimandir**, Simandhar City, Ahmedabad-Kalol Highway
P/O: Adalaj, Dist. Gandhinagar - 382421, Gujarat, India.
Tel: +91-9328661166 / 9328661177
E-mail : info@dadabhagwan.org

**Mumbai** : **Trimandir**, Rushivan, Kajupada, Borivali (E)
Tel: +91-9323528901

| | | | |
|---|---|---|---|
| **Kolkata:** | 9830093230 | **Delhi:** | 9810098564 |
| **Jaipur:** | 9351408285 | **Chennai:** | 9789906461 |
| **Bhopal:** | 9425024405 | **Patna:** | 7352723132 |
| **Indore:** | 9039936173 | **Amravati:** | 9422915064 |
| **Raipur:** | 9329644433 | **Bangalore:** | 9590979099 |
| **Chandigarh:** | 9780732237 | **Hyderabad:** | 9885058771 |
| **Kanpur:** | 9452525981 | **Pune:** | 9422660497 |
| **Bhubaneswar:** | 8763073111 | **Jalandhar:** | 9814063043 |
| **Varanasi:** | 9795228541 | **Sangli:** | 9423870798 |

| | |
|---|---|
| **USA: Dada Bhagwan Vignan Institute**<br>Tel: + 1-877-505-DADA (3232)<br>Email: info@us.dadabhagwan.org | **U.K: Dada Darshan (UK)**<br>Tel: +44 330-111-DADA (3232)<br>Email: info@uk.dadabhagwan.org |
| **Germany** : +49 700 32327474<br>**UAE** : +97 1557316937<br>**Kenya** : +25 4722722063<br>**Dubai** : +971 501364530 | **Australia** : +61 421127947<br>**Singapore** : +65 81129229<br>**New Zealand** : +64 210376434 |

Website : www.dadabhagwan.org



## తిట్టటం ద్వారా కాదు, ప్రేమతో సరిదిద్దండి

తల్లిదండ్రులు పిల్లలను సరిదిద్దటం కోసం అంతా ఫ్రాక్చర్ చేసేస్తారు. పిల్లలకు సద్బుద్ధి కలగాలని మనం వారి పట్ల భావాన్ని కొనసాగించాలి. అలా చెయ్యగా చెయ్యగా దాని ప్రభావం పడక మానదు. వాళ్ళు నెమ్మదినెమ్మదిగా అర్థం చేసుకుంటారు. నువ్వు భావన చేసుకుంటూవుండు. వాళ్ళని బలవంతపెడితే వాళ్ళు మొండికెత్తుతారు. మరి పిల్లలనైతే కొట్టనే వద్దు. ఏమైనా తప్పు చేస్తే వాళ్ళ తలమీద చెయ్యి వేసి నెమ్మదిగా అర్థమయ్యేటట్టు చెప్పండి. ప్రేమగా చెప్తే పిల్లలు తెలివైనవారు. వెంటనే అర్థం చేసుకుంటారు. తాత్పర్యమేమిటంటే, ఈ ప్రపంచమంతా ఎలాగోలా సర్దుకుని పోవలసినటువంటిదే.

–దాదాశ్రీ

मूल दीपक से प्रकटे दीपमाला

dadabhagwan.org

9 789391 375874

Printed in India

Price ₹90